అధ్యాత్మ యోగాలయ ప్రచురణలు :

# మహాభారత కథలు

( అరణ్య పర్వము )



This book is Published by the Author and a financial assistance of Rs. 4100/- is received from the Department of cultural affairs, Govt. of Andhra Pradesh who has sanctioned the amount in G. O. Ms. No. 102 (GAD) Deptt., Dated 13-3-1985.

రచన :

కామరాజుగడ్డ రామచంద్రరావు

పి. జె. 49 పంజగుట్ట కాలనీ,

హైదరాబాదు-500 482.

వెల : రూ. 16/-

మహాభారత కథలు (అరణ్యపర్వము)
రచన: కామరాజుగడ్డ రామచంద్రరావు,
పిజె-49 పంజగుట్ట, హైదరాబాదు-500 482
ప్రతులు: 1000
జూన్ 1986
ముద్రణ: సునీతా ఆర్టు ప్రింటర్సు,
పంజగుట్ట, హైదరాబాదు-500 482
కవరు పేజీ బొమ్మ: శ్రీ శీలా వీర్రాజు

దొరుకు స్థలము: గ్రంథకర్తవద్ద లేదా సిటీ పుస్తకాల షాపులు
వెల: రూ. 16/-

అమ్మకమునకు——

| | |
|---|---|
| శ్రీమద్భగవద్గీతా మననము 1 | 6-50 |
| శ్రీమద్భగవద్గీతా మననము 2 | 15-00 |
| మహాభారత కథలు | |
| ఆదిసభాపర్వములు | 16-00 |
| అరణ్య పర్వము | 16-00 |
| శాంతి పర్వము (అచ్చులోనున్నది) | |
| ధర్మవ్యాధుని బోధలు | 2-00 |
| వేదాంత డిండిమము (తాత్పర్య సహితం) | 3-50 |
| సాధన గ్రంథ రత్నములు I | 1-25 |
| సాధన గ్రంథ రత్నములు II | 2-00 |
| యోగాలయ ప్రార్థన మంజరి (స్తోత్రములు) | 1-00 |
| లక్ష్మీనారాయణ హృదయము | 1-20 |
| కామకళా విలాసము (అద్వైత సిద్ధాంతము) | 0-25 |

# విషయ సూచిక

చతుర్థాశ్వాసము :



పంచమాశ్వాసము :



షష్ఠాశ్వాసము :



సప్తమాశ్వాసము :

డా॥ ఓగేటి అచ్యుతరామశాస్త్రి, ఎం.ఏ., పి.హెచ్.డి.
లెక్చరర్ తెలుగు శాఖ,
విజయనగర్ కాలేజి ఆఫ్ కామర్స్,
విజయనగర్ కాలని,
హైదరాబాదు-500457.

# పీఠిక

"మహాభారత కథలు" అన్న పేరుతో శ్రీ కామరాజుగడ్డ రామచంద్రరావు గారు వెలువరిస్తున్న సంపుటముల వరుసలో నిది రెండవది. లోగడ వెలువడిన మొదటి సంపుటములో ఆది సభాపర్వముల కథలు పొందుపరుచబడినవి. ఇందు అరణ్య పర్వములోని కథలు సంపుటీకరింపబడినవి.

మహాభారత ప్రాశస్త్యమునుగూర్చి కవిత్రయమువారు సెలవిచ్చిన వాక్యములను దిఙ్మాత్రముగ స్మరించుట మంగళకరము. నన్నయ ఉల్లేఖాలంకారమునకు మహాలక్ష్యమనదగిన "ధర్మతత్త్వజ్ఞులు ధర్మశాస్త్రంబని యధ్యాత్మవిదులు వేదాంతమనియు" అను పద్యములో వేదవ్యాసుడు "విశ్వజనీనమై పరగుచుండఁజేసె భారతంబు" అని సెలవిచ్చినాడు. తిక్కన "వేదములకు నఖిల సత్కృతి వాదములకు బహుపురాణ వర్గంబులకున్ వాదైనచోటులను దా మూదల ధర్మార్థ కామమోక్ష స్థితికిన్" అని ఆనతిచ్చినాడు. ఇందు 'మూదల' అనగా Reference Book అని యర్థము. ఇక ఎఱ్ఱన ప్రసాదించిన ఈ పద్యమునరయుదము:

చం. భారత పుస్తక ప్రతతిపాయక యేసుకృతాత్మునింట నొ
ప్పారుచు నిత్య పూజనల నందుచునుండుఁ దదీయవాసమున్
జేరి తలిర్చునిష్ట జయసిద్ధి నిజంబు పురాణ పూరుషా
ధారకథామయంబగుటఁ దత్సదృశంబులె యొండు గ్రంథముల్
(హరి. ఉత్తర. ఆ-10-339)

ప్రతి యింటియందును మహాభారత పర్వములన్నియు ఎల్లప్పుడు తప్పక ఉండవలెను. అవి నిత్యము పూజనలు అందుకొనుచుండవలయును. అట్టి గేహి సుకృతాత్ముడు. అతని యింటనన్నియు జయములే వచ్చిపడుచుండును.

భారతము పురాణ పురుషుల కథలతో నిండియుండుట వలన దానికి సరిపచ్చు గ్రంథము మఱొకటి లేదు. అని తాత్పర్యము.

ఈ పద్యమునందలి "నిత్య పూజనములు" "ఇష్టజయసిద్ధి" "పురాణ పూరుషాధార కథామయంబు" అను ప్రయోగములు మిక్కిలి కీలకములైనవి. వీనికి వాచ్యకక్ష్యలో తెలియవచ్చు సామాన్యార్థముకంటె ధ్వని కక్ష్యలో స్ఫురించు విశేషార్థము అద్భుత రమణీయమైనది. పూజనలు – అనునది శ్రవణ పఠనమననములను గర్భీకరించుకొన్నమాట. ఈ మూడును ఉత్తరోత్తర బలీయములైన క్రమ పరిణత దశలను సూచించు ప్రక్రియలు. మననము అనుభవమునకు సంబంధించినది. అనుభూతికీ, సిద్ధికీ దారి తీయించునది. జయసిద్ధి - అనగా మోక్షప్రాప్తియని యర్థము. వ్యాసుడు భారతమునకు పెట్టిన అసలు పేరు జయము అన్నదే. మానవుడు మోక్షమును సాధించుటయే జయము అని దీని యంతరార్థము. పురాణము – అనగా త్రికాలా బాధితమైనది; నిత్య నూతనమైనది, అని యర్థము. అట్టి చరిత్రలుగల మహనీయులే పురాణ పురుషులు. వారి కథలతో నిండారియున్నట్టిది భారతము. సారాంశమేమన పురాణ పురుషుల కథలతో నిండిన మహాభారత పరమార్థమును శ్రవణ పఠన మననములద్వారా అనుభూతికి తెచ్చుకొని సాధనా మార్గమున పయనించి మోక్షప్రాప్తికి నోచుకొనవలెను అన్నది.

ఆ మహనీయుడెట్టన యేనాడో చెప్పిపోయిన మహాపద్యమిది. ఆయన చెప్పిన సందర్భమేదైనను కావచ్చును. మనకు మాత్రము ఈ ప్రస్తుత సందర్భమునకు చక్కగా నతికినట్లుండి బాగుగా నుపకరించు పద్యమనుట ఏపాటి మాట! భారతము ప్రతి ఇంటిలోను తప్పక ఉండవలెను అన్నది ఎఱ్ఱనగారి నిష్కర్ష. చెప్పినది భారతమే అయినను నిది రామాయణ భాగవతాది సమస్త మహాగ్రంథములకు కూడ గ్రాహకమని భావించుట బాగు. మరి ఇప్పుడీ గ్రంథములు ఎందరి ఇళ్ళలో నుండుచున్నవి? అన్నదొక విచికిత్స!

ప్రస్తుతము మన సమాజములోనొక చిత్రమైన "Communication gap" ఏర్పడినది: దానిని పూరింపవలసిన బాధ్యత మనపైనున్నది. ఇట్లనుటలో

నా యభిప్రాయమిది; మన పూర్వీకులు, మన మహా పురుషులు, మన మహర్షులు ఈ సామాజిక జీవనము నిత్య చైతన్య విలసితముగ నుండుటకు కావలసిన నైతిక, సాంస్కృతిక, ధార్మిక, ఆధ్యాత్మిక విషయముల నెన్నింటినో మనకు ప్రసాదించిపోయిరి. ఆ సంపదకు మనము వారసులము. అది భద్రముగ పదిలపఱచి తరువాతి తరములవారి కందింపవలసిన బాధ్యత మనయందున్నది. లేనిచో ఈ దైవీ సంపత్తివలన నుండి వారు దూరమై వంచితులగుదురు! అంతకు మించిన హాని మఱొకటి లేదు! మరి ఇప్పుడీ కృషి యెంత మోతాదులో జగురుచున్నదన్నది మఱొక విచికిత్స! ఇదియే "కమ్యూనికేషన్ గాప్" అని నేనంటిని. ఇది పూరింపబడవలయును. ఈ దిశలో అసలే ప్రయత్నములు జరుగుట లేదనిగాదు. ఎందరో కొందరు మహనీయులు అనేక విధముల యథాశక్తి కృషి చేయుచుండుట ఆశాజనకమైన విషయమే. ఇది మరింత ఉద్ధృతము కావలయును. "మహాభారత కథలు" అను సంపుటములను వెలయించుటద్వారా శ్రీ కామరాజుగడ్డ రామచంద్రరావుగారు చేయుచున్న కృషి అందులో నొక భాగమని నిశ్చయముగా భావించుట లెస్స.

ఇది అరణ్యపర్వ కథల సంపుటి. అసలీపర్వమే కథలపుట్ట. విషయ వైవిధ్యముగల కథలెన్నియో ఇందున్నవి. పాండవులరణ్యవాసములో నున్నప్పుడు వారిని పలుకరించి ఓదార్చుటకు వారి శ్రేయోభిలాషులైన మహర్షులెందరో వచ్చి పోవుదురు. ధర్మజుడు ఏదేని ఒక ధర్మసందేహము గూర్చి వారిని ప్రశ్నించును. అది తీర్చుటకు వారొకటియో, ఒక కొన్నియో కథలు చెప్పి అందలి పరమార్థమును వివరింతురు. ఇదీ, ఈ పర్వమునందలి యితి వృత్తమని చెప్పవలసిన పనిలేదు. ఈ పర్వమునందలి మొదటి సగమును నన్నయ వ్రాయగా తక్కిన సగమును ఎఱ్ఱన వ్రాసినాడు. నన్నయగారి కథాకథన శిల్పము అనితర సాధ్యమైనది. ఆ శిల్పమును అదే స్థాయిలో అందిపుచ్చుకొని తన కథలను రమ్యముగ సంతరించిన మహనీయుడెఱ్ఱన. ఈ యిర్వురి కథాకథన సరళిని, వీరు వ్యాసముని ప్రణీత పరమార్థమును తెల్లము చేసిన విధమును చక్కగా నాకళింపు చేసికొని, ప్రసన్న రమ్యమైన శిష్ట వ్యావహారిక శైలిలో వాటిని పునరావృత్తము చేయుటలోగాని తమకు క్షుణ్ణమైయున్న శాస్త్ర పరిజ్ఞాన మార్గమును వరవడిగా పెట్టుకొని

అందలి అంతరార్థములను వెలికితెచ్చి మిలమిల మెఱయించుటలోగాని శ్రీ రామచంద్రరావుగారు కృతార్థులైనారని చెప్పుట మామూలు మాట!

వ్యాసుడు దీనికి వనపర్వమని పేరుపెట్టగా నన్నయ అరణ్యపర్వమను మాటను వాడుకలోకి తెచ్చుటకుగల కారణమేమై యుండును? అన్న జిజ్ఞాస లోగడ ఒకటి రెండుసార్లు నాకు కలిగినది. సమాధానము ఇప్పుడీ గ్రంథమున లభించినది. అరణ్యము అనగా ప్రశాంతత కలిగినది అని యర్థమట! న + రణ = యుద్ధములేనిది, దానిమీదుగా అరణ్యమైనదట! ధర్మరాజు అరణ్యమునకు చేరుటయనగా ప్రశాంతిని పొందుటకని యర్థమట! ఇది చదివి నేనాశ్చర్యపోయితిని! ఇట్టి విశేషము లిందుకోకొల్లలు. "అవగత శ్రమణిక" అను శీర్షికన నలదమయంతుల కథయందిమిడియున్న పరమరహస్యములను వీరు వెలార్చిన విధము వీరి మేధా విలసనమునకొక మచ్చుతునక యని పేర్కొనవలయును.

శ్రీ రామచంద్రరావుగారు ఈ గ్రంథమును వ్రాయుటలో అవలంబించిన ప్రధానమైన విధానమిది: ప్రతి కథకు ఒక పేరుండును. ఆ పేరునందిమిడి యున్న వ్యుత్పత్త్యర్థమునుబట్టి దానియంతరార్థమును గూర్చి తొలుత విచారించుట: ఆయంతరార్థము ఆ కథలోనెట్లు సర్వవ్యాప్తముగ నంతర్లీనమై యున్నదో మలుత కనుగొనుట! దానిని సమన్వయించి కరతలామలకము చేయుట! వ్యాసుడు భారతమునకు పెట్టిన అసలుపేరు "జయము" అనియు. జయమనగా మోక్షప్రాప్తి యనియు పూర్వోక్తము. ఆయర్థమునననుసరించి యిందలి ప్రతికథయొక్క పరమార్థము మోక్షమునందెట్లు పర్యవసించునో, పర్యవసించవలెనో నిర్దేశించి చెప్పుట!

శ్రీరామచంద్రరావుగారు వస్తుతః సాత్త్వికస్వభావులు. దానికి వయః పరిణతి, ఆత్మానుభూతితోడై ముప్పిరిగొన్నవి. దీనికితోడు వీరు మంచి చేయితిరిగిన రచయిత. లోగడ వివిధ విషయములపై ఎన్నో వ్యాసములు వ్రాసిరి. "శ్రీ మద్భగవద్గీతా మననము" వంటి గ్రంథములను వెలయించిరి. ఆ యనుభవము ఈ గ్రంథమునకు మెఱుగులు పెట్టినది. ఇదొక రమణీయ ఖండముగ రూపొందినది. నేను ఉస్మానియా విశ్వవిద్యాలయమునుండి "ఎఱ్ఱన అరణ్య పర్వశేషము"పై పి. హెచ్. డి. చేసి డాక్టరేట్ పట్టమును

పొందిన విషయము తెలిసియే కావచ్చును వీరు దీనికి పీఠికను సంతరించవల సినదిగా నన్ను కోరిరి. పీఠికలు వ్రాయునలవాటు అంతగా లేకపోవుటవలన మొదట తటపటాయించితిని. చివరికి ఇది నాకు గుండెదగ్గరి విషయముగదా యని అంగీకరించితిని. గ్రంథమును చదువుటకు ప్రారంభించి ఒక్క విడతలో ఆమూలాగ్రముగ పూర్తిచేసితిని. ఔరాయని అచ్చెరువందితిని! క్రొత్త విషయములు కొన్ని తెలిసికొంటినిగదాయని ఆనందపడితిని. యథా శక్తిగను, యథోచితముగను ఈ పీఠికను సంతరించితి. వీరు సాధ్యమైనంత త్వరలో ఇతర సంపుటములనుగూడ వెలయించి జిజ్ఞాసువులకు మహోపకార మొనర్తురుగాక యని మంగళా శాసనము చేయుచున్నాను.

"మహాభారత కథలు" అన్నపేరునుచూసి ఓహో యివి కథలు కాబోలు అని అలవోకగా భావించి యెవరుగాని యీ గ్రంథమును చదువనివారైనచో నది భ్రమపడుటయేయని మనవి చేయుచున్నాను. అంతగొప్పగా వ్రాయబడిన గ్రంథమిది. ప్రతియింటిలోను భారతము తప్పక ఉండవలెనని యెఱ్ఱనగారి నిర్దేశము. దానితోపాటు ఈ గ్రంథముకూడ నుండవలెనని అస్మదాదుల అభిలాష. "మహాభారతకథలు" సంపుటము మీ చేతులయందున్నది. సెలవు.

ఓగేటి అచ్యుతరామశాస్త్రి

6-6-1986

# రచయిత మనవి

మహాభారతంలోని కథల్లో ఏవో కొన్నైనా తెలియని వారుండరు. ఐతే అన్నీ సమగ్రంగా చదివి ఆంతర్య మెరిగినవారు ఎక్కువ మంది ఉండక పోవచ్చు. పుస్తకాలు చదివె అలవాటున్నవారికి ఎప్పుడన్నా, మొత్తం కథలన్నీ చదివితె బాగుండుననిపిస్తుంది. అది సంస్కారం:

వాటన్నిటినీ ఒక్కచోట అందించే పుస్తకం సంస్కృతంలోనో తెలుగు పద్యాల్లోనో మాత్రం ఉన్నది. వచనంలో వాడుక భాషలో చదవాలంటె ఉన్న పుస్తకాలు చాల సకృతు.

ఈ "మహాభారతకథలు" అనే గ్రంథం ఐదు సంపుటాలుగా యోజన చేయబడింది. మొదటి సంపుటంలో ఆది సభాపర్వాలున్నాయి. దానిని బ్రహ్మ విద్యా ప్రచార ట్రస్టు అనే సంస్థవారు ప్రస్తుత 'అధ్యాత్మ యోగాలయ' 1-10-134 అశోక్‌నగర్ హైద్రాబాదు 500 020 కి అనుబంధించిఉన్న కాలంలో అచ్చువేయించారు. దాని ప్రతులు అధ్యాత్మయోగాలయసంస్థవారి వద్ద (రూ. 16/-) వెలకు లభ్యమవుతవి. ఇప్పుడీ అరణ్యపర్వ ప్రచురణ రెండవ సంపుటంగా నేనే ప్రచురిస్తున్నాను. దీనికి ఆంధ్రప్రదేశ్ సాంస్కృతిక వ్యవహారాల శాఖవారు, రూ. 4100/-లను విరాళమును మంజూరుచేసినారు. కాని ఈ పైకము చాలని కారణమున మరియు అది అందుటకు పూర్వమె పుస్తకము అచ్చువేయవలసిన షరతు ఉండటంచేత అధ్యాత్మ యోగాలయ (ప్రచురణల విభాగం) ట్రస్టు స్రష్టయైన స్వామి ధీరానందజీ సమయానికి సహకరించారు. ప్రభుత్వశాఖవారికీ, ధీరానందజీకీ కృతజ్ఞతాభినందనలు, శాంతిపర్వాన్ని ప్రచురించడానికి టి.టి.డివారి సహాయంద్వారా ప్రయత్నం జరుగుతున్నది. ఇక మిగిలిన యుద్ధ కథల సంపుటమూ చివరి 6 పర్వాల సంపుటమూ ఎవరో ప్రచురణ కర్తలు పూనుకొనే వరకూ ఆలస్య మవుతుందనిపిస్తున్నది.

శ్రీమదాంధ్ర మహాభారతాన్ని ప్రాతిపదికగాజేసి అందలి అన్ని కథలనూ వ్రాస్తూ అంతర్గతమైన ధర్మాలను ప్రస్తుత పరిస్థితుల దృష్ట్యా వ్యాఖ్యానిస్తూ ఈ రచన వాడుక భాషలో చేశాను. విషయం ప్రధానంగా మనసులోనుంచు కొని వ్రాసిన గ్రంథమిది.

పుస్తకానికీ పఠకుడికీ మధ్య అనుబంధం ఉండాలి. ఈ అనుబంధమనేది నాల్గు స్థాయులు (1) అధికారం (2) సంబంధం (3) విషయం (4) ప్రయోజనం. తెలుగువాడుక భాషను తెలిసి చదువగలిగిన ప్రతియాతడూ భారతీయ సంస్కృతిపై అసూయ అసహ్యం—లేని వాడైతె, ఈ పుస్తకం చదువడానికి అధికారం పొందినవాడు అవుతాడు. సంబంధం అనేది భారతీయ సంస్కృతి గాక ఇతర విషయాల్లో నిమగ్నమైపోయి ఉన్నవాళ్ళు ఈ పుస్తకంతో ఏలాటి సంబంధం పెట్టుకోలేదుగనుక ఆ ఇతరములపై యేకాగ్రత సడలి దృష్టి జాతీయ సంస్కృతివైపు పెట్టేవారికి ప్రాప్తిస్తుంది. ఇక 'విషయం' పుస్తకంలో చెప్పిన సాధనలె. ప్రయోజనం, మహాభారత ప్రయోజనమేనని మనవి:

ఐతె మహాభారత ప్రయోజనమేమిటి? అనచ్చు. అది పంచమవేదం. వేదాల ప్రయోజనమేదో మహాభారత ప్రయోజనమూ అదె. వేదాల్లో పూర్వ మీమాంసలో యజ్ఞయాగాదులు చేసి చిత్తశుద్ధి సంతరింపజేయడం ఉత్తర మీమాంసలో మోక్షసాధనను చెప్పి మోక్షాన్ని కరతలామలకం చేయడం:— ఇదె వేదాల ప్రయోజనం. పరిణామాత్మకంగా ఈ మహాభారత కథల ప్రయోజనమూ అదె.

కథలు చెప్తూనె ఎక్కడికక్కడ వీలయినంతవరకూ మోక్షసాధనా భాగం విశదీకరించడానికి కృషి జరిగింది. పాఠకులు సూచనల ననుసరించి యోచించి బుద్ధి వికాసాన్ని విజృంభింపజేసి వ్యాసహృదయం ఎఱుగగలరని ఆశిస్తున్నాను. వ్యాసమహర్షె తాను వ్రాసిన కథలు కేవలం కథలు కావనీ అందలి అంతరార్థం అదృష్టవంతుడెవరికో అవగతమవుతుందనీ అన్నాడు. శ్రీ వేదుల సూర్యనారాయణశర్మగారి అంతరార్థ మహాభారతం ఈ నా కృషికి ఎంతో ఉద్ధృతి నిచ్చింది. వారికి నా నమస్సులు.

ఈ కథలు పై కారణంచేత వేదార్థబృంహితాలు, మోక్షసాధనా బోధకాలు ధర్మసూక్ష్మ దర్శకాలు ఆపదోద్ధారకాలు ఊహాపోహైక వికాసాలు, మనోహ్లాదైక మహోక్తులు, అవునో కాదో చదివి, పాటించి, తెలిసి చెప్పండి! వినేది చెవులు మాత్రమెకాదు. చదివేది కళ్ళు నాలుకేకాదు. అంతర్గతంగా ఉన్న బుద్ధి ఈ పనులు చేసేది! అది వికాసాన్ని ఏ క్షణానో పొందాలి! ఆ

పొందిన: స్ఫుడె అసలు విషయం అవగతమయేది!! ఎంతవరకు చెప్తే అంత వరకేకాదు-అర్థం కావలసింది!!!

పూజ్యులు మిత్రులు శ్రీ ఓగేటి అచ్యుతరామశాస్త్రిగారు భారతం అరణ్య పర్వ శేషంపై కృషిచేసి పరిశోధించిన మనీషి! మహావక్త. విశ్వహిందూ పరిషత్‌వారి కార్యక్రమాల్లోనూ దేశభక్తి కార్యక్రమాలల్లోనూ వారు సతతమూ పాల్గొని మహత్తర సందేశాలను సమాజానికి అందజేస్తుండటంద్వారా నాకు పరిచయులయినారు. వారు సహృదయులు కావడంచేత నా యీ పుస్తకానికి పీఠిక వ్రాయడానికి అంగీకరించినారు. వారికి నా మనఃపూర్వక నమస్సులు. ఈ సంపుటాలకు తగిన విధంగా కవరుపేజీ చిత్రాలను వ్రాసి యిచ్చిన శ్రీ శీలావీకి కృతజ్ఞతలు. ఈ అరణ్యపర్వం ఆసక్తి పూర్ణులై అచ్చువేసిన సునీతా ఆర్టు ప్రింటర్సు పంజగుట్ట యజమానులైన శ్రీ యస్. శేషగిరిరావు గారికి కృజ్ఞతలు.

పిజె 49 పంజగుట్ట
హైదరాబాదు-500 482
10-6-1986

ఇట్లు,
కామరాజుగడ్డ రామచంద్రరావు

# మహాభారత కథలు

(అరణ్యపర్వం. 1వ ఆశ్వాసం.)

## 1. అరణ్య ప్రవేశం

పాండవులు ద్యూతంలో ఓడిపోయినారు. అనుకున్నప్రకారం తమరాజ్యాన్ని పన్నెండేండ్లపాటు దుర్యోధనాదులకువదలి ఒక సంవత్సరం అజ్ఞాతవాసం చేయడానికి కృతనిశ్చయులై రాజ్యంవిడిచి వెళ్లిపోయినారు. ఒకానొకఒప్పందంలో ప్రవేశించి, దానిని సక్రమంగా నెరవేర్చడంలో సమర్థుడు ఎంతో సంతోషాన్ని పొందుతూఉంటాడు. అందువల్ల తనకువచ్చే లాభనష్టాలమాట అటుంచి—అది తన కర్తవ్యమని నెరవేర్చడం కర్మయోగి లక్షణం. కర్తవ్యమనేది నిజానికి సమాజానికి చేయవలసిన సేవ. అలా చేయకపోతే సమాజంలో ధర్మం పోతుంది అని పూర్వంనుంచీ ఇప్పటి వరకూ ఉన్న శాసనమె.

కాని ధర్మరాజు బద్ధుడైయున్న ఒడంబడిక, చాల దుష్టమైనది. ధర్మరాజు దానిని పాటించి నడుచుకోవటం "ధర్మమనె స్థిరమనసుతో ఉన్నా—తమ్ముళ్లూ భార్య ద్రౌపదీలకు అలాలేదు. ఇది శుద్ధ అన్యాయమయిన ఒప్పందంగనక దానిని పాటించక తిరుగుబాటు చేయటం అవసరమన్నదృష్టిఉన్నది. అక్రమమైన కాంట్రాక్టులు చెల్లవని ఇప్పటికీ మనశాసనమున్నదికదా! ఈ సమస్యను ధర్మరాజుతో వాళ్లు చాలసార్లు చర్చిస్తారు అరణ్యావాసంలో ఉండగా. దానివల్ల మనం ధర్మమేదో తెలిసికోవడానికి వీలుంది.

అరణ్యాలకు అలావెళ్ళిపోతున్నవారినిచూచి ఎంతో మంది పౌరులు పుటపుట దుఃఖిస్తారు— "ఇక ఈ కౌరవరాజ్యంలో మేముండటంఎలా?మీయంతవారినే వీరిలాచేశారు. మీరు వెళ్ళిపోతే ఇక మాకు సత్సంగం ఉండదు,దుస్సంగమేకాని. దుర్జన దర్శన, స్పర్శన, సంభాషణలే మాకుగతి.అందుకని మీతోపాటు మేమూ వచ్చేస్తా" మంటారు.

ఈ పరిస్థితి మన మనసుల్లో మనం జ్ఞాపకముంచుకోవాల్సినది. వీళ్ళకు వేయి మాటలు చెప్పి ధర్మరాజు వెనక్కు పంపేస్తాడు. "మీరు మాతోపాటు వనవాసక్లేశం భరించడం కుదరదు. సరికాదు" అంటాడు. పాపం వాళ్లు వెళ్ళిపోతారు—దుఃఖిస్తూ. కాని ఈ పరిస్థితె మరునాడు మళ్ళీ కలుగుతుంది చిత్రంగా—

పాండవులు గంగాతీరంలో ప్రమాణాఖ్యవటం క్రిందకు ప్రవేశిస్తారు. గంగాస్నానంచేసి ఒక రాత్రంతా ఉదకం త్రాగి ఉంటారు. ఉదయంకాగానే, అగ్నిహోత్రాలూ, శిష్యులతోసహా బ్రాహ్మణులు పురం వదలి వచ్చిచేరుతారు. "మాకు మీ సత్సంగమేకావాలి. వనవాసక్లేశం మాకు లెక్కలేదు. మేము ఎల్లప్పుడూ దొరికినదానితో తృప్తిపడే వాళ్లమె. వనంలో పండ్లూ కాయలుతిని బ్రతుకగలం. అందుకని మమ్మల్ని మీతోరాకుండ వారింపవద్దంటారు. "బ్రాహ్మణులు" అన్నారని బ్రాహ్మణ కులంలో జన్మించినవారేను అని అనుకోవలసిన పని లేదు. క్రిందటి రోజునవచ్చినపౌరులలో వనవాసక్లేశానికిసిద్ధంగా ఉన్నవారందరూ అయి ఉంటారు. వారిలో బ్రాహ్మణులూ ఉండినవారై అగ్నిహోత్రాలతోసహా రావడంచేత అలా వారిపేరుతో వచ్చారని చెప్పడం అయిందనేది నిజమనిపిస్తుంది. అలావచ్చిన వారంతా నిజానికి బ్రహ్మపదార్థతత్త్వ జ్ఞాన సాధకులయి యుంటారు. అందుకనె బ్రాహ్మణులన్నాడు వ్యాసుడూ కవిత్రయమూను.

## ❋ వివేకబోధ ❋

వీరంతా తమ వెంట వస్తున్నారనేది స్థిరంకాంగానే ధర్మరాజు తనపై అనంతమైన భారంవేసికొని "వీళ్ళ నెలాపోషించటం, అందుకు తగిన అర్థం ఎలాతెస్తాను! తేలేకపోతె వీళ్ళంతా ఎమయిపోతారు;" అని విచారించి శోకంతో మూర్ఛితుడై పడిపోతాడు. ఇదీ ధర్మరాజులో గొప్పతనం. అప్పుడు శౌనకుడు నేడదేరిన యుధిష్ఠిరునికి ధైర్యంచెప్పుతూ అంటాడు—

క. శోకభయస్థానంబు లనేకంబులు గలిగినను, విహీనవివేకుం
డాకులతఁ బొందువట్లు వివేకముగలవాడు బుద్ధివికలుండగునే

"కష్టాలు కలిగే పరిస్థితు లనేకం ఉండవచ్చుగాక, కాని వివేకం కలిగినవాళ్లు వివేకం లేనివాడిలా బాధల్లోపడడుసుమా! అని. ఆవివేకం ఏమిటో చెప్పడం ఆరంభిస్తాడు. "శోకమనేది శారీరకం అనీ, మానసికమనీ రెండురకాలు. శారీరకం ఏమిటంటె వ్యాధి, శ్రమ, అనిష్ట మయిందికలగటం, ఇష్ట మైంది రాకపోవటం, అనేవాటి ద్వారా కలిగేవి. వీటికి బుద్ధిమంతుడు ఆయాక్రియ మొదలైన ప్రత్యుపాయాల చేత ఉపశమిల్ల చేసికొంటాడు. మానసిక శోకము, స్నేహంలోపుట్టి నటువంటిది. ఈ దుఃఖము "విమలజ్ఞానము" వల్ల ఉపశమిల్లి, జలముల చేత అగ్ని తగ్గినట్లుగా తగ్గిపోతుంది. ఇదీ వివేకము.

స్నేహమనే సముద్రంలో మునిగి మానవుడు మహాదుఃఖంలో పడిపోతాడు. ఈ స్నేహమె రాగాదులకు మూలము. అందుచేత బంధు మిత్ర ధనసంచయాలపై స్నేహాన్ని వదలి వేయాలి. తామరాకు నీటిని అంటించుకోకుండ నీటిలోనే ఉంటున్నట్లు ఉండాలి. లేకపోతె స్నేహం వల్లరాగం, రాగంవల్ల కామం, కామంవల్ల క్రోధం క్రోధంవల్ల తృష్ణ, తృష్ణవల్ల సర్వదోషాలూ సంక్రమిస్తయి. తృష్ణవల్ల కలిగిన అర్థలోభం ఎలాంటిదంటె–చెట్టుతొఱ్ఱలో నిప్పుపెట్టినట్లయితె అది మొత్తం వృక్షాన్నిఎలాతగుల బెట్టేస్తుందో అలా వినాశనంకలిగించేది ఎందుకనంటె–అర్థవంతులకు అంటెడబ్బుగలవారికి రాజు, చోరులు, స్వజనం, నీరు, నిప్పులనే నాల్గింటి వల్ల భయం కలుగుతూ ఉంటుంది. అందుచేత అర్థోపార్జనచింత చేయవద్దు" అంటాడు శౌనకుడు. దాని కొరకుదుఃఖపడవద్దని బోధ. అర్థాన్ని ఆర్జింపవద్దనికాదు చెప్పేది. అది దుఃఖావహ మయేదోవ అనీదానిని త్రొక్కవద్దనీధ్వని. బుద్ధిమంతులెలా ఆలోచిస్తారో అలా ఆలోచించుమంటాడు. వాళ్లురూప యౌవ్వన, ధన, విభవ, ప్రియసంవాసాలు అనిత్యాలని ఎరిగినవారై వాటికి విమోహం పరు అని శౌనకుడు ధర్మరాజుకు చెప్పాడు.

ధర్మరాజుకె చెప్పవలసిన స్థితి పట్టిందంటె, అక్కడ ధర్మ సందేహమేదో గహనమైనదిఉన్నదనేవిషయం మర్చిపోకూడదు. అప్పుడు ధర్మరాజు అంటాడు "నాకోసంనేను అర్థ చింతనం చేయటం లేదయ్యా! కాని నేను గృహస్థును. సాధురక్ష చేయవలసిన వాడను. అదినా కర్తవ్యము. ఆర్తునకు పడక నివ్వాలి. భయపడిన వాడికి అభయమివ్వాలి. దప్పిగొన్నవానికి జలమివ్వాలి, ఆకలిగొన్న వానికి అన్నమివ్వాలి. శ్రమించినవానికి ఆసనమివ్వాలి. ఈ గృహస్థ ధర్మాలన్నీ ఎలానడపటం అనేదేనాచింత-అంటాడు.

అందుకు శౌనకుడు, — సంకల్పం ఇలాగె ముందుగా కలుగు తుంది. వచ్చినవాళ్ళందరకూ ఏదోసమకూర్చాలని. అందుకు డబ్బు కావాలనె కామం వస్తుంది. ఆతరువాత అప్పుడు మనసుచేత ప్రేరణ కలిగి ఇంద్రియాలు విషయములలో జొరబడి అభిలషిస్తవి. ఆఅభిలా షమంటవంటిది. ఆమంటకు దేహాలు తేజోలుబ్ధులై శలభంలాగా శోక మనే మంటలోపడిపోతారు. దీనినుండి తప్పించుకొనే మార్గం ఉంది. అది వేదంలో చెప్పబడింది. ఏమనంటె కర్మానుష్ఠానాన్ని చేయటమె. దానికి ఎనిమిదివిధాలైన ప్రక్రియలున్నవి. వాటన్నిటినీ చేయాలి. అవే మిటంటే (1) సరియైన సంకల్పంతోనే సంబంధం పెట్టుకొనటం (2) ఇంద్రియనిగ్రహం (3) వ్రతాలు చేయడం (4) గురుశుశ్రూష చేయడం (5) ఆహారయోగం (6) అధ్యయనాగమం (7) కర్మ కర్తృత్వసన్యాసం అంటే ఫలం మీద ఆసక్తివదలడం (8) చిత్తనిరో ధము ఇవి. వీటిద్వారా సంసారాన్ని జయించాలి. నీకు శుశ్రూష, శ్రవ ణం, గ్రహింపు, ధారణ, ఊహాపోహార్థవిజ్ఞానము, తత్త్వజ్ఞానము, ఉండనేఉన్నాయి. అందుచేత నీకు ఏవేవి ప్రారబ్ధాలైవచ్చినవో — సంక్ర మించినవో — అవన్నీకూడ సంపన్నాలవుతాయి అనినేను చెప్తున్నాను" —

"వ్యక్తి తానుతలచిన దాన్ని పొందేదిఎలాగంటే తపస్సిద్ధుడు కావటం వల్లనె. అందుచేత తపస్సుచేసి యోగార్థ సిద్ధిని పొందాల్సింది అంటాడు.

ఏం తపస్సు! ఎలాచేయాలి!! అని ధర్మరాజు ఆలోచించి ధౌమ్యుని సంప్రదించుతాడు. ధౌమ్యుడు తీవ్రంగావిచారించినవాడై "పూర్వం భీమ, వైన్య, కార్తవీర్య, నహుష లనేరాజులు యోగ సమాధినిష్ఠితులై సూర్య భజనంచేసి అన్నాన్ని పొంది ప్రజలనుఆపద నుంచి ఉద్ధరించారు. సూర్యుడేగదా భూరసం గ్రహించి, దక్షిణాయనంలో మేఘరూపమై ఓషధులపొంది, రాత్రుల్లో చంద్ర కిరణాలద్వారా అమృతంచేసి సస్యాలుతడుపుతూ అన్నాన్ని పుట్టించేది! కనక సూర్యోపాసన చేయాల్సింది" అంటాడు. అలాఅని, సూర్యుని అష్టోత్తర శతనామము నుపదేశించి విస్పష్టార్థ వర్ణోచ్చారణముతో సహాబోధిస్తాడు. అంటేఅర్థం స్పష్టమైన ఉచ్చారణ అర్థం కూడ బోధించాడు.

ధర్మరాజు అలా సూర్యుని పూజించి, ఇంద్రియ విషయాల పైకి ఇంద్రియాలనుపోనీక, అమల వ్రతాన్నిచేస్తూ, వాయుభోజనుడై ప్రాణాయామపరుడై, ఆసూర్య నామాలతో సూర్యునికొల్చి, జపము చేస్తుంటాడు. సూర్యుడు ప్రసన్నుడై ఆయనకు ఒక తామ్రపాత్రనిచ్చి ధర్మరాజా! నీభార్యయైన ద్రౌపది ఈ తామ్రపాత్ర యందుఈ అరణ్యాల్లోదొరికే శాకఫలాలను వండి పెట్టేటప్పుడు అక్షయమై చతుర్విధాహారాలనిదియిస్తుంది. తీసికొను మని ఇచ్చివెళ్ళిపోతాడు. అప్పటి నుంచీ ధర్మరాజుతనతోవచ్చిన పౌరులనందర్నీ ఆభోజనంతో సంతృప్తిచేస్తూ ఉంటాడు.

తరువాత పాండవులు ఆపౌరులందరితో సహా కామ్యకవనానికి వెళ్ళారు.

హస్తినాపురంలో ధృతరాష్ట్రుడు విదురుడ్నిపిలిచి ధర్మరాజాదు లెలాఉన్నారు! ఎక్కడున్నారు!! చెప్పమంటాడు. విదురుడు ఎన్నో తిట్లు తిట్టుతాడు—దుర్మార్గుడయినట్టినీకుమారుడితో చేరినీవు పాండవులకు చాలా దుర్మార్గంచేశావు. నీకుమారుడు పుట్టినప్పుడె అప్పటి ఉత్పాతాలు

చూచి చెప్పాను—వీడ్ని వదలివేయవలసిందని. నీవువిన్నావుకావు. ఇప్పుడు పాండవులు అరణ్యాలకుపోయినార్సే' అన్నాడు. అప్పట్లో ధృతరాష్ట్రుడు రాజు కనక తిరగబడి— "నువ్వు ఏందాయాదివిరాబాబూ! నాస్వయం కుమారుని వెళ్ళగొట్టుమంటావు. నీసహాయం నాకక్కర్లేదు. దయచేయి ఆపాండవుల దగ్గరకె" అంటాడు. అంతేచాలని విదురుడు పాండవుల వద్దకువెళ్ళిపోతాడు.

ఈ విదురుడు తమవైపుకు వస్తుంటే, ధర్మరాజంటాడు భీముడితో "మళ్ళీ నాచేత జూడమాడించి మనగద గాండీవం మొదలయిన ఆయుధాలుకూడ తీసికోవాలని ధార్తరాష్ట్రులనుకొని ఉంటారు. అందుకె విదురుడు వస్తున్నాడు. ఏమయినాసరె నేను ఇక జూదం ఆడను" అంటాడు. తనపొరపాటు ఇప్పటికి వంట పట్టింది కావలెధర్మరాజుకు. వచ్చిన విదురుడ్ని పూజించి స్వాగతమిస్తాడు. అప్పుడు విదురుడు ఉన్న విషయంచెప్పి, తానుండిపోవడానికె వచ్చానన్నాడు. విదురుడునిశ్చయంగాచెప్పాడు.

ఆ॥ ధర్మరహితుమైన ధార్తరాష్ట్రులకు భూ
రాజ్యలక్ష్మి సుస్థిరంబు గాదు!
ధర్మతనయ నిన్నుఁదర్రాజ్యసంపదల్
వలచి తమకుఁ దామ వచ్చి పొందు॥

అని. పైగా నామాట అయితీరుతుందంటాడు. సర్వాలూ ధర్మరాజే రాజ్యంచేయాలనే చైతన్యం రాజ్యంలో విదురుడి నుంచీ పౌరుడి వరకూ ఉండటం చిత్రమైన విషయం. జ్ఞాపకం పెట్టుకోదగినవిషయం.

ఇలా కొద్దిరోజు లయిందోలేదో ధృతరాష్ట్రుడు, పాండవులతో విదురుడు కలిసి ఉండటం ఇష్టపడనివాడై సంజయుని పిలిచి, వెళ్ళివిదురుణ్ణి తీసికొని రావలసిందని పంపుతాడు. సంజయుడువచ్చి ధర్మరాజునడిగి విదురుణ్ణి ప్రసన్నుణ్ణిచేసి తీసికొనిపోతాడు. విదురుడప్పుడు ధృతరాష్ట్రునితో నీవూనీకుమారుడూ ఏంచెప్పినా నేను పథ్యమైనమాట

చెప్పితీరాలి కనక చెప్తూనే ఉంటాను· నీకు సహాయం చేయడం కర్త వ్యంగా చేస్తూనే ఉంటాను అని ఆపనికి పూనుకొంటాడు. ధర్మరాజూ విదురుడూ ఒకే తాత్త్వికమన సత్వం కలవారనిపిస్తూ ఉంటుంది భార తం చదువుతుంటే—ఇద్దరూ యమధర్మరాజు అంశ అనటంలో ఈసంగతి అవగత మవుతూనె ఉంటుంది.

తర్వాత దుర్యోధనుడూ శకుని మొదలైన వారికి అపటుపుట్టు తుంది. మరీ దుర్యోధనుడికి బాధా ఆరాటం ఎక్కువయింది. ఎందు కనంటె తండ్రీ విదురుడూ కలిసి పాండవుల్ని పిల్చి మళ్ళీరాజ్యం ఏలుకోమంటే ఎలాగ అని:శకుని మాత్రం అంటాడు తాయని రమ్మని కబురంపినా ఆపాండవులు మన ఒప్పందానికి బద్ధులయి ఉన్నకారణం చేత రారుగాక రారు," అంటాడు, కర్ణుడు ఇదంతా గమనించి "ఇప్పటి కిప్పుడు ఆ అరణ్యవాసుల మీదకి దండెత్తిపోయి వాళ్ళని విక్రమం చేత చంపేస్తే వదలిపోదా?" అంటాడు. అదివిని దుర్యోధనుడు ఎంతో సంతోషించి "సై" అంటాడు. కర్ణుడి దుష్టత్వం తెలియడానికి ఇంత కంటే ఇంకేం కావాలి?.

ఈ దుర్వృత్తి అంతా కృష్ణద్వైపాయనుడు దివ్యదృష్టి నెరిగినవాడై హస్తినాపురంవచ్చిధృతరాష్ట్రునితోనీకుమారుడిలా ఇలాప్రయత్నంచేస్తు న్నాడు వారించు" మంటాడు. ఆరాజు దుర్యోధనుడు నామాట వినడు గాక నీవేవాడికి చెప్పుమంటాడు, కృష్ణద్వైపాయనుడప్పుడు "పూర్వం గోమాత అయినసురభి తనజాతిలొ బలమైన వృషభాలతో బలహీన వృషభాలను జోడుకట్టి వాటిని పొడిచి, కొట్టి, తిట్టి మానవులు బాధలు పెట్టటంచూచి సహించలేక బ్రహ్మ దేవుని దగ్గర మొర పెట్టు కొం టుంది. బ్రహ్మదేవుడు కూడ అప్పుడు "నీజాతి బిడ్డలందరూ కష్ట పడటల్లేదు నందలాదిలో ఎవరో కొందరేగదా బాధపడేది అంటాడు. ఈ మాట గోమాతకు కష్టమనిపిస్తుంది. కొందరయితె మాత్రమేం! వాళ్ళు తన బిడ్డలు కాదాఅని.అప్పుడు బ్రహ్మ వర్షంకురిపించితృణాలు

పెరి గేట్లుచేసి బలహీన పశువుల్ని బలవర్ధకాలుగాచేస్తాడు. అలాగే నీకూ నీనూరుగురు కొడుకులపై ఎక్కువప్రేమే ఉండవచ్చుగాని,ఆపాండవులయిదుగురూ కూడ నీకొడుకులు కాదూ! ధర్మరాజు ఇక్కడుంటే ఈ దుర్యోధనుడు కొంతధర్మ మయినా నేర్చుకుంటాడేమో బహుశ" అంటాడు. ధృతరాష్ట్రుడు వినలేదు. పైగా నీవేబుద్ధిచెప్పాల్సింది వాడికి అంటాడు. అప్పుడు వ్యాసుడు "వాడికినేనుకాదు చెప్పేది మైత్రేయుడు వస్తాడు అతడు బుద్ధిచెప్తాడుగాక" అంటాడు.

తీరామైత్రీయుడు వచ్చింతర్వాత దుర్యోధనుడు ఆయనచెప్పిన సలహా వినకపోగా కాలిబొటనవ్రేలు నేలమీద వ్రాస్తూ చేయెత్తి తొడ చరిచి నవ్వేస్తాడు. ఈ ప్రవర్తనకు మైత్రేయుడు విసిగి, "యుద్ధం జరిగి తీరుతుంది నీతొడలు విరగగొట్టి చంపుతాడుగాక భీముడునిన్ను అని శపిస్తాడు. ధృతరాష్ట్రుడు బాధపడి అలాకాకుండ అనుగ్రహించాల్సింది" అంటాడు. అందుకు మైత్రేయుడు—వీడికి సమబుద్ధికలిగితె అలాకాకపోతుందిగాక లేకపోతేతప్పదు అని వెళ్ళిపోతాడు.

వ్యాసుడుబహుశ ఈలాటి శాపం తనే ఇవ్వవలసి వస్తుందేమోననె దుర్యోధనునకు తానే నీతిచెప్పడం మాని మైత్రేయుడ్ని పంపాడు అనిపిస్తుంది.

ధర్మరాజు అరణ్యంచేరటం అంటె ప్రశాంతి పొందటానికి అహంబ్రహ్మాస్మి సాధకుడు ఆరంభించటం అని అర్థం. సూర్యోపాసన చేయవలసి రావటం అంటె పరాత్పరుని ఆశ్రయించటమని అర్థం. సూర్యునికి చెప్పబడే అష్టోత్తరనామాలు కేవలం పరాత్పరుని లక్షణాలెననేది ఆసూర్యాష్టోత్తరనామాలు చదివిన వారికి తెలుసునె ఉంటుంది. సద్వృత్తులు బ్రతకియుండాలంటె ఈజ్ఞానం అవసరమనేది సూర్యప్రసాదంవల్ల వచ్చిన పౌరులంతా బ్రతుకుతూ ఉండ గలిగినారనేది చెప్పటంద్వారా విదితం చేయబడినది.

## ❋ 3. కిమ్మీరవధ — అరణ్యంలో పరామర్శలు. ❋

పాండవులు ప్రమాణారణ్యమనే అరణ్యంలో రెండు రోజులుండి మూడవ నాటి రాత్రి కామ్యకవనంలో ప్రవేశించి వెళుతూ ఉంటారు. హఠాత్తుగా ఒక రాక్షసుడు నోరుతెరచుకొని మిడిగ్రుడ్లతో భయంకరంగా ఎదురువస్తాడు. ద్రౌపది భయపడకుండా ఐదుగురూ పట్టుకొనినిలుచుంటారు. ధౌమ్యుడు రక్షోఘ్నమంత్రాలుపఠిస్తాడు. రాక్షసుని ప్రతిభ హీనమైపోతుందిట అది చదివితె, అంతట ధర్మరాజు ఆరాక్షసుణ్ణి ప్రశ్నవేస్తాడు. నీవెవరు? ఇక్కడి కెందు కొచ్చావు. అని అందుకా రాక్షసుడు—"నేను గీనాశుడనేవాణ్ణి. బకాసురుని తమ్ముణ్ణి. మానవులునన్ను కిమ్మీరుడంటారు. వాళ్ళకునేనంటే మహాభయం. ఈ వనంలోనే నేనుంటాను. రాక్షస మాయలతో మనుజుల్ని చంపి భక్షిస్తూ ఉంటాను. మీ రెందుకు ఇలా భయం లేకుండావచ్చారు. ఇప్పుడె మిమ్మల్నందర్నీ చంపితినేస్తాను" అంటాడు.

ధర్మరాజు అందుకు బదులుగా మేము పాండవులం. ఇతడు భీముడు. ఇతడు ఫలాన అని చెప్తాడు. భీముడనంగానే కిమ్మీరుడు మండిపడతాడు, "ఓహో వీడికోసమే నేను ఎప్పట్నించోచూస్తున్నా. నా సోదరుణ్ణి స్నేహితుడైన హిడింబుడ్నిచంపిన వాడువీడు, వీడ్ని ఇప్పుడు చంపేస్తాను" అంటాడు, అప్పుడు భీముడికి కిమ్మీరుడికి యుద్ధం అవుతుంది. ఆ యుద్ధంలో కిమ్మీరుడినడుమూ మెడపట్టుకొని ఎత్తిక్రిందకు విరిచి చంపి అవతల పారేస్తాడు భీముడు. బకాసురుణ్ణి హిడింబుణ్ణి చంపినప్పుడు కూడ ఇదే ప్రకారం చేశాడు. పైగా "పాపం! బకుడూ హిడింబుడూచచ్చారని పనివి పనివి ఏడవడమేకాకుండా వాళ్ళకోసంయమపురికి కూడా పోతున్నావురా రాక్షసా!" అని ఎగాతాళి ఆడాడట.

ఈ సంగతిని విదురుడు పాండవులతోపాటు ఉండే మనుషుల ద్వారావిని వెళ్ళి ధృతరాష్ట్రుడితో చెప్తాడు. అప్పుడు ధృతరాష్ట్రుడు మహాభయపడి పోతాడు. అయ్యో యీ భీముడితో ఎలాగ వేగడం అంటూ.

పాండవుల మిత్రులైన రాజులకు వీళ్ళంతా పురంవదలి వెళ్ళిపోయి కామ్యకవనంలోఉంటున్నారని తెలుస్తుంది. వాళ్ళంతాధృతరాష్ట్రుణ్ణివానికుమారుల్నీ,తిట్టుకొంటూ కామ్యకవనం బయలుదేరుతారు పాండవుల్ని చూచి రావడానికి. పాంచాల,యాదవ, వృష్ణి, భోజాంధులూ, శ్రీ కృష్ణుడు అంతావస్తారు. ఈ ధార్తరాష్ట్రుల నందరనూచంపి పాండవులకు పట్టంకట్టాలి అంటారు. చిత్రమైన విషయమేమిటంటే శ్రీ కృష్ణుడె మహావేశపరుడై అలా తిట్టి మాట్లాటడం వింటాము. శ్రీ కృష్ణుడు అలా వశంతప్పిన క్రోధమనస్కుడై మాట్లాడటం అతడి లీలావినోద విషయమా! కేవలం అజ్ఞానమా? అని సందేహంవస్తుంది. మనకే కాదు. అక్కడి పాండవులకు కూడ ఇదేమాటనిపించేటంత ఎక్కువగా ఈ వచ్చినవాళ్ళు మాట్లాడటం కన్పడుతుంది. చివరకు అర్జునుడు శ్రీకృష్ణునికి గుర్తుచేస్తాడు.—

"కృష్ణా నీవు పూజ్యుడవు అప్రమేయుడవు అచ్యుతుడవు.నీవునారాయణుడవు. మహాతపస్సుచేసినవాడవు.గాలిని భక్షిస్తూ వేలకువేలేండు తపస్సుచేసినవాడవు.నిన్ను అనృతము,మదము,మత్సరము క్రోధముఈ వికారములు ఆవేశిస్తాయా!ఇలా నీవు ఆవేశుడవై మాట్లాడటం అసమంజసం అనిపిస్తున్న"దంటాడు.అప్పుడు శ్రీకృష్ణుడు సరియైన స్థితికివచ్చి నీవు అప్పుడునరుడవు—నేను నారాయణుణ్ణి. ఇద్దరం మర్త్యయోని యందు పుట్టాము. నీకు కలిగిన కష్టం నాదిగానేనుభావించడం అది సహజంకదా అంటాడు.తరువాత పిచ్చాపాటిమాట్లాడటం ఆరంభిస్తాడు.

ద్రౌపది వచ్చి శ్రీ కృష్ణుడితో తనకయిన పరాభవం సంగతి చెప్పుకొంటుంది."నీవు సర్వకర్మలకూ సాక్షివి నీకు తెలియదనికాదు. నేను పాండురాజంతవాని కోడలనై,ఈ మహావీరుల భార్యనై పూజ్యుడవైన నీకు జెల్లెలినై ధృష్టద్యుమ్నునకు అనుజనై ఆ ధృతరాష్ట్రుడి కొడుకు నాజుట్టు పట్టుకొని ఈడ్చుకురావటమనే పరిభవం అనుభవించుతుంటే వీళ్లూ. భీష్మద్రోణులూ ఇంకా సభలో ఉన్నసర్వులూ కూడ పెదవి విప్పకపోయినారు! ఎందుకు వీళ్ల బల్లం, ధర్మం, జ్ఞాన

మున్నా." నీవు ఉంటే అలా ఊరుకొనేవాడివి కాదు గదా! అనిధ్వని. అలాంటి అసహాయ స్థితిలో నేనున్నప్పుడు కర్ణుడు అపహాస్యం చేశాడు. నామనస్సు దహించుకుపోతోంది. దుశ్శాసనుడు చేసిన పని మనసును కోస్తున్నా. ఈ కర్ణుడు అన్నమాటలు నాకెక్కువగా బాధిస్తున్నాయి. ఇన్నాళ్లుగా యీపాండవులను ధార్తరాష్ట్రులు ఎన్నోవిధాలబాధలుపెట్టితే కూడ, నన్ను ఈ విధంగా వీరి ఎదుట అవమానించిన క్షణాన వీళ్లు పరాక్రమ పరాఙ్ముఖులైనారు. వీళ్లు నామనసుకు సంతోషాన్నెలా కలిగి స్తారిక!" అని భోరుమని ఏడ్చి కన్నీళ్ళుతుడుచు కొంటుంది.

కృష్ణుడప్పుడు ద్రౌపదినిచూచి మహాశాపం పెట్టుతున్నవాడిలా అంటాడు—"ఈ సప్తసముద్రాలూ ఇంకినా. రాత్రింబగళ్లు ఇలా ఉండటం మానేసినా. నేను చెప్తున్నాను; ఈ అర్జునుడి బాణాహతిచేత ధ్రతరాష్ట్రబలాలు మృత్యు సౌధానికెళ్ళి తీరుతయిగాక." అంతకు పూర్వంతాను చెప్పిన ఆవేశ పూరితమైన మాటలకు ఇది పర్యవసానం అని సూచిస్తున్నాడు. అర్జునుడూ ధృష్టద్యుమ్నుడూ కూడ ఆమెను సముదాయిస్తారు.

అప్పుడు కృష్ణుడు ధర్మరాడుతో, నేను మొన్ననే ఈ మీసంగతి విన్నాను. నేను ఇక్కడ ఆద్యూత సమయంలో లేకపోవటం ఇలాటి దుర్వ్యసనంలో మీరు చిక్కుకుపోయారు, కామాన్ని పుట్టించేవి నాల్గు దుర్వ్యసనాలు—(1) స్త్రీ (2) ద్యూతము (3) వేట (4) త్రాగుడు వీటియందు మనస్సుప్రవర్తింప నీయకూడదు. అన్నిటి కంటె ముఖ్యంగా ఈ ద్యూతంలో మనసును ప్రవేశింపనీయకుండాలి. అదె అన్నిటి కంటె ఎక్కువగా అనర్థాన్ని స్తుంటుంది. ఈ సంగతిని నిరూపించిచెప్పి వాళ్ళను ఒప్పించేవాణ్ణిగాక నేనున్నట్లయితె. నా ఎదుట నైతే మీకు ఇలాంటి సిగ్గుబాటు కలుగటం ఉండేదా? నేను అసాల్వునితో యుద్ధం చేస్తూ ఈ పదినెలలూ ఉండిపోయాను అంటాడు.

ధర్మరాజు వెంటనే "అయ్యో! అదేమిటి ఆకథ? అని పరామర్శి

స్తాడు. కృష్ణుడు ద్వారకలో అయిన సంగతులూ యుద్ధం సంగతి వర్ణించి చెప్తాడు—

"శిశుపాలుణ్ణి చంపినందుకు వాడి తమ్ముడయిన సాల్వుడు నాపై కినిసిన వాడై, నన్ను చంపాలని ఆలోచించాడు. ఒకొక్కరినే జయించి నేను ఉద్ధృతి నందుకొన్నానట అందుకని నేను ఎక్కడ ఉంటే అక్కడ వెదికి చంపాలని ఉద్దేశించి, చతురంగ బలాలతోసూ సౌంభ కమనే ఒకానొక మాయా నగరంతో సహావచ్చి ద్వారక చుట్టూ విడిసి నాడు. యాదవులూ తయారయి యుద్ధానికి దిగారు మహాయుద్ధ మయింది. చారుదేష్ణుడు ప్రద్యుమ్నుడు సాంబుడూ వీరంతా మహా యుద్ధం చేస్తున్నారు. నీయజ్ఞం అయిపోయిం తరువాత నేను ద్వారకకు వెళ్ళితినిగదా! ఆసమయానికి ఈ యుద్ధమంతా జరుగుతు న్నది. ఒసారి ప్రద్యుమ్నుడు మూర్ఛపోయి తిరిగి మళ్లీ లేచి యుద్ధా నికి ఉపక్రమించాడు. వెళ్ళి సాల్వుడితో యుద్ధంచేసి వాడిని మూర్ఛ పడేట్టు కొట్టాడు. చంపేస్తానన్నాడట. కాని దేవగణ ప్రేరితులయిన కొందరువచ్చి "వేయకు వేయకు వాడిపై బాణం! కేశవుడొక్కడే సాల్వుని చంపగలిగేది" అన్నారుట. సాల్వుడు లేచి పారిపోయినాడు. అప్పుడునేను వెంటనే యుద్ధసన్నద్ధుడనై రథంఎక్కివెళ్తుంటే గరుడ కేతనం చూచి పలాయనం చిత్తగించాడు సాల్వుడువాడి వెంటనేనుబడి నిలిపియుద్ధంచేశాను. వారు మాయాశక్తులతో నగరం మొత్తం తెచ్చి నాసైన్యం మీదవేయడం వంటి పనులుచేయడంచూచి ఆమాయానగరం తనూ అంతం చేయడానికి ఆగ్నేయాస్త్రం వేశాను. ఆమాయాపురం అదృ శ్యమయింది. కాని ద్వారకనుండి ఎవరోవచ్చి సాల్వుడు వసుదేవుణ్ణిపట్టు కుపోయినాడని వార్తచెప్పారు. తీరా వసుదేవుడ్నీ. ఆయన్ను చెరలో పెట్టిన శత్రువులనూ ఎదుట చూశాను. దుఃఖంచేత మూర్ఛపోయాను. చాలసేపటికి లేచి చూస్తే అదృశ్యం కనపడలేదు. మహాకోపంతో యుద్ధంచేశాను. నా సారథి అన్నాడు "వీరు దురాత్ముడు. వీణ్ణి ఉపేక్ష

చేయద్దుసుమా అని. అప్పుడు చక్రం ప్రయోగించి వాళ్ళను నిర్జించాను. సాల్వుడు అలా చచ్చిపోయినాడు.

ఇలా యుద్ధం కథవిన్న పాండవులు, ఓహో! అరణ్యంలో ఉండక పురంలో ఉంటే మాత్రం చిక్కులు రావటం మానాయా అనుకొన్నారో-లేక అయ్యో మేమున్నట్లయితే యీ కృష్ణునికి సహాయం వెళ్ళి సేవజేసిన వాళ్ళమయ్యే వాళ్ళముకదా అను కొన్నారో తెలీదు. వచ్చిన చుట్టాలంతా నిట్టూర్చి, మేము వెళ్ళి వస్తాము అని చెప్పి, వీడ్కోలు తీసికొని వెళ్ళి పోతారు.

పాండవులు కూడ కామ్యకవనంవదలి ద్వైతవనానికి వెళ్ళడానికి ప్రయాణంకట్టుతారు. ఇరవయిమంది భృత్యులూ వేలకొలది పౌరులూ బ్రాహ్మణులూ ద్వైతవనం చేరుతారు. అక్కడ విడివిడిగా అందరకూ పర్ణశాలలు నిర్మించుకొని ఒకానొక శాంతి ననుభవిస్తూ ఉంటారు. ఉద్ధృతమైన దుఃఖం తనపసనుతగ్గించుకొన్నది. ధర్మం కోసం లేదా కాం ట్రాక్టు నెరవేర్చడంకోసం ఈ పదమూడేళ్లూ చిక్కులు పడకతప్పదని నిశ్చయించుకొని ఊరుకొన్నారు. ఆ వనంలోకి మార్కండేయుడూ బకదాల్భ్యుడూ వంటిమునులు వచ్చి వారి సద్బుద్ధిని పొగడి మీకు జయం కలుగుతుందని దీవించి వెళ్ళిపోతుంటారు. ధర్మరాజు ఆత్మ విశ్వాసం ఆవిధంగా పెరుగుతూవచ్చింది.

## ❋ 4. ధర్మ సందేహాల తీర్పు ❋

కాని ద్రౌపదికి భీమునకు జూద విషయమై సందేహాలు వదలేదు. ధర్మరాజుతో ఈ విషయంపై వాగ్వాదంచేస్తూ ఉండటం ఈ రోజుల్లోనే అయినట్లు భారతంలో మనంచూస్తాము. ద్రౌపదిఅంటుంది ఆ ముసలిరాజు, కొడుకు మాటలువిని క్రూరుడై పాపబుద్ధితోమీరాజ్యం పుచ్చుకొని బయట గ్గొట్టాడు, నానామాటలూ మననువాళ్ళంటుంటే మాట్లాడకూరుకున్నారుగాక. తిరగబడితె యుద్ధంచేయలేరా! పెద్ద మేడల్లో సుగంధ ద్రవ్యాల్లో ఓలలాడి పోయి సుకుమారంగా బ్రతికేమీరూ

మీతమ్ముళ్లూ ఇలా ధూళిధూసరులై అరణ్యాల్లో కందమూలాలుతినటం నేను చూడలేకుండా ఉన్నాను. రాజులకు క్షమ ఒక్కటే కాదు; తేజం కూడఉండాలి.క్షమనూ,తేజాన్నీ రెంటినీ కాలాన్ననుసరించి ఉపయోగించే వాడికి ఉభయలోక సిద్ధిఅవుతుందని ప్రహ్లాదుడు తన మనుమడైన బలికి చెప్పాడు.అపరాధం చేసినవాళ్ళను.ఒకఅపరాధానికయితె క్షమించవచ్చు ఎక్కువ అపరాధాలుచేసిన వాళ్ళనీ, ఎప్పుడూ చేస్తుండేవాళ్ళనీ క్షమించడమనేది తెలివైన పనికాదు. మీరు తేజం వదలి క్షమచేయటంలో ధర్మమేమిటి? అంటుంది.

అప్పుడు ధర్మరాజు సమాధానం చెప్తాడు. మనకు తెలివి ఉన్నందుకు ప్రత్యంగ విషయం గమనించి తెలుసుకొనే అవకాశాన్ని వదులుకోరాదు. క్రోధం వేరు క్షమ వేరు. తేజం వేరు.క్రోధం అనేది పాపము. దానివల్ల ధర్మం, కామం, అర్థం అనే పురుషార్థాలు హాని పొందుతయి. కోపంలో గురువునికూడ నిందించటం, చంపరాని వారిని చంపటం చేస్తారు జనులు.క్షమనుభూమిలా కలిగి ఉన్నవాడికి విజయం కలుగుతుంది. వాడి భుజవిక్రమమే సర్వకార్యాలనూ అతడికి కూర్చుతుంది.నీవు చెప్పిన తేజము అనేదానిలో నాల్గుగుణాలు ఉద్భవించుతయి (1) క్రోధము, (2) సమర్థత (3) శౌర్యము(4) శీఘ్రత్వము. ఇవి కేవలం తేజోవంతుని యందుగాక క్షమావంతుని యందే వీర్య వంతములవుతయి. ఈ సంగతి కశ్యపగీతల్లో చెప్పారు. నీవు తేజం పేరు చెప్పి క్రోధాన్ని రేకెత్తింపజేయకు. బ్రహ్మవిదులకు కలిగె పుణ్యగతులు క్షమావంతులు పొందుతారు. నిజానికి వేదాలు, యజ్ఞాలు, శౌచము సత్యము, విద్య, ధర్మువు, ఈ సచరాచరమైన జగత్తూకూడ క్షమ మీదనె నిలిచినయి అనేది ధ్యానించి అనుసంధానంచెయ్యి—తెలుస్తుంది. నేను పాటించే క్షమను భీష్మద్రోణాదులే ఆమోదించారు. నీవుతప్పు పట్టకు" అంటాడు.

ఆమె ఈయనకు ధర్మంమీదున్న పట్టుదల గ్రహించిందై "అవును మీరు ధర్మమూర్తులె మిమ్ముల్ను ధర్మమేరక్షింస్తుంది, ఆ

విషయంలో నాకు సందేహములేదు.కాని,—శత్రువుల యందు సమబుద్ధి చేయడం తగునా? ధర్మంలేని కౌరవులకు ధర్మం అనేది ఏమిచేయ గలుగుతుంది? క్రూరుల పట్ల క్రూరంగా ఉండకపోతేఅదితప్పనీ అలా ఉండనివారినిఅందుకు శిక్షించాలనీ అంటారు కదా! ఆర్యులయిన నీ తమ్ములకువిహీనతనూ, అనార్యులయిన కౌరవులకు ఉన్నతినీ విధాత చేస్తూఉండటం కార్యంతప్పినవాడవుతున్నాడు. ఈ విధాతయొక్క ధర్మం ఏంధర్మం? అన్నది.

ధర్మరాజు—"ద్రౌపదీ. నాస్తికులులాగా ధర్మాన్నె శంకించకు. దైవదూషణంచేయకు. అలాంటి వారికి ప్రాయశ్చిత్తమే లేదంటారు. ధర్మం నడపాలి అని పాటించటం ఒక ఎత్తు. చేతకాక ఊరుకోవటం దానికంటె తక్కువది. అధమమైనది ఇంకొకటుంది. ధర్మంగా ఉండనవసరంలేదనీ అసలుదైవానికే ధర్మంలేదనీఅనటం, ఇది అతి అధమమైనదని తెలుసుకో. ధర్మంతప్పనివారు నిత్యులై ఇంకా జీవిస్తూనే ఉన్నారు అనేది మర్చిపోకు. మైత్రేయి, మార్కండేయుడు, వ్యాసుడు వసిష్ఠుడు నారదుడు మొదలైనవారు ఉన్నారు.వారు పరమయోగధరులు ప్రత్యక్షంగా వారిని మనం చూడటల్లేదా? వారు కూడ నే చేసింది ధర్మమేనని మన్నిస్తారు. కౌరవులు అన్యాయంచేశారని నేను ధర్మం తప్పడ మెందుకు" అంటాడు.

"కర్మఫలం లేదని అనుకొనకు. ఉంది.పుణ్యం పాపం ఆఫల ప్రాప్తికి కారణం.నియతి భగవంతుడే.అది కాదనకుసుమా"అంటాడు.

ద్రౌపది తన ధోరణి త్రిప్పుకొంటుంది. "అమాత్రపు ఎఱుక లేనిదాన్నికాదు గాక. కాని విధిచేసిన చెయిదానికి అలసిపోయి మాట్లాడానుగాక క్షమించాల్సింది. మీరు చెప్పిందినిజమె. వేద శాస్త్రాలూవిధి విధానాలూ ప్రమాణం కాదనే వారు సరిగా ఆలోచించనివారు. దురాత్మకులు. వారికి పుణ్యగతులుండవుగాక.కర్మ అనేది కర్తవ్యము.కర్మ రహితులై స్థాణువులులాగా ఎవరూజీవించరాదు. కర్మఫల ప్రాప్తికి

నిమిత్తాలు దైవమూ మానుషమున్నూ. పురుషుడు మనస్సులో అర్థ సిద్ధి కోరి కర్మము చేయటంలో ఉత్సాహవంతుడుకావాలి. ఉత్సాహవంతుడయిన తరువాత ఆ కర్మచేసినప్పుడు దైవము వానికి సహాయంచేస్తాడు. చేయకనేపోతె ఫలం ఎలావస్తుంది! కేవలం దైవం మాత్రమె కర్మ ఫలమిస్తాడనే వాడి కర్మ ఎలా ఉంటుందంటె నీటిలోమునిగి ఉండిపోయినచెంబులాగా, వానినోటికి అందని దవుతుంది అనాలి. అన్నది యాజ్ఞసేని"

అప్పుడు భీముడు అంటాడు. "పితృపైతామహమైన రాజ్యాన్నిగాండీవి జయించితెచ్చిన రాజ్యాన్నీ మనంఅనుభవించకుండా ఇతర్లకువదలి వచ్చి, ఇలా వ్రతాలు చేసుకొంటూ ఉండటం బాగాలేదు. బలంలేనివాళ్లు అలాదుఃఖిస్తూఎక్కడో ఒదగ వచ్చుగాక—కాని మనకేమి ఇలా ఉండే కర్మ! నీవు అనుజ్ఞనివ్వు. విరోధుల్ని యుద్ధంలో చంపేస్తాం మేము. అప్పుడిక ఈ కానన్లో ఉండాల్సినపనిలేదు మనకు. మనం సమయాతిక్రమ భీతిచేత, కాంట్రాక్టు నెరవేర్చనివాళ్ళమవుతామనే భయంచేత—ఇలా ఉంటున్నాం. వాళ్ళు మనల్ని పరాక్రమ హీనులుగా తలుస్తారు. అదేగాక-ఏకాంత ధర్మ నిరతుడుగా ఉండేవాడు ధర్మం కామం రెంటినీ వదులుకొన్న వాడవుతాడు—ప్రాణంపోయినవాడు సుఖందుఃఖం రెండూ వదలుకొన్నట్లు గానే. ధర్మం, కామం తరిగి పోతె—అర్థం—డబ్బు ఉన్నవాడు పతితుడై పాపిఅయిపోతాడు. డబ్బును డబ్బుకోసమే గడించేవాడు క్రూరవనంలో ఆవును పెట్టుకొని రక్షించేవాడితోసమానం. అర్థం, ధర్మం కూడ వదలి కామాన్ని మాత్రంకోరేవాడు బురదమడుగులో జలంతోపాటు జలచరంలా చెడిపోతాడు. అందుచేత త్రివర్గమెరిగి సమానంగా వాటిని సేవించాలి. నీవు ఆచరించే ఈ కేవలధర్మం అర్థకామాలకే కాకుండా నీకూ నీబాంధవులకూ కూడ బాధాకరమవుతున్నది. అందుచేతనీవు ఒప్పందం సమయధర్మం(కాంట్రాక్టు) అంటూ ఊరుకొనక ధర్మరక్షణవ్రతం చేపట్టి శత్రువులను నిర్జింపుమని ఆజ్ఞ ఇవ్వాల్సింది."

అందుకు ధర్మరాజు—"నీవు చెప్పింది చాల ధర్మమయిన విషయమె, సందేహంలేదు. కాని నేను "సమయం" చేసికొనటంలో పండ్రెండేండ్లు అరణ్యవాసంఒకయేడజ్ఞాతవాసమనిఒప్పుకొన్నానుగనక దానిని కాదని నీవుచెప్పినట్లు యుద్ధం చేయటం సరికాదు.సత్యముఅనేది గొప్పది. రాజ్యం పుత్రులు ధనం యశస్సు ఇవన్నీ సత్యానికి సమం కావు.నేను సత్యాన్ని అతిక్రమింపను.తగిన సమయంవచ్చేవరకూ ఆగ వలసిందె అంటాడు.

భీముడు మళ్ళి, "శరీరికి మరణమనేది తప్పనిసరి. శరీరం ఎదిలేలోపలనె శత్రువులను జయించాలి. నీ కాంట్రాక్టు చూస్తె నిరంతరం మనం అరణ్యంలో ఉండవలసి వచ్చేటట్లున్నది. పన్నెండేండ్లు మహాబలంతో అరణ్యాల్లోనిల్చినా,ఒక సంవత్సరం అజ్ఞాతవాసంచేయడం సంభవంకాదనిపిస్తుంది.ఇంతగొప్పవాళ్ళమైన మననుఎవ్వరైనాగుర్తిస్తారు. అలాచేస్తే, మనం మళ్ళీపన్నెండేళ్ల అరణ్య వాసం మొదలు పెట్టాలి. నీవు చెప్పేధర్మాచరణం కేవలం బ్రాహ్మణ ధర్మంగాని క్షత్రియ ధర్మంకాదు అంటాడు.

ధర్మరాజు—"భీముడా! అల్పకార్యమయినట్లయితె అదివేరు. దుర్యోధనాదులను జయించడం అనేది అల్పకార్యమనుకొనకు. విచారించి చేయదగినపని అది.వాళ్లు ఆతతాయిలు. అంగరాజు, మద్రభూపతి భూరిశ్రవుడు వాళ్ళకుసహాయంవస్తారు.మనచేత రాజసూయానికిముందు జయింపబడినవాళ్ళంతా వాళ్ళతో కలుస్తారు. కర్ణునకు సహజకవచమున్నది. అతడి బాహువిక్రమంతలుచుకొంటే నాకు నిద్రరావటల్లేదనుకో! భీష్మద్రోణ కృపాచార్యులు కౌరవులకూ మనకూ సములే అయినా వారు వారిదగ్గర ఉండటంచేత మన పక్షంలో ఉండి యుద్ధం చేస్తారనుకొనకు.వారిని జయించిన తరువాతనే దుర్యోధనుని మనం శిక్షింపగలిగేది" అంటాడు.

ధర్మరాజుకేవలం రాజనీతిని ప్రధానంగా చర్చించిన మాటలివి: ధర్మం నీవుచెప్పింది బాగానే ఉన్నదంటూనే, యుద్ధానికి ఒప్పుకోక

పోవడానికి ధర్మపరంగా సత్యాన్ని దాటరాదనిచెప్పి, రాజకీయంగా గెలుపు ఓటమి ఎలా ఉంటుందో ఆలోచించి మరీ యుద్ధానికిదిగాలనె సత్యంచెప్తున్నాడు. ఎంతవివేకి! మెత్తనిపులి!!

ధర్మరాజు ధర్మాన్ని అనుసరించి నడిచాడా లేక కేవలం ప్రాపంచిక వివేకాన్ననుసరించినడిచాడా అని ఒకొక్కప్పుడు సందేహం రావచ్చు. ధర్మాన్నె అనుసరించాడని వ్యాసుని సిద్ధాంతం. అదినిజమె కాని ధర్మానికీధర్మానికీ సంఘర్షణం వచ్చినప్పుడు ఊహాపోహత్వాన్ని ప్రధానం చేయకపోలేదు ధర్మరాజు. పైగా దానికి ప్రాధాన్యతఇచ్చినా సంఘర్షణపడుతున్న ధర్మాలనువిశదీకరించి సమస్యను విడదీయటంలో ఆయన ఒకానొక ధర్మాన్నే అనుసరించటంచూస్తాం. అనగా అది అధర్మము అనకలిగే అవకాశమే ఉండదనిధ్వని. అందుకని ధర్మరాజు ఎల్లప్పుడూ ధర్మాన్నే అనుసరిస్తున్నవాడు అనటానికి ఏలాంటి విప్రతిపత్తిన్నీ కలుగదు. ఇది గ్రహించడం ముఖ్యం.

## ❋ 5. అర్జునుని ఇంద్రకీలాగ్గమనం ❋

అరణ్యంలో ద్వైతవనంలో పాండవులు ఉండగా కృష్ణద్వైపాయనుడు వచ్చాడు. ఈయన పాండవులకు ఏదో ఒక మంచిని చేయాలనుకున్నప్పుడల్లా బయలుదేరి వస్తూ ఉంటాడు. అలాగే మంచి చెప్పాలనుకొని దుర్యోధనాదులవద్దకూ వెళ్తుంటాడు. ఈయన చెప్పినమంచిని దుర్యోధనాదులు వినరు. పాండవులు వింటారు. అయితె "మీరుచేయబోయే ఫలానిపని చెడ్డదికనక అది చెయ్యొద్దు" అని నిషేధ పూర్వకంగా చెప్పటంచేత, దుర్యోధనాదులు వినరుబహుశ—అంటే—వారి తరఫున ధృతరాష్ట్రుడు నాచేతులో ఏమీలేదని తప్పుకొంటాడు.

ద్రుపదరాజు పిలువనంపిన స్వయంవరానికి పాండవులువెళ్లేటప్పుడు కృష్ణద్వైపాయనుడు అప్పటిది ఆయాజ్ఞసనికి ఐదుగురుగంధర్వులుభర్తలన్నట్టుసూచించి మాత్రంవెళ్ళిపోతాడు. కుంతి ఆ కీలకం పట్టలేనిదాన్నినిఅర్జునుడు జయించుకొచ్చిన స్త్రీని అందరు పాండవుల

కూ ఇచ్చి పెళ్ళిచేయిస్తుంది. ఈ ఐదుగురూ కలిసి ఒకే కుటుంబంగా ఉంచి ధర్మంస్థాపించాలనే కః ద్రౌపదినిట్లా పెళ్ళి చేశాడు వ్యాసుడు అని పిస్తుంది.

ఇంతకూ కృష్ణ ద్వైపాయనుడిచ్చినసూచనను గ్రహించి పాటిస్తున్నవాళ్లుపాండవులైతే-ఇలాచేయకుఅనేనిషేధాన్ని కూడ మన్నించని వారు ధార్తరాష్ట్రులు. మంచి-చెడు ఇలా పాండవులకూ కౌరవులకు చెందుట మనేది అప్పటిప్రజలకు మామూలయిపోయి గమనిస్తున్నారు.

వ్యాసుడు అలా రాపడంతోనే ధర్మరాజు ఆయన్ను పూజిస్తాడు. అప్పుడు వ్యాసుడు "నీవు చింతిస్తున్నావు అభీష్మద్రోణకర్ణులతోకూడిన కౌరవులను ఎలాజయించడమూఅని. ఆసందర్భంలోనే సలహాఇవ్వాలని వచ్చా" నంటాడు.మామూలుగ నయితే ఇది పక్షపాతబుద్ధి అంటాము. కాని మంచిచెప్తే గ్రహింపక చెడునే చేసే కౌరవులను ఇంకాఏమని ఆదరించి బోధించగలడు వ్యాసుడు మాత్రం! మంచినే గ్రహించే పాండవులకు ఇంకా మంచి నుపదేశించాలని ఉండటం చూసిఆయనకు పక్షపాతం అనడం సరికాదనిపిస్తుంది.

ఇంతకూ కృష్ణద్వైపాయనుడు "ప్రతిస్మృతివిద్య" అనే దాన్ని ధర్మరాజుకు ఉపదేశిస్తాడు.దీనిని తరువాత అర్జునునకు చెప్పుమంటాడు పైగా ఆతడ్ని ఇంద్ర యమ వరుణ కుబేరాది దేవతలనూ ఈశ్వరునీ ప్రత్యక్షంచేసికొని దివ్యాస్త్ర శస్త్రాలను పొందుమని చెప్పవలసినదని కూడ చెప్పి వెళ్ళిపోతాడు.

పాండవులు ఆ తర్వాత ద్వైతవనం నుంచి కామ్యక వనానికి వస్తారు. సరస్వతీ తీరంలో కొన్నాళ్లు నివసిస్తారు; అక్కడ ఆ ప్రతిస్మృతి విద్యను ధర్మరాజు అర్జునునకు ఉపదేశించి, "నీవు వెళ్ళి దేవతలను సంతృప్తిపరచి దివ్యాస్త్రాలను పొందవలసిందని పంపుతాడు. అర్జునుడు గాండీవంతో అక్షయ బాణతూణీరాలతో బయలుదేరుతుంటే పంచభూతాలు, అక్కడి పెద్దలూ "అంతా ఇష్టసంసిద్ధి అవుగాక" అని దీవిస్తారు.

పాంచాలి అర్జునునితో అంటుంది. "ఆర్యా!—అవమానాన్ని సహింపడాలని ఈ క్షత్రియకులంలో ఇక పుట్టకూడదని కోరుకొంటాను గాక. ఇప్పటికి ఇది తప్పదు. దుష్పరాభవార్ణవంలో మునిగియున్న మమ్ములనందర్నీ సముద్ధరించబోయేనిన్ను "దిక్కులు౯ ధరణియు సోముడున్ నభము ధాత్రియు గాడ్పునుగాచుండెడిన్" అంటుంది. స్నేహలాలనతో వీడ్కోలునిస్తుంది. అర్జునుడు గంధమాదన పర్వతాలు దాటి వెళ్ళిపోతాడు. గంధమాదన మంటే మనిషి మనసులోని "వాసనా పరంపరానాశకమని చెప్తారు. దైవంమీద భారంవేసి వెళ్తున్న వాడికి గంధమాదన పర్వతంలో రాళ్ళలా వాసనలు సమసిపోతవిట!

ఇంద్రకీలాద్రిపైనడిచి వెళ్తుంటే "ఇంకపోకు"అనేమాట వినబడుతుంది. ముందెవరో వృద్ధబ్రాహ్మణుడు ఆసీనుడై ఉంటాడు. అతడికి నమస్కరించి అక్కడనే అర్జునుడున్నూ కూర్చుంటాడు. "క్రోధాన్ని విసర్జించిన తపస్వులుండే యీచోట ఈ బాణాలతో విల్లులతో ఉండ కూడదు నాయనా! వాటిని పారవేయుమంటా డా బ్రాహ్మణుడు. అర్జునుడు మాట్లాడక ఊరుకొని తన బాణాలూ విల్లుతూణీరాలు జాగ్రతగా తనవద్దనేపెట్టుకుంటాడు. ఆ బ్రాహ్మణుని వేషంలో ఉన్నది ఇంద్రుడె. తన కుమారుడయిన అర్జునునికి ఎలా మేలుచేద్దామా అని పలకరించటానికిగాను అలా మాట్లాడాడు అర్జునుడు తనతో మాటాడక పోయినా తన సలహాపాటించకపోయినా. అతడిధైర్యసాహసాలను మెచ్చుకొంటూ తన నిజస్వరూపంచూపి,నీకు"వరాలిస్తాను,కోరుకోపలసిం"దంటాడు. బ్రాహ్మణవేషంలో ఎందుకు కూర్చొన్నాడీ ఇంద్రుడు అని శంకరావటంకద్దు.ఇతరమాటలను పాటింపని వారు కూడ బ్రాహ్మణుని మాటల్ని పాటించటంకద్దు. కనక అలాటి వేషంలో ఉన్నాడు ఇంద్రుడు.

వరాలడుగు మంటే పుణ్యలోకాలు దేవత్వం అడుగుతాడేమో ననిఇంద్రుని ఆశ.అలా అర్జునుడడగలేదు.తనకు దివ్యాస్త్రలాభం కావా లంటాడు. అందుకు ఇంద్రుడు అలా అయితెముందు ఈశ్వరుని ప్రస

న్నుణ్ణిచేసికొను. అందుకు తపస్సుచెయ్యి. ఆయన నుంచి పాశుపతాస్త్ర లాభాన్ని పొందు అంటాడు.

అర్జునుడు అప్పుడు ఇంద్రకీలాద్రికి వెళ్తాడు. ఆ శైలశిఖరానికి వెళ్ళి అక్కడ ఈశ్వరుని గూర్చి నాల్గువారాలు, ఉపవాసాలు చేస్తూతిండి తగ్గిస్తూ చివరకు వాయుభక్షణచేస్తూ ఇలా తపస్సు చేశాడు. ఋషులు ఈశ్వరుని కలిసిఈయన ఘోరతపస్సు చూస్తుంటేసర్వభూతజాలాలకు వేడిపుట్టుతున్నది, ఇక సహింపలేవు. కనక అర్జునునికి అభిమతాలనిచ్చి ఆ తపస్సు మాన్పించవలసించని ప్రార్థిస్తారు.

అప్పుడీశ్వరుడు కిరాతవేషంతో ఎఱుకరాజుగానయి ఎఱుకల సానిని తీసికొని "మూకు"డనే రాక్షసుని పందిగా పరుగిడజేసి దానిని తరుముకొంటూ తన పరివారంతోసహా అర్జునుడు తపస్సుచేసేచోటికి వస్తాడు.

ఆపంది అర్జునుని మీదకు దుముకబోతుంది. వెంటనె అర్జునుడు దానిపై బాణంవేస్తాడు. అప్పుడెఈశ్వరుడున్నూ దానిపైబాణం వేస్తాడు. అప్పుడు—

హరు శరమును – నరుశరమును
సరి నిరుపక్కియలందాకి శరసం
భరమున దిరిగె వరాహము
శరనిధిమథనమున దిరుగు శైలముపోలెన్.

అని నన్నయ వర్ణిస్తాడు. మళ్ళీ ఈశ్వరుడు మందరగిరి పర్వతం పాల సముద్రంలో తిరిగి విషాన్నిపుట్టించడం దాన్నితాను త్రాగవలసిరావటం జ్ఞాపకంచేసుకొని ఉంటాడు; అనిపిస్తుంది. అర్జునునికి ఈ సన్నివేశం చిత్రమనిపిస్తుంది. ఈ కిరాతుడెవడు, ఈ భార్యాకూడ ఏమిటి, ఒక్క మనుష్యుడు కూడ కన్పడని ఈ కీకారణ్యంలో; వేటకొస్తే ఈ పెళ్లాన్నెందుకుతెచ్చాడు, అయినా నేను కొట్టిన వరాహాన్ని తనెందుకు కొట్టినట్లు? వేటనియమాన్ని పాటించనక్కర్లేదా: ఇన్ని ఆలోచించి అడిగేస్తాడు—ఇదేమిటని.

ఈశ్వరుడు "నేను కొట్టినదెబ్బకు అదిచచ్చింది. నీదెబ్బకుకాదు. వేటనియమం ప్రకారం మనం యుద్ధం చేద్దామంటే సై" అంటాడు. ఇద్దరూ యుద్ధం చేస్తారు. అర్జునునకు ఇంకా ఆశ్చర్యం కలుగుతుంది నా బాణాల దెబ్బకు తట్టుకోగలిగిన ఈతడెవరబ్బా! అని. ఈ పర్వతం దైవనివాసం ఈ కిరాతుడు ఆరూపంలోనున్న ఏదోదేవుడై ఉంటాడు అనుకొన్నాడు. బాణం వేద్దామని తూణీరాలపొదితడువుకొంటాడు. బాణాలన్నీ అయిపోవటం మరీచిత్రమవుతుంది. అవి అక్షయమయేటటువంటివిగదా, చివరకు విల్లుపెట్టి శివుణ్ణికొట్టబోతాడు. విల్లుమాయమై పోతుందిఅతరువాత కత్తితో, వృక్షలతో, రాళ్ళతో ప్రత్యర్థిని కొట్టాలని ప్రయత్నంచేస్తాడు— అన్నీ విఫలమవుతవి. చివరకు ద్వంద్వముష్టి యుద్ధానికి తలపడుతాడు. తానేకొట్టబడి మూర్ఛపోతాడు. వెంటనె ఈశ్వరుడు ప్రత్యక్షమై అర్జునునిదృష్టికి అవుపడుతాడు.

అప్పుడు అర్జునుడు పరమేశ్వరుణ్ణి స్తోత్రంచేస్తాడు. క్షమించుమంటాడు — ఈశ్వరుడు ప్రసన్నవదనంతో చేయిపట్టుకొని వానిగాండీవం వానికిచ్చి, ఈ గాండీవం నరనారాయణావతారంలో నరుడివైన నదేను. అవిగాక ఈ బ్రహ్మసిరం అనేబాణం — పాశుపతం — ఇంకా అనేకాలయినశూలా లుగదలు వీటన్నిటిని ప్రయోగించటం ఉపసంహరించటంతోసహా ఇస్తున్నాను తీసికొనుమని చెప్పి, ఆశీర్వదించి అంతర్హితుడవుతాడు

పాశుపతాస్త్రం అర్జునుడు పొందినాడని తెలిసిన క్షణాన దైత్యరాక్షసయక్షగణాలన్నీ భయపడి పోవడంజరిగింది. ఈ సంగతిని తెలిసికొన్నవాడై ఇంద్రుడు సురగణసహితుడై వచ్చి అర్జునుని ఆశ్వాసించి ఘోరదారుణ పాశాలూ బాణాలు అన్నీ అతడికి ఇస్తారు.

అప్పుడు ఇంద్రుడు అర్జునునితో నీవు అమరావతికి రావలసింది విమానంపంపుతాను, అనిచెప్పివెళ్ళిపోయాడు. దివ్యవిమానంవస్తుంది. ఆ విమానచోదకుడు మాతలి వచ్చి విమానమెక్కుమంటాడు. అప్పుడు అర్జునుడుగంగాస్నానంచేసి పవిత్రీకృతశరీరుడై దేవఋషి పితృతర్ప

ణమునుజేసి ఆతరువాత ఆవిమానం అధిష్ఠిస్తాడు. అలా ఎక్కింతర్వాత ఆ మందరాచల పర్వతానికి నమస్కరిస్తాడు. ''నేను నీదయవల్ల ఇన్ని రోజులు ఇక్కడ సుఖంగావున్నాను. అమరావతికివెళ్ళివస్తాను" అని నమస్కరిస్తాడు. పాండవుల సంస్కారమెలాంటిదో తెలియజేసే యీ అర్జునుని ప్రవర్తనం ఎంతో ఉదాత్తమైనదనిపిస్తుంది!

ఈతడు వెళ్తుంటె దేవతలువచ్చి చూస్తారు–ఓహో ఆదిమునుల్లో ఒకడైన నరుడితడేగదా అనుకొంటూ. అర్జునుడు వెళ్ళివిమానందిగి ఇంద్రునకు ప్రణాముడవుతాడు. ఇంద్రుడు లేచి వచ్చి, ఈతడిని కౌగలించుకొని మొదటగా తన ఆసనంమీద కూర్చోబెట్టి ఆశ్వాసించి తరువాత ఆయనతోపాటుతానూ ఆసనం మీద కూర్చుంటాడు. వాని శరీరమంతాతనచేత్తో నిమురుతాడు. ఇలా కొంత కాలంగడిపి, ఆతడ్నిఒక్క మణిమయమైన మందిరంలో ఉంచి గంధర్వసంగీత గోష్ఠిలో కాలాన్ని గడపవలసింది అని ఆదేశిస్తాడు.

రాత్రిపడినదై చంద్ర దర్శనం కాంగానే ఊర్వసిని ఇంద్రుడు అర్జునుని వద్దకు పంపుతాడు. ఆమె వెన్నెలవంటి చీరధరించి మృగమద కర్పూర కుంకుమోన్మిశ్రిత సుగంధంరాచికొని, పూవులుముడిచినదై మణిమయాలంకృతయై సాపేక్షగ అర్జునుని సమీపిస్తుంది. అర్జునుడు వెంటనేలేచి దండప్రణామాలు చేసినవాడై, నన్నునీపుత్రుణ్ణిగా మన్నించి శుభసమగ్రునిగా చేయుడానికి సంతోషంగా వచ్చినావు తల్లీ నమస్కారము. నాజన్మధన్యమైనదంటాడు. ఆమె ఆశ్చర్యంతో అయ్యో! అదేమిటి! నీసంగమాన్ని కోరి నేను రాగా నీవు జననిఅంటూ వంకరమాటలాడుతావేం? అంటుంది. నీకేనాటి తల్లిని? ఇక్కడ దివ్య పురుషులంతా మమ్మల ననుభవించటం ఆచారమయిన సంగతి. నీవు దివ్యుడువలె నన్ను సంతోషపెట్టవలసిందంటుంది. అర్జునుడు స్థైర్యంతో అది ధర్మద్రోహమంటాడు. నేను నాదేశాచారాన్ని మరచిపోను. పురందరునకు నీవుపరిచర్య చేసేదానవు కావడంవల్లను పురందరుడు నావంశ

కర్తకావడంవల్లనూ నీవునాకు తల్లివేనంటాడు. ఊర్వసి అలా తిరస్కృతయై కినిసి “నీవు భూలోకానికి వెళ్ళింతర్వాత నపుంసకుడవయి ఆడంగులతో ఉండిపోతావు పొ”మ్మని వెళ్ళిపోతుంది.

తెల్లవారంగానే ఇంద్రుడువచ్చి ఇదంతావిని అర్జునుని ధైర్యానికి మెచ్చుకొన్నవాడై, నీయీ శాపం నీకువీలుగ ఉండేటట్లు నేనను గ్రహిస్తాను—ఇది ఒక సంవత్సరంపాటు మీరు అజ్ఞాతవాసం చేసే రోజుల్లో ఆవేశించినదై ఉపయోగానికె అవుతుంది గాక అంటాడు. ఆ యుధాలెన్నో తాము ఇవ్వడమయిందిగనక గీతనృత్యవాద్యాలు నేర్వవలసిందని చిత్రసేనుడనే గంధర్వుని వద్దకుపంపుతాడు ఇంద్రుడు అర్జునుని.

మానవుడయిన అర్జునునకు ఇంతటి వైభవం ఎలాకలిగిందనే సందేహం కలగడం సహజం. నిజానికి ఒకసారి రోమశుడనేమునివచ్చి ఇతడ్నిచూచి ఇంద్రునే అడుగుతాడు ఈతడికెలా ఈ వైభవం పట్టిందని. ఇంద్రుడప్పుడు ఈతడు నరుడనే నారాయణసఖుడు. గొప్ప తపస్వి. అని చెప్పి అకారణమేగాక ఈశ్వరుడ్ని మెప్పించిన వాడనీ అనేక మంది నిలింపుల వద్దనుండి వివిధాస్త్ర శస్త్రాలు పొందినాడనీ పైగా నివాతకవచులనే రాక్షసులను చంపడానికి తగిన వాడై దేవతలకు ముందు ముందు సహాయం చేయబోతున్నాడనీ చెప్పి—ఆరోమశునే యీయన కథంతా అరణ్యంలో వుంటున్న పాండవులకు చెప్పాల్సింది. వాళ్ళకుసంతోషంకలుగ జేయాల్సింది అంటాడు. త్వరలోనే పార్థుడు అక్కడకువస్తాడనీ ఆలస్యానికి వగవవద్దనీ చెప్పుమంటాడు.

ఇలా అర్జునుడు ఎన్నో శస్త్రాస్త్రాలుపొందిన సంగతి పాండవులకూ కౌరవులకు కూడ తెలుస్తుంది ఈ విధంగా. దుర్యోధనాదులు అందులో ముఖ్యంగా ధృతరాష్ట్రుడు కుమిలి పోతుంటాడు. పాండవులు ఎప్పుడొస్తాడో ఎప్పుడొస్తాడో అర్జునుడని ఉవ్విళ్లూరుతుంటారుసుఖాలు మేడల్లో వారికి రాజ్యాలేలే వారికి రాకఅరణ్యాల్లో అసమర్థులకైనా

రావడానికి ఎలాటిఅభ్యంతరం గాని చెప్పవులా ఉంది-కేవలం సత్ప్ర వర్తనం ఉంటే చాలునేమొ ననిపిస్తుంది.

అర్జునుని అస్త్రలాభ విషయం విని భీముడు "ఎప్పుడువెప్పు డువస్తాడు అర్జునుడు-ఎప్పుడు వెళ్ళి దుర్యోధనాదులను యుద్ధంలో గెలుస్తాడు" అంటుంటాడు. శ్రీకృష్ణుడ్ని పంపి అర్జునుడ్ని తీసికొని రమ్మందామా ముందుగా అంటాడు. మళ్ళి అతడురానే చాలు. ధర్మం ధర్మం అనుకొంటూ మీరంతా ఇక్కడే ఉంటారు-ముందు,నేనూ అర్జు నుడూ వెళ్ళి దుర్యోధనాదుల్ని చంపేసి రాజ్యం గెలిచి ఉంచుతాం. పద మూండేండ్లయినాక వచ్చి రాజ్యాభిషేకం నీవు చేసుకొందుగాని అని ధర్మరాజుతో అంటాడు.ఈతడి ప్రియోక్తులకు ధర్మరాజు కౌగలించు కొని భీముడితో నువ్వూ అర్జునుడూ కలిస్తే ఇంక మిమ్మల్ని జయిం చేవాళ్ళెవరుగాక! కాని ముందుగా మీరెళ్ళి అలా జయించడానికికూడ నేను ఒప్పుకోను గదా! సత్యభంగంచేయనుందా అని అతడ్ని ఆశ్వా సిస్తాడు; అంటేముద్దుపెట్టుకొంటాడని అర్థం.

సంతోషం కలిగినప్పుడు కూడ స్వభావానో నొట్టుకొనడం ధర్మ రాజుకు ఎన్నడూలేదు. ఇది కర్మయోగి-కాదు-స్థితప్రజ్ఞుని లక్షణం అనేది మర్చిపోకూడదు.

అలాంటి వాడుద్యూతంలో ఎందుకు గాడనిపిస్తుంది.ద్యూతం వ్యసనం. దానికి లొంగినమాట వాస్తవమె. ఎది మనుష్యుడైన వానికి కలిగెపొరపాటు.ఆపొరపాటు మనిషి తప్పించుకోలేడా అంటె తప్పిం చుకోవచ్చు. శ్రీకృష్ణుడె చెప్పాడు కదా-"నేనక్కడున్నట్లయితె అలా జరిగేదాఅని!"కనీసం శ్రీకృష్ణుడు ఈ సందర్భంలో ఉంటే,ఏమిసలహా ఇచ్చి ఉండేవాడనే ఆలోచనే ధర్మరాజుకు ఆద్యూత సందర్భంలో కల గక పోవటం ప్రారబ్ధం.

అందుకె ఎల్లప్పుడూ సస్మృతులుచుకొంయూ కర్తవ్యకర్మలను చేస్తూఉండాలెందని భగవంతుడు అర్జునునకు గీతాసందేశంలో చెప్ప టం వింటాం. ("తస్మాత్సర్వేషుకాలేషు యోగయుక్తోభవార్జున").

అంతటి ధర్మరాజును ఇలాంటి పొరపాటు చేసినవాడుగా కథలో వ్యాసుడు ఎందుకు మలచాలి అనిపిస్తుంది. అది మోక్ష సాధనామార్గంలో "అహం బ్రహ్మాస్మి" అనే అనుభూతిని అందడానికి ముందు "నేతి నేతి" అనే సాధనలో సర్వమూ త్యజించాల్సిన భాగం. ధర్మరాజు ద్యూతంలో చేరి అలా తన వస్తువులన్నీ పణంబెట్టి ధారపోయటం అయిందని చెప్పటం ద్వారా ఆసాధననే తెలియాలి అనిబోధ. ఆసాధన పూర్తికాలేదు. మళ్ళీ మొదటికివచ్చి ఇంద్రియాల్ని అదుపులో ఉంచి ప్రశాంతి అనుభూతిచేయడానికి అరణ్య ప్రవేశకథ చెప్తున్నారు.

ఇది ప్రథమాశ్వాసము

:—:—:

# ద్వితీయాశ్వాసం



## 1. నలచరిత్ర

ధర్మరాజాదులు అరణ్యంలో ఉంటున్నప్పుడు ధర్మవిషయాల మీద ధర్మరాజు భీముడూ చర్చించుకొంటూ ఉండేవాళ్ళు. వాళ్ళ దగ్గరకు మహామునులు ఎంతోమంది వచ్చి ధర్మసందేహాలు తీర్చి వెళుతుండేవాళ్ళు. ఒకసారి బృహదశ్వుడనేముని వస్తాడు. అప్పుడు ధర్మరాజు—మా లాగా ఇలా తిరస్కరింపబడి బాధలుపడిన వాళ్ళెంకెవరయినా ఉన్నారా చెప్పవలసిందంటాడు. అప్పుడు బృహదశ్వుడు నల మహారాజు కథనుచెప్తాడు.

నిషధ దేశానికి రాజు నలుడు. విదర్భదేశానికి రాజు భీముడనేవాడు. ఈ భీమునికి దమయంతి అనే చక్కని కుమార్తె ఉన్నది. దముడనే ముని ఆశీర్వచనంవల్ల కలిగి నట్టి బాలిక ఆమె. నలునిగూర్చి దమయంతి, దమయంతినిగూర్చి నలుడూ విని ఒకరి మీద ఒకరు సత్భావాన్నీ స్నేహాన్నీ పెంచుకొంటారు. అంతేకాక, ఒకసారి ఆకాశంలోం

చిపోయే హంసలు నలునితోటలో దిగివిహరిస్తుంటే, నలుడువాటిలో ఒకదాన్ని పట్టుకొంటాడు. మిగతావన్నీ దీనికోసం ఆకాశంలోవేచి యుంటవి. ఈహంస భయపడినదై మనుష్య బాషణంతో "అయ్యా నీమంచిగుణాలను సౌహృదయేశ్వరియైన దమయంతికి చెప్తాను,వదలి పెట్టు" మంటుంది. ఆయన వదలుతాడు.మాటప్రకారం ఆహంస,దమయంతి విహరించే ఉద్యానవనంలోఉండి ఆమెను కలిసి నలుడ్నిగూర్చి భూషిస్తూ చెప్పి ఆతడినె పెండ్లాడవలసిందంటుంది.అంతట దమయంతి —"ఐతె ఇలాగే ఆనలునకు కూడ నాగూర్చి చెప్పి ప్రీతి కలిగించరాదా"అంటుంది. హంసఅలాగే చేస్తుంది.

దమయంతి విరహంలో మునిగి చిక్కిపోతుంది. చెలికత్తెలు తండ్రికి చెప్తారీసంగతి. అప్పుడు ఆయన స్వయంవరం అని చాటింపు చేసి నానా దేశరాజులనూ పిల్వడం ద్వారా నలునికూడ రమ్మని ఆహ్వానం పంపుతాడు.

ఇలా స్వయంవరం జరుగబోయే ముందు నారదుడు ఇంద్రలోకం వెళ్తాడు. ఇంద్రుడు భూలోకవార్తలేమని అడిగి, ధర్మపాలురూ వీరులైనవాటూ భూలోకంనుంచి ఇక్కడికి ఈమధ్య ఎందుచేత రావటల్లేదంటాడు. అందుకు నారదుడు చమత్కారంగా ఈ స్వర్గంలోని అప్సరసలకంటె అందమైన దమయంతి యొక్క స్వయంవరానికి అందరురాజులూ వెళ్తుంటె ఇక్కడవిళ్ళకోసం ఎవరొస్తారంటాడు.

ఇంద్రుడూ, అగ్నివరుణుడూ,యముడూ ఆశ్చర్యపడి,"పోయి చూద్దామ"ని భూలోకానికి వస్తారు.విదర్భదేశానికి వరసగా వెళ్ళే రాజులలో నలుడ్ని చూసి ఇంత అందంగా గొప్పగా ఉన్నాడితడుగదా అని మరి కాస్త ఆశ్చర్యపోతారు. దమయంతిని ఇతడె పెళ్లాడుతాడు అనుకొంటూనె—అతడ్ని పిల్చి మేము నిన్ను ఒకానొక పనికి అభ్యర్థిస్తామనుకొంటున్నాము. మేము ఇంద్రాగ్ని వరుణయములం.దూతగాపనిచేస్తావా అంటారు. నలుడు చేస్తానంటాడు. తీరాఏమిటనంగానే మాతరఫున

దూతగా దమయంతి అంతఃపురంలోకి వెళ్ళి మాలో ఏఒక్కరినన్నా స్వయంవరంలో వరించవలసిందని కోరి రమ్మంటారు.

నలుడు నేనూ స్వయంవరానికై వస్తుండంగా మీరిలానన్నడగడం న్యాయమా అంటాడు. అందుకువాళ్ళు "ఒప్పుకొని, ఇప్పుడు కాదనడం న్యాయమా" అంటారు. చివరకు నలుడు సరేనని వాళ్ళ మహత్తువల్ల ఎవరికంటా పడకుండా దమయంతి అంతః పురంలోనికి వెళ్ళి ఆమె ఎదుటనిలుస్తాడు.

దమయంతి ఈ అందగాణ్ణిచూసి ఆశ్చర్యపోతుంది. ఇతడే నలుడా అనుకొంటుందికూడ. చివరకు ఎవరు నీవు మహాత్మా! ఇలా ఎలా రాకలిగావు అంటుంది. అప్పుడతడు-నేను దేవదూతను. నలుడనే వాడను. వారి ప్రభావం వల్లనే నేను ఎవరికీ అపుపడకుండా రాకలిగాను వారునన్ను నీదగ్గరకు పంపారు. వారిలో ఏఒక్కరినైనా నీవు వరింప వలసింది. అలాచేస్తే వారందరకూ సంతోషము కలుగుతుందిట. అలా చెప్పమన్నారు వారు. కనుక నీవు అలా చేయవలసింది అంటాడు.

దమయంతి–అతడు నలుడన్న సంగతి తెలియంగానే, సిగ్గుముఖమూ పెద్దవిచేసి చూస్తూ, తాను నలమహారాజుపైననే ప్రేమ నింపుకొన్న హృదయంతో ఉన్నదనీ, ఇంద్రాదులలో తనకు సమానత్వమేమీ ఉండదు గనక వారిలో ఎవరినిగానీ వరించేది లేదంటుంది. పైగా నీవునలుడవయి వచ్చినట్లయితే నిన్నుచేపట్టడానికే ఈస్వయంవరం ఏర్పాటుచేయడమయింది. నీవునాపతివి కాకపోయేటట్లయితే ఉరేసుకొనో నీటిలోదూకో విషంతినో అగ్నిలోపడో చస్తానుగాక అం .

నలుడు—అలాకాదు. ధీరసత్వులు వాళ్ళు. వారికీ నాకూపోలికేమిటి? దేవగణాలతో సరితూగించక అప్రియంచేయడంద్వారా నీవు నీకు నాకూ కూడ చెడ్డగతిని తెస్తున్నావనుకొంటాను, అదిసరికాదు అంటాడు,

అప్పుడు దమయంతి అలా అయితే రేపు స్వయంవరంలో వారందరి ఎదుటనే నేనునిన్ను వరిస్తాను. అప్పుడు నీకు ఏలాటిదోషమూకలుగదుగాక అంటుంది.

ఈ సంగతి నలుడు ఇంద్రాదులకు చేరవేస్తాడు. వాళ్లు అబ్బో ఎలా నలుణ్ని గుర్తు పట్టుతుందో చూద్దాం అని నల్గురూ నలుడి మాదిరిగా రూపం గ్రహించి స్వయంవరానికి వెళ్తారు. తీరా దమయంతి పుష్పమాల తెచ్చి నలుడిమెడలో వేదామనేక్షణాన ఐదుగురు నలరాజులు కన్పడుతారు. ఆమె గ్రహిస్తుంది అందులో నల్గురు ఇంద్రాగ్నివరుణయములై ఉంటారని. వెంటనె మనసులో ఆదేవతలనె ప్రార్థిస్తుంది "దేవతలారామీరే రక్షించి నలుణ్నిపతిగాజేయాల్సిం"దని. దేవతలు సంతోషిస్తారు.

ఆమెకు వారికంటి రెప్పలు వాలక నిల్చి ఉండటం, భూమికి కాళ్లు—తాకకపైనే ఉండటం, చెమటలుపట్టకపోవటం ఈ లక్షణాలు అవుపడతయి. వెంటనె ఆనలుగురినీ గుర్తుపట్టి ఐదోవాణ్ని నలుడని నిశ్చయించి మాల వేస్తుంది. పెల్లి అయిపోతుంది. అంతా ఆశీర్వదించి వెళ్ళిపోతారు. నలుడికి జలం. అగ్ని. ధర్మం, ధనం ఇవన్నీ అందుబాటులో ఉండేట్లు దీవిస్తారు దేవతలు.

మహావైభవం అనుభవిస్తూ ఉన్ననలుడికి అపకారం చేయడానికి ప్రారంభిస్తాడు కలి. నిజానికి ఈతడు కూడ స్వయంవరానికి వద్దామని తీరాభూమికి వచ్చేటప్పటికి నలదమయంతుల పెండ్లి అయిపోయింది. అదె అతడికోపం. కలిఅంటె శనిఅని తెలియాలి. ధర్మపరుడయిన నలుని శని ఆవేశింపలేక కొన్నాళ్లు అలావేచి ఉండాల్సివస్తుంది. నలుడికి ఒకకొడుకూ ఒకకూతురూ కూడకలుగుతారు. ఒకనాడు కాళ్ళుకడిగికొనడం మర్చిపోయి సంధ్యావదనం చేయడం గమనించినవాడై, శని తన ఉధృతాన్ని చూపి నలుని ఆవేశిస్తాడు. పైగా ప్రక్కదేశపురాజయిన పుష్కరుని పురికొల్పి జూదానికి నలుణ్ని పిలువవలసిందని పంపి అందుకుతాను వీయుగాసహాయంచేస్తానని చెప్పి పందెంవేయడానికయిన అక్షలతోతాను ఆవేశించుతాడు.

ద్యూతం అనేది వ్యసనం, అదే దుర్దశకు దారితీసే కీలకం. నలుడు పుష్కరుడు పిలవంగానే ద్యూతానికి సన్నద్ధుడవుతాడు. పందెం వేస్తూ ఉంటాడు. ఓడిపోతూ ఉంటాడు, కాని ఆటమానడు. ఎంతోమంది అది మానవలసిందని చెప్తారు, అయినా మానడు. ధర్మరాజుకు అప్పుడు చెప్పినవాళ్లు లేరు. నలునకు ఎంతమంది చెప్పినా వాని తలకెక్కలేదు, అది ప్రారబ్ధం. ఆటలో భర్త ఓడిపోవటం చూచే దమయంతి తనకొడుకునూ కూతురునూ తనతండ్రిగారైన విదర్భరాజు వద్దకు పంపివేస్తుంది రథంపై కుర్చోబెట్టి. తాను నలునితో అరణ్యానికి వెళ్లడానికి సిద్ధమై నిలుస్తుంది.

చివరకు నలుడు దమయంతీ సహితంగా అరణ్యాలకు వెళ్ళి పోతాడు. కలిచేత ప్రేరితులయిన అక్షలు పావురాల రూపంలో ఈ నలదమయంతుల ఎదుట తిరుగుతుంటవి. అరణ్యంలో ఏ చెట్టునా, పండ్లూ ఫలాలు లేకుండా చేస్తాడు కలి. ఆకలితో బాధ. కట్టు బట్టలతో ఉన్నారు. ఏం చేయగలరు! చివరకు నలుడు తన పంచను విసరి పావురాలమీద వేస్తాడు పట్టుకొని వాటిని ఆహారంగా తెద్దామని. అవి నిజమైన పావురాలు అయితే గదా! అవి ఆపంచతో సహా ఎత్తుకుపోతయి. నలుడు సిగ్గుతో దమయంతి చీరనే ఓ ప్రక్కతనకు కూడ చుట్టుకొంటాడు.

రాజ్యభారం వదలినా నలదమయంతులు అరణ్యంలో ప్రణయ మూర్తులై ఉంటున్నారని, కలికష్టాలు తెచ్చిపెట్టుదామని చూస్తే, ఒకే చీరలో ఇమిడి వారిద్దరూ ఇంకా సన్నిహితులైనారనిపించింది. దమయంతి అంటుంది—"అధికదుఃఖ రోగార్తున కౌషధంబు సురుచిరంబుగ భార్యయచూవె యెందు—నొనరభార్యా సమేతుడై యున్నవాని కెంతలయ్యును నాపదలెరుక పడవు. అలసిననెడ. డస్సిననెడ నాకలితృష్ణ యునైనయెడల గడుకొని ధరణీతలనాథ! పురుషునకునిమ్ముల భార్య యపొచుజిత్తమునదుఃఖంబున్. అందుచేత నేనునీతో ఉండటానికే అను

మతుడవు కావాల్సింది. నన్ను ఒక్కతెనూ విదర్భకు పొమ్మనవద్దు" అంటుంది.

కాని అడవిలోవారు నేలమీద శయనించినపుడు రాత్రివేళనలుడు ఆమె అలా ఉండటం చూసిభరించలేక తాను కనపడకుండ వెళ్ళిపోతె ఆమె తన తండ్రి వద్దకుఏలాగో ఒకలాపోతుందనే భ్రమతో చీరను సగం చించుకొని, వెళ్ళిపోతాడు. ఎంతసెపో సందేహించి దుఃఖించి చివరకు రాగపాశం ఛేదించినవాడై వెళ్ళిపోతాడు.

ఆమెలేచి నలుడువెళ్ళిపోయినాడని తెలిసి మహాదుఃఖిస్తుంది. అయ్యోనన్నువదలి వెళ్ళనని చెప్పినవాడు ఇలా అసత్యంచేసి వెళ్ళి పోయినాడే అని వాపోతుంది. అడివిలోదిక్కుతోచక పొదలన్నీ వెతు కుతుంటుంది. కొండచిలువ ఒకటి ఆసమయంలో ఆమెను పట్టుకొం టుంది. ఆమె అయ్యో! నాథా ఇప్పుడైనా వచ్చిరక్షించాల్సిందంటుంది. ఆకేకవిని ఒక కిరాతుడువచ్చి పామునుచంపి ఆమెను రక్షిస్తాడు. కాని ఆతడేకామమనే విషపూరితుడై ఆమెను బాధించబోతాడు.ఆమెశపిస్తుంది దాంతో వాడుదగ్ధమైపోతాడు.

ఆతరువాత కొందరుసార్థవాహులు పోతుంటే వారితో కలిసి వెళ్తూ వుంటుంది.కాని వారంతా ఒకచోట విడిసి ఉన్నప్పుడు ఏనుగుల గుంపు ఒకటి వచ్చి,వారిని త్రొక్కివాటిదారిన అవిపోతవి.ఎంతోమంది చచ్చిపోయినారుగాని తానైనా చావలేదని దమయంతి విలపిస్తుంది. చివరకు మిగిలిన వారితో సుబాహునిపురం అయిన చేదిపురం చేరు తుంది, అక్కడ రాజమాత ఈమెను దూరం నుంచి చూచిపిలిపించి ఆదరిస్తుంది. తానెవరనేది దమయంతి చెప్పదుగాక.

నలుడు దమయంతిని విడిచివెళ్తుండంగా ఒకచోట అడివి కాలు తుంటే ఆరోపల నుంచి ఆర్తనాదం వినపడుతుంది రక్షించవయ్యా నలరాజా అంటూ. నలుడు ఆ అడవిలోచొరబడిచూస్తే అక్కడ ఒక పాము కదలలేకపడి ఉండి "అయ్యో నేను కదలలేక చచ్చిపోయేటట్లు

న్నాను. నన్నువిడయటకు తీసుకొనిపోయి సరస్సువద్దవదలాల్సింది. నీకు మేలు చేస్తాను" అంటుంది. నలుడు దానిని ఎత్తితీసికొనిపోయి సరస్సు వద్ద ఉంచంగానే ఆపాము నలుడ్ని కాటువేసి ఇలకా అంటుంది–"నేను కర్కోటకుడనే పామును. శాపవశంచేత ఇలాటి కదలలేని స్థితిలో ఉన్నాను. నిన్నుకాటువేసినందువల్ల నీరూపంగుర్తుపట్టలేనంతగా మారి పోయింది. ఈవిషంనీలో ఉన్నంతకాలం ఇంకే విషాగ్నులూనిన్ను బాధింపలేవు. నీకుకావలసినప్పుడు నన్నుతలుచుకో. నేనువచ్చి నీరూపం నీకు ఇస్తాను. అని ఆ దమయంతి సగంచీరను వాని నుండి తీసికొని వెళ్ళిపోయింది ఆపాము. ఇంకా మంచిసలహా ఒకటి ఇచ్చిందాపాము. ఋతుపర్ణుడనే రాజు వద్దకు వెళ్లి అతడికి అశ్వవిద్యవచ్చు నీకు అశ్వ విద్యవచ్చు. దీనిని వానికిచ్చి దానిని నీవు ఉపదేశంపొందు. దాంతోనీకు పట్టినకలి వదలి పోతాడు అని చెప్పాడు కర్కోటకుడు. ఆకారానికి తగి నట్లుగాచెడ్డితో ప్రయాణంచేస్తాడు నలుడు.

నలుడు అలాగే ఋతుపర్ణుడి వద్దకువెళ్ళి తనపేరు బాహుకుడనీ తాను వంటవాగా చేయగలడని, గుర్రాలకు మంచి శిక్షణనీయగలడని చెప్తాడు. అక్కడ భృత్యుడుగా చేరుతాడు.

విదర్భదేశాధిపతియైనభీముడు, తన కూతురూ అల్లుడైననలుడూ అరణ్యాలకు వెళ్లిన వారి సంగతి తెలియలేదని వగచి అక్కడ ఉంది తెలివైనవారిని వారిని వెదకడం కోసం నానాదేశాలూ పంపుతాడు. అందులో సుదేవుడనే వాడు చేదిపురంవచ్చి సుబాహుని రాజప్రాసా దంలో సైరంధ్రీరూపంలో ఉన్న దమయంతిని గుర్తిస్తాడు. తీరా ఆ రాజమాత దమయంతి తల్లికి అక్కగారు. దమయంతికి అప్పుడు తెలు స్తుంది–అంతా కోనాప్పు ఉంటారు. చివరకు దమయంతి తల్లివద్దకు వెళ్లాలని విదర్భకు వెళ్ళిపోయి ప్రోషిత భర్తృక అయి నియమశీలయై ఉండి, మనుష్యులను నలుని కయి వెదకుమనిపంపుతుంది.

అలా వెదకటానికి వెళ్ళినవాళ్ళేం చేయాలంటే, ఎక్కడయినాసరె పది మంది ఉన్నచోట ఇలా అంటూ ఉండాలి— "నలుడెక్కడున్నాడో తెలీదు. భార్యను అడవిలో వదలి వెళి పోవచ్చునా అతడు? తప్పుకాదా? భార్యాభర్తల వైవాహిక ధర్మం అబద్ధం చేశాడే!" అనాలి. ఏ రూపంలో ఉండి ఈ మాటల్ని విన్నా నలుడు ఏదో ఒక సమాధానం చెప్పకుండా ఉండలేడు. అలా చెప్పేవాణ్ణి తన దగ్గరకు తేవలసిందని దమయంతి అన్వేషకులకు చెప్పి పంపుతుంది.

అలాగె కొందరు ఋతుపర్ణుడి కోటలోకి వెళ్ళి ఈ మాటలు పలుకుతారు. బాహుకుని రూపంలో ఉన్న నలుడు ఆ మాటలు విన్నా అప్పటికి మాట్లాడక ఆ మాటలు చెప్పినవాణ్ణి ఒంటరిగా కలిసి, ఇలా అంటాడు——

పురుషులందు దోషపుంజంబు గలిగిన నెఱిగి యెదసహించునేని భార్య
పురుష నం దభీష్టభోగంబు దేహాంతరంబునందు ధర్మరతియుబడయు

అంటాడు. అలా అని తలవంచుకు వెళ్ళిపోతాడు. ఆ అన్వేషకునికి ఏం చేయాలో తెలీలేదు-అకురుచ చేతులవాణ్ణి గురించి. ఈ సంగతిని దమయంతికి తెలుపుతాడు. అతడు ఋతుపర్ణుని కొలువులో ఉన్నాడనికూడ చెప్తాడు.

ఆమె సుదేవుడనే బ్రాహ్మణుని పిలిపించి ద్వితీయ స్వయంవరమనే మిష పెట్టి ఋతుపర్ణ మహారాజును కలిసి ఆ తరువాతి రోజే ఋతుపర్ణుడు విదర్భకు స్వయంవరానికి రావాల్సి ఉంటుందని చెప్పమంటుంది. ఒక్కరోజులో విదర్భదేశానికి రథం నడుపగలగటం ఒక్క నలునికితప్ప ఇతర్లకు అసంభవమని దమయంతికి తెలుసు. నలునికి అశ్వహృదయం తెలిసి కారణాన ఋతుపర్ణుడు విదర్భకు ఆమరురోజే చేరాలనేటట్లయితె నలుణ్ణె రథచోదకునిగా చేసి రావాల్సిందె. తప్పదు. ఇదీ దమయంతి పథకం.

సుదేవుడనే ఆ బ్రాహ్మణుడు అలాగే వెళ్ళి ఋతుపర్ణుడికి చెప్పంగానే ఋతుపర్ణుడు బాహుకుడిని (నలుని) పిల్చి రథం తయారు చేయించి విదర్భకు ప్రయాణమై వస్తాడు. నలుడికీ ఈ స్వయంవరం సంగతేదో తెలియాలనె ఉంది. దారిలో ఋతుపర్ణుడు తన ఉత్తరీయం జారింది గనుక క్షణం ఆగి దానిని తేవలసిందని ఆ బాహుకుని కోరినా అతడు నిరాదరణ చేస్తాడు.

ఋతుపర్ణుని మనసు చివుకుమంటుంది. అప్పుడతడు బాహుకునికి ఒక వృక్షం చూపి "చెట్టుకు పళ్ళు ఏ కొమ్మకు ఎన్నిఉన్నాయో చెప్తాను నేను. నీవు చెప్పగలవా?" అంటాడు ఋతుపర్ణుడు. బాహుకునకు జ్ఞాపకం వస్తుంది– కర్కోటకుడు చెప్పినమాట–ఈ ఋతుపర్ణునకు అక్షవిద్య వచ్చుననీ, సంఖ్య చెప్పటంలో దిట్ట అనీని. అందుకని తాను అశ్వహృదయం ఋతుపర్ణునికి చెప్పేటట్లూ, ఋతుపర్ణుడు అక్షవిద్యను తనకు చెప్పేటట్లూ అభ్యర్థిస్తాడు. ఋతుపర్ణుడు బాహుకునకు అక్షవిద్య నుపదేశిస్తాడు. వెంటనె బాహుకునిలో నున్న కలి కురూపిగా బయటకువస్తాడు. బాహుకుడు వానిని "ఎవరునువ్వు ఎందుకునాలో ఉన్నావిన్నాళ్ళు" అంటాడు. అందుకు కలి "అయ్యా నేను కలిని. ఇన్నాళ్ళూ నీ శరీరంలో ఉండి ఆకర్కోటక విషాన్ని భరించాను" అని ఆవిషం కక్కివేసి "ఇకనన్ను బాధించకండి ఇప్పటికే నేను ఎంతో తపించిపోయినా"నని వెళ్ళిపోతాడు. ఋతుపర్ణుడు అశ్వహృదయాన్ని నలుని వద్ద పొందటం మాత్రం వాయిదా వేస్తాడు. బహుశ బాహుకుని శరీరం వికృతంగా ఉన్నది కనుక తాను ఉపదేశం పొందటం తనకంటే గొప్పవాని నుంచి అయిఉండాలి గాని తనకంటే హీనుడైన వానినుంచి పొందరాదు అని అయియుండవచ్చు. వీళ్ళు విదర్భ చేరుతుండగానే ఆ రథ ధ్వని విని దమయంతి అది నలుడు నడిపే రథం అయిఉండాలి అనుకొంటుంది. తీరా బాహుకుడు ఈ వికృతాకారుడేనన్నమీదట మళ్ళీ తికమకలో పడుతుంది. తన చెలికత్తెయయిన కేశినిని పంపి ఆతడెవరో తెలియవలసిం దంటుంది. కేశిని వెళ్ళి ఆతడ్ని ప్రశ్నలు వేస్తుంది. "నలుడెక్కడున్నాడో!"నంటుంది. "పాపం దమయంతి ఎంతో నియమశీలయై నలునికోసం నేలమీదనేపడి దుఃఖిస్తున్న" దంటుంది. నలుడి కనుకొలుకుల్లో నీరు చూస్తుంది. మళ్ళి వెళ్ళి నలుని కుమారునీ కూతుర్నీ తెస్తుంది వానిదగ్గరకు. బాహుకుడు వాళ్ళనెత్తుకొని ముద్దాడి కంటతడి పెట్టుతాడు. చివరకు "ఎందుకిక్కడకిన్నిసార్లు తిరుగుతావు ఇకనిక్కడికురా"కని పంపివేస్తాడు.

దమయంతి ఆ కురచగానిని నలుడనే నిర్ణయిస్తుంది. తన తండ్రిచేత బాహుకునకు కబురంపించి తనవద్దకు రప్పించుకొంటుంది. అప్పుడామె అంటుంది.

"నిర్మనుష్యమైన అడవిలో అలసి నిద్రపోయినట్టి సాధ్వి అనువ్రత, అయిన భార్యను వదలిపోయినవారు నలుడుదప్ప ఇంకెవరూ లేరు. దేవత లను వదలి తనను వరించాను, పుత్రునికన్నారు నన్ను వదలడానికి తగిన అపరాధం నేనేం చేశాను" ఆమెకళ్ళనుండి అశ్రువులు ధారలై ప్రవహి స్తున్నవి. "నిన్ను వదలనని మాటఇచ్చి ఆ మాట మరచిపోవటం ఎలా చేశాడో ఆయన!" అంటూంది.

అప్పుడు నలుడు "అది కలి చేసినపని. వానివల్లనే నేను ఎన్నో బాధలు పడ్డాను.చివరకు నా తపోబలంచేతగాని లేదా నీ దుఃఖమనే దవానలం మూలాన గాని ఆ 'కలి' నన్నువదలిపోయింది. అందుకే నేను ఇక్కడకు నీకోసం రాకలిగాను. నీవేమో ద్వితీయ స్వయంవరంలో మరొకరిని అపేక్షిస్తున్నావు" అంటాడు.

దమయంతి 'నీపాదము లాన గా నేను ఇతరులనెవరినీ అపేక్షింపను. ఋతుపర్ణుని రమ్మనగా నీవు వస్తావనె నమ్మకంతో ఇలా చేశా"నంటుంది. వాయుదేవుడు అశరీరవాణిగా "అదినిజ"మని పలుకుతాడు. "నేనూ చంద్రుడూ సూర్యుడూ ఈమెను చూస్తూనే ఉన్నాం. ఈమె పతివ్రత" అంటాడు. దేవత లప్పుడు పుష్పవృష్టి కురుస్తారు. దుందుభులు మ్రోయి స్తారు. ఉన్న విషయంహృదయానికి తట్టిన క్షణాన అంతర్వాణి ఏదో అశరీర వాణీగా పలికినట్లే ఉంటుంది బహుశ!

నలుడప్పుడు కర్కోటకుణ్ణి తలుస్తాడు. అతడు ప్రత్యక్షమై నలునకు వాని చీరను ఇస్తాడు. దాంతోపాటు కురూపి రూపం నలునకుపోయి తేజ స్వరూపం–అసలు రూపం వస్తుంది. వారికి మంగళ స్నానాలు చేయిస్తారు. ఋతుపర్ణుడప్పుడు నలుని దగ్గర అశ్వహృదయం ఉపదేశం పొందుతాడు. తరువాత వెళ్ళిపోతాడు తన రాజ్యానికి.

అలా కొన్నాళ్ళు నలదమయంతులు విదర్భలోనుండి తరువాత కొంత సైన్యంతో నిషధపురానికి వెళ్ళుతారు. అక్కడ పుష్కరుని పిల్చి నలుడు, "ఇప్పుడు నాతో యుద్ధం చేస్తావా లేక జూదమాడుతావా? దేనికయినా సిద్ధమే. జూదం ఆడటానికి నేను దమయంతిని పణంగా పెట్టుతాను" అంటాడు. పుష్కరుడు దమయంతిని గెలుచుకొనాలని సంబరపడి ద్యూతానికే వచ్చి

తాను మొత్తం రాజ్యాన్నే పణంగా పెట్టాడు. ఆ జూదంలో పుష్కరుడు ఓడిపోతాడు. ఎందువల్లనంటే, నలునకు అక్షవిద్య వచ్చు. పైగా 'కలి' పుష్కరునకు ఇప్పుడు సహాయం చేయలేదు. ఈ కారణంచేత పుష్కరుడే ఓడిపోతాడు.

"ఇలా నలమహారాజు నీకంటె దుష్కరమయిన కష్టాలకు గురి అయినాడయ్యా ధర్మరాజా!" అని బృహదశ్వుడు ధర్మరాజుకు చెప్తాడు. ఈ నలదమయంతుల కథనూ ఋతుపర్ణుని కథనూ విన్నవారిని కలి ఏమీ చేయదు. పుణ్యవిషయమిది అంటాడు. ఆ విషయం ముఖ్యంగా తెలియాల్సినట్టిది.

## 2. అవగత క్రమణిక

మహాభారతంలో వేదాంతబోధ అంతర్గతమై ఉంటుంది. ఆచరణ వేదాంత మర్మంకావాలంటె భారతమె చదవాలి. "నల" అనే పదానికి 'అసంగ'మని అర్థం. అది మానసికం, నలుడు దమయంతిని పెండ్లాడాడు. దమమంటె శారీరిక నియంత్రణమని అర్థం. వీరిద్దరూ పెండ్లాడటం సాధనకు శారీరక మానసిక నియమాలు రెంటినీ పాటించటం అవసరమని అర్థం. ఆ రెంటిలో ఒక్కటి మాత్రమె ఉంటే చాలదని సూచన.

వీరిద్దరి పెండ్లిని సమకూర్చింది హంస. సోఽహం అనేదె 'హంస'గా కథలో వ్యాసమహర్షి చేర్చాడు. "నేనే పరమాత్మ"నని దాని అర్థం. ఈ మంత్రంతో–అంటే ఆలోచనతోడనే 'దమం'సంతరించి అసంగుడైన నలుడు ఆచరణ వేదాంతాన్ని పాటించి. బుద్ధి, మనసు, శరీరం, ఇంద్రియాలు చిట్టచివరి కాలివ్రేలిదాకా ఇంకింపజేసికొన్నాడు. అదీ సాధన–

సాధన చేస్తేనేకాని మోక్షంరాదని వేదం చెప్తున్నది, వ్యాసమహర్షి ఈ నలదమయంతి కథవింటె మోక్షం వస్తుందని వ్రాసాడు. అంటే అర్థం దానిని సరిగా అర్థం చేసికొని సాధన పాటిస్తె మోక్షం వస్తుందని బోధ.

నలుడు దమయంతిని పెండ్లాడడానికి ఇంద్రాదులు అడ్డువచ్చారు. వైరాగ్యంగల నలుడు శారీరిక దమం పాటించడానికి ఇంద్రాగ్ని యమవరుణులు అడ్డుతగిలారంటే అర్థం, కామం, క్రోధం, లోభం, మాయలు అడ్డుగా

సాధకులకు తగులుతాయని బోధ. వాటిని నాశనం చేయడంకంటె బుజ్జగించి ప్రార్థించి జయించాలనేది కథాపరంగా మనకు చెప్పబడుతున్నది.

ఈ మాత్రం చాలదు మోక్షానికి. 'అహం బ్రహ్మాస్మి' సాధన చేయడం అవసరం. అంటె—ఇది కాదు—బ్రహ్మము అంటూ "నేను" ఎవరో తెలియాలి. ద్యూతం నలుడు ఆడి సర్వమూ వదలి వేయటాన్ని చెప్పి ఈ 'నేతి' 'నేతి' సాధన చెప్పడమయింది. ఈ సాధన నిలపడానికిగాను అసంగమూ దమమూలతో సహా అభ్యాసం చేయాలి. అందుకె నలుడు సతీసహితుడై అరణ్యం వెళ్ళినట్లు కథలో చెప్పారు. అరణ్యం అంటె ప్రశాంతత కలిగి సదని అర్థం.

రెండు బంగారు రెక్కల పక్షుల్ని పట్టాలనటం ద్వంద్వాలను జయించబూనటం. కట్టుగుడ్డ వాటిపై విసరివేయడం అవి దానితో ఎగిరిపోవటం, ద్వంద్వాలు నశించటం, మాయకూడ నశించటం (బట్ట మాయిక సంకేతం) అని అర్థం. బుద్ధికి సంబంధించిన మాయనశించినా శరీరానికి సంబంధించిన మాయ ఇంకా దమయంతి చీరగా ఉండే ఉన్నది. వారిద్దరూ దానినె ధరించి చివరకు నిద్రించారు— అంటే ప్రశాంతి సాధనలో కలిగిందిఅని అర్థం. నలుడు ఒంటరిగా వెళ్ళిపోయింది ఆశాంతితోనె. సగం చీర చించుకోవటం వల్ల బ్రతకడానికి తగిన మాయ ఉందింకా.

తరువాత అతడికి మంటలు కన్పడటం జ్ఞానప్రకాశమని అర్థం. పాము కుండలినీ శక్తి. అది అధోముఖమైతె అజ్ఞానం. అలాకాకుండా బయటకు నలుడు కర్కోటకుని తెచ్చాడంటే సాధకుడు ఊర్ధ్వముఖంచేశాడని అర్థం. అది వానిని కరిచిందంటె అహంబ్రహ్మాఽస్మి సాధన పూర్తి అయిందని అర్థం.

అహంబ్రహ్మాస్మి సాధనతో చాలదు. నేనుబ్రహ్మను అని కేవల సమాధిలో ఉండిపోతె చాలదు. తిరిగి జాగ్రత్తలోకి వచ్చి సర్వత్ర బ్రహ్మను చూడాలి. అదే సర్వంఖల్విదం బ్రహ్మ సాధన. తాను పరమేశ్వరుడై ప్రకృతిని సేవిస్తూ బ్రహ్మస్థితిలో ఉండాలి. అదీ జీవన్ముక్తి.

నలుడు బాహుకుడై అశ్వవిద్య నేర్చి (ఇది ప్రకృతికి ప్రతీక) జీవన్ముక్త స్థితికి వెళ్ళాడని అర్థం. తిరిగి దమయంతిని పెండ్లి చేసికొనటం ప్రకృతీ

పురుషులిద్దరూ బ్రహ్మస్థితిలో ఉండగలుగడం జీవన్ముక్తి సంపదటమని సూచన ద్వంద్వాలు అదుపులోనుంటమని బోధ.

వ్యాసమహర్షి ఈకథ చదివినవారికి మోక్షం వస్తుందని అబద్ధం వ్రాశాడని ఎలా అనగలం? ఇంత అర్థం అందులో ఇమిడ్చిన మహాత్ముని మాట!

## 3. ధర్మరాజు తీర్థయాత్రలు

బృహదశ్వుడనే ఋషి అరణ్యంలో ఉంటున్న పాండవుల వద్దకు వచ్చి ధర్మరాజునకు నలోపాఖ్యానం కథ చెప్పి ఓదార్చి వెళ్ళిపోయిం తర్వాత ధర్మరాజు "అర్జునుడు తపసుచేసి ఆయుధాలూ అస్త్రాలూ సంపాదించుకొని వస్తానని వెళ్ళి చాల రోజులయింది ఇంకా రాలేద"ని తపిస్తూ ఉంటాడు.

ఆ సమయంలో నారదుడు వచ్చి దేశంలోని వివిధ తీర్థాలపేర్లూ చెప్పి వాటిని దర్శించి గ్రుంకులిడి క్రతువులు సలిపిన వారికి కలిగే పుణ్యఫలాలేవి వున్నాయో అవన్నీ చెప్తాడు. నన్నయ ఆతీర్థాల పేర్లూ ఫలాలూ అన్నిటినీ స్పష్టంగా వర్ణించి ఏబది పద్యాలకు పైగా వ్రాశాడు. ఏ తీర్థం సేవించినట్లయితే ఏ ఫలమని చూడటానికి వాటిని చదువుకొనవచ్చును—నిఘంటువులా. ఆ ఫలాల్లో రాజసూయం చేసినంత ఫలమనీ అశ్వమేధం చేసినంత ఫలమనీ ఇలా వర్ణించారు. శూద్రులు కొన్ని తీర్థాలలో క్రతువులు చేసినపుడు బ్రాహ్మణులవుతారనీ బ్రాహ్మణులు బ్రహ్మసాయుజ్యాన్ని పొందుతారని కూడా వ్రాశారు. అనగా మనోబుద్ధులు మంచికి పురోగమించినవై సత్త్వగుణ ప్రధానమైన వవుతవనీ, సత్త్వగుణమేగలవారయినట్లయితె బ్రహ్మసాయుజ్యాన్నే పొందే శక్తిని పొందే అవకాశమున్నదనీ అర్థం. అలా ప్రవర్తించటం అలా నడచుకోవటం ముఖ్యం అన్నమాట. చివరకు ఈ ఫలాలూ తీర్థాల పేర్లూ వినడం వల్లనే పుణ్యం కలుగుతుందని నారదుడు ధర్మరాజుకు చెప్పివెళ్తాడు.

తర్వాత రోమశుడనే ఒక ముని ఇంద్రలోకం నుంచి ధర్మరాజు వద్దకు వస్తాడు. అక్కడ తాను అర్జునుడు ఇంద్ర సింహాసనంపై ఇంద్రునితో సమంగా కూర్చున్నట్లు చూశాననీ, పాశుపతాస్త్రలాభం అర్జునుడు పొందాడనీ, ఎన్నో ఇతర అస్త్రాలను కూడ పొందినాడనీ చెప్తాడు. ఇంద్రుడు

తనను వెళ్ళి ధర్మరాజాదులచే తీర్థయాత్ర చేయించవలసిందని చెప్పటంచేత వచ్చాననికూడా చెప్తాడు. వెంటనే తీర్థయాత్ర చేయడానికి అక్కడి బ్రాహ్మణ పౌర బృందం సహా తలపడుతారు. ధర్మరాజుకు ఒక సందేహం కలుగుతుంది. "ఈ గిరి, సరిత, సరోవరాలు అచేతనములైనవి, అవి జగత్పావనములు జనులకు దురితాపహారములుగా – ఎలా అవుతున్నాయి చెప్పవలసింది" అని రోమశుని అడుగుతాడు.

అందుకు రోమశుడు చాల జాగ్రత్తగ సమాధానం చెప్పవలసి వచ్చింది. "వసుధపై ధర్మవర్తనులూ అధర్మ వర్తనులూ ఇద్దరూ ఉంటారు. అధర్మ వర్తనులయితే ఇలాంటి తీర్థ యాత్రల కారణంగా ప్రవర్థితులయినప్పటికీన్నీ చివరకు నాశాన్నే పొందుతారు. ధర్మవర్తనులు వాటివల్ల ప్రవర్థితులై సత్కీర్తి శ్రీ విభవాన్వితులవుతారు. అధర్మ వర్తనులెందుకు అలా నాశాన్ని పొందుతారంటారేమో! వారి యందు ఈ తీర్థయాత్రలవల్ల దర్పం పుట్టుతుంది. దాని వల్ల మానం, మానంవల్ల క్రోధం, క్రోధంవల్ల లజ్జ చెడిపోతుంది–వృత్తం చెడిపోతుంది. లజ్జావృత్తాలను విడిచిన వారిని లక్ష్మి వదలివేస్తుంది.

ధర్మవర్తనులైనవారు– అంటే దేవతలూ ఋషులూ వంటివారు– తీర్థాలను సేవించడం చేత అవి పవిత్రాలవుతాయి. సర్వకామ ప్రదాలవుతవి. ఈ విధంగా తీర్థాలు పునశ్శక్తివంతములవుతూ ఉంటవనేది ముఖ్యం" అని చెప్పాడు.

అప్పుడు వారంతా తీర్థయాత్రలకు బయలుదేరి నైమిశం, అశ్వతీర్థం, గంగాఘోషం, కన్యాతీర్థం, గోమతి, బాహుద, మహానది వేయజనమయిన ప్రయాగ, గయ మొదలయిన తీర్థాలు సేవించి అగస్త్యాశ్రమం చేరుతారు. అగస్త్యుని కథను రోమశుడు ధర్మరాజునకు చెప్తాడు.

## 4. అగస్త్యుని కథ

ఇల్వలుడు, వాతాపి అని ఇద్దరన్నదమ్ములు. రాక్షస స్వభావులు. ఇల్వలుడు ఒకసారి ఒక బ్రాహ్మణుని తనకు సకల కామసిద్ధికరంబయిన మంత్రం ఉపదేశింపవలసిందని అడుగుతాడు. ఇది స్వార్థపరం. అసుర బుద్ధి అన్నమాట. ఆ బ్రాహ్మణుడు చెప్పలేదు. అందుకు ఆయన్ని భోజ

నార్థం పిలిచి, తన తమ్ముడైన వాతాపిని మేకగామార్చి దానిని చంపి, ఆ మాంసంతో భోజనం పెట్టుతాడు. భోజనమయిన తరువాత "వాతాపీ! రా రా నాయనా!" అని పిలవడం వాతాపి బ్రతికి ఆ బ్రాహ్మణుని పొట్ట చీల్చుకొని రావటం జరిగింది. బ్రాహ్మణుడు చనిపోతాడు.

ఆ తరువాత కూడ ఇతర బ్రాహ్మణులను ఇలాగే భోజనానికి పిలవడం వాతాపిని లేడిగాచేసి చంపి వండిపెట్టడం, భోజన సమయమయినాక పిల్చి పైవిధంగా బ్రాహ్మణులను చంపడం. ఇదీ ఇల్వలుడు చేసేపనిగా మామూలయింది. ఇల్వలుడు మహా ధనవంతుడు. ఆ ప్రక్కనున్న రాజులకు కూడ ఎవరికీ అతడికున్నంత ధనం లేదు.

ఇలా ఉండగా అగస్త్యుడు బ్రహ్మచారియై వివాహం చేసుకొనడానికి ఇష్టపడటల్లేదు. ఆయనకు వాని పితరులు కనిపించి "నీవు పిల్లలను కంటేనేగాని మాకు గతుల్లేవు గనుక పెండ్లిచేసుకొని పిల్లలను కనవలసిం"దని అంటారు. అగస్త్యుడు ఒకప్పుడు తన తపశ్శక్తిచేత, విదర్భ దేశరాజు పుత్రకాముడై తన్ను అభ్యర్థింపగా, వారికి కుమార్తె కలుగేటట్లు ఆశీర్వదించాడు. ఆ రాజుకు లోపాముద్ర అనే కుమార్తె కలుగుతుంది. ఆమె యావ యవ్వనవంతురాలైన సమయంలో ఎంతోమంది రాజులు ఆమెను పెండ్లిచేసుకొనవలెననుకొని కూడ అగస్త్యుడింకా బ్రహ్మచారియై ఉండినందున ఆయనకు కోపం వస్తుందని మాట్లాడక ఊరుకొంటారు.

ఇలా ఉండగా అగస్త్యుడే వచ్చి అర్థించినప్పుడు రాజు పిల్లనివ్వడానికి సందేహించినా లోపాముద్ర మాత్రం ఆయన్నే చేసికొంటానంటుంది. ఆమెకున్న నగలూ నాణ్యాలు వదలివేసి అగస్త్యుడు ఆమెను హరిద్వారం తీసికొనిపోయి అక్కడ తపసు చేసికొంటూ ఉంటాడు. ఎప్పుడో ఒక రోజున ఈమెపై కామ ప్రవృత్తి కలిగి దగ్గరకువస్తే, లోపాముద్ర– "నీవు పతివి నేను పత్నిని. సంతానంకోసం కలువడం మామూలే. కాని ఇప్పుడు నన్ను భూషణాదులతో అలంకరించి ఋతువారాలు తప్పిపోకుండా అనుభవించాల్సింది" అంటుంది.

అగస్త్యుడు "నాకు తపోధనమేగాని ప్రాపంచిక ధనంలేదు. దానిని సృష్టించి తపసును వెచ్చించడం ఇష్టంలేదు. వెళ్ళి ఏ రాజునో అడిగితెస్తా"

నని శ్రుతపర్వుడనే వానివద్దకు వెళ్తాడు. వానికి పోషణధనం పోగా మిగిలిన ధనం ఉంటే తనకు దానం చేయవలసిందని కోరుతాడు. అలాటి ధనం తనవద్ద లేదని, ఆ రాజూ ఇంకా కొందరూ ఇల్వలునివద్ద కావలసినంత ధనమున్నదని చెప్తారు.

వెంటనే అగస్త్యుడు ఇల్వలుని వద్దకు వెళ్తాడు. ఇల్వలుడు తమ్ముడైన వాతాపిని లేడిగాచేసి చంపి మాంస భోజనం పెడ్తాడు. అగస్త్యునితో నున్నవారు చెప్తారు- "అయ్యా ! ఈ భోజనం తినవద్దు. వాతాపి మన కడుపులు చీల్చుకొని వస్తాడుగాక" అని. కాని అగస్త్యుడు ఆతిథ్యం స్వీకరించి పొట్ట నవరించుకొంటూ "వాతాపి జీర్ణం" అంటాడు, వాతాపి మాంసమంతా జీర్ణమై ఊరుకొన్నది. ఇల్వలుడా తరవాత వానిని పిలిచినా అతడు బ్రతికిరాలేదు. ఇల్వలుడు దొంగకు తేలుకుట్టినట్లూరుకొని వచ్చి అగస్త్యుడడిగిన ధనాన్ని దానం చేస్తాడు ఆ ధనంతో లోపాముద్ర అభిమతాన్ని తీర్చి రమించుతాడు. తరువాత పుత్రపౌత్రవంతుడౌతాడు అగస్త్యుడు.

తీర్థయాత్రలవల్ల శమం, దమం కలుగుతవి. యాత్రికులు ఇంకొకర్ని యాచించరు. ఋజు ప్రవర్తనం అలవాటు చేసికొంటారు. దయ పెంచుకొంటారు. ఇలా అని భారతంలో ఎన్నో చెప్పారు. అందుకే తీర్థయాత్రలవల్ల అత్యంతమైన ఫలం కలుగుతుందని బోధ.

అగస్త్యుని కథ కొంత మోక్ష సాధనను తెలియజేస్తుంది. సాధన చేసే వారికి విఘ్నాలు కలుగుతుంటవి. ఇల + వలుడు అంటె పట్టిమాయావి అని అర్థం. వాతాపి అంటే కోరికల రేగగొట్టేవాడు. వీరిద్దరూ జ్ఞానసాధనకు అడ్డంకులు కలగజేయటం కద్దు. అందుకు సాధారణమైన సాధనచాలదు. "అగస్థ" అంటే నిశ్చల అని అర్థం. కోరికలకు లొంగని సాధనచేయాలని బోధ.

భారతకథ అంతా ఇలాంటి బోధలకోసమె వ్యాసమహర్షి వ్రాసింది : : :



# మహాభారత కథలు

(అరణ్య పర్వము-తృతీయాశ్వాసము)

## 1. సముద్రాపోశనము

ధర్మరాజాదులు అగస్త్య మహామునిని గూర్చిన కథలను ఇంకా చెప్ప కోరుతారు. లోమశుడు చెప్తాడు.

వృత్రాసురుణ్ణి చంపడానికి ఇంద్రుడు దధీచి దగ్గరకు వెళ్ళి ఆయన వెన్నెముకను తనకీయవలసిందని అడుగుతాడు. నిష్కామ కర్మచేసే ఆ దధీచి వెంటనే మహాప్రసాదమంటూ తన వెన్నెముకను త్యాగం చేస్తాడు. అదె వజ్రమయింది. దానితో వృత్రాసురుణ్ణి ఇంద్రుడు జయించాడు. కాని కాలకేయులనే రాక్షసులు నీటి మధ్యలో దాగుకొని ఎప్పుడోవచ్చి దేవతలను బాధిస్తుండటంచేత వజ్రం ఉపయోగించి వారిని జయించటం కుదరటల్లేదు ఇంద్రుడికి.

బ్రహ్మేంద్రాదులు ఏంచేయాలని విచారించి విష్ణుమూర్తి సలహాపొందుతారు. ఆయన చెప్పిందేమిటంటే-"సముద్రంలో నీరు అడ్డువస్తోందిగనుక మిత్రావరుణ తనూజుడయిన అగస్త్యునిచేత ఈ నీటిని ఒక్క గుటకలో త్రాగించేయండి. ఆయన ఆపని చేయగలడు. అప్పుడా రాక్షసులు కనిప్స్తారు. వాళ్ళను జయించాల్సింది" అన్నాడు.

దేవతలు అగస్త్యుని ప్రార్థించుతారు. "అయ్యా నీ గొప్పతనం మేమెరుగుదుము. వింధ్యపర్వతం మేరుపర్వతంపై స్పర్థపెట్టుకొని సూర్యుడు మేరు పర్వతంచుట్టూ ఎందుకు తిరగాలని పంతంపట్టి పైకి పెరిగి సూర్యగమనానికి అడ్డు తగిలినప్పుడు నీవుకాదా వింధ్యకు దక్షిణానికి వస్తూ ఆతడ్ని శాసించావు: నీకు ఆయన నమస్కారం వంగిచేసినప్పుడు నీవు తిరిగి వచ్చేదాకా అలాగే వుండుమన్నందువల్ల గదా సూర్యుడు తన పథాన్ని తాను వెళ్ళగలుగుతున్నాడు. ప్రపంచానికి కలిగే అపాకర్యాలన్ని ఎంతో ప్రియంగా పరిష్కారం చేశావుగదా: ఇప్పుడు మమ్ములను రక్షించాల్సిన భారం నీది. సముద్రాన్ని ఆపోశన పట్టి నిర్జలముగా చేయాల్సింది" అన్నారు. ఆయన వారితో

నవ్వుతూ వెళ్ళి ఒక్క ఆపోశనతో సముద్రపు నీరంతా హరించాడు. అప్పుడు దేవతలు వెళ్ళి కాలకేయుల్ని జయించి వచ్చి మళ్ళీ నీళ్ళు వదలండి అని అగస్త్యుని అడుగుతారు. మహాను భావుడైన అగస్త్యుడు "అయ్యో ఆ నీరంతా ఎప్పుడో జీర్ణమైపోయిం"దన్నాడు.

ఐతే ఇక మేఘాలు ఎలా విజృంభిస్తాయి ఎలా వర్షాలు కురుస్తాయి అని దేవతలు బ్రహ్మను సంప్రతిస్తారు. బ్రహ్మ ఈ భూమిమీద నదుల్లో నీరు చాలదు గనక ఆకాశం నుంచి గంగను తెస్తేనేగాని కుదరదని చెప్తాడు. భగీరథుడనేవాడు ఆ గంగనెలాగో తేగలడులెమ్మంటాడు. అతడింకా పుట్టలే దప్పటికి. తరువాత ఎప్పుడో త్రేతాయుగంలో ఇక్ష్వాకు వంశంలో భగీరథుడు పుట్టుతాడు.

భగీరథుని తాతగారు సగరుడు. ఇతడు పిల్లలకోసం కైలాసం వెళ్ళి తపస్సు చేశాడు. ఆయన కిద్దరు భార్యలు. మహేశువరంవల్ల ఒక భార్యకు 6000 మంది పిల్లలు పుట్టారు. రెండో ఆమె గర్భవతి అయినా ఆమెకు ఒక పిండం పుట్టుతుంది. దానిలోని బీజాలు తీసి నేతిలో ఉంచుతారు. అవి తరు వాత అసమంజసుడనే పిల్లవాడుగా అవుతవి. అతడు దుర్మార్గుడు కావటం వల్ల దేశంనుంచి తండ్రి బహిష్కరిస్తాడు. ఆ ఆరువేలమందీకూడ దుర్మా ర్గులె. ప్రజలను బాధించేవారె.

కొంత కాలానికి సగరుడు అశ్వమేధయాగం తలపెట్టి అశ్వాన్ని వదలు తాడు. అది ఎక్కడకు వెళ్ళిందో తెలిసికోలేక ఆ ఆరువేల మందిన్నీ వెతు కుతూ వెతుకుతూ సముద్రంలోంచి క్రిందికి పాతాళానికి వెళ్తారు. అక్కడ కపిలుడనే మహాముని ప్రక్కన ఆ గుఱ్ఱం ఉన్నట్లు చూస్తారు. ఆయన తపసు చేసుకొంటున్నాడు. ఈ దుర్మార్గులు వెళ్ళి ఆయన్ను అవమానిస్తారు. ఆయన కన్ను తెరచి చూడంగానే ఈ ఆరువేల మందీ దగ్ధమైపోతారు.

సగరునికి ఒక మనుమడున్నాడు. అతడు అసమంజసుడి కొడుకు. అశ్వం పాతళలోకంలో ఉన్నదని వాళ్ళు తెలిసికొన్న వాళ్లై అంశుమంతుడనే ఆ మను మడు పాతాళం వెళ్ళేటట్లు ఏర్పాటు చేస్తారు. అంశుమంతుడు వెళ్ళి కపిలుడ్ని ప్రసన్నుణ్ణిచేసి తన తండ్రుల్ని బ్రతికించుమని ప్రార్థిస్తాడు. కపిలుడందుకు

సమ్మతింపక వారికి ఉత్తమగతులు రావడానికి మార్గం చెప్తాడు— ఏమంటే, ఆకాశగంగను తెచ్చి వీరి భస్మాలపై పారింపజేస్తే వారు ఉత్తమగతి పొందుతారు అని చెప్పి, గుర్రాన్ని చూపి ఇచ్చేస్తాడు. సగరుని అశ్వమేధం పూర్తి అవుతుంది. సముద్రుని సగరుడు పెంచుకొన్నాడు. అందుకే సముద్రానికి సాగరమనే పేరు వచ్చింది.

అంశుమంతుని కుమారుడు దిలీపుడు. వాని కుమారుడు భగీరథుడు వీరిద్దరూ తమ జీవితకాలమంతా తమ పూర్వీకుల ఉత్తమగతి నర్థిస్తూ గంగను గూర్చి తపసు చేస్తూనే ఉన్నారు. భగీరథునకు గంగ ప్రత్యక్షమై విష్ణుపాదం నుంచి నేను ఈ భూమిమీదకు వస్తే ఈభూమి నా వేగాన్ని ఆపగలదా? ఛిన్నాభిన్నమైపోదా? అందుకని శివుని ప్రార్థించి తన తలపై నన్ను భరింపుమని కోరుమంటుంది. మళ్లీ భగీరథుడు తపస్సుకు ఆరంభిస్తాడు శివుని గూర్చి. శివుణ్ణి ప్రసన్నుణ్ణిగా చేసికొని చివరకు గంగను ఆకాశం నుంచి పారించి భూమినీ, పాతాళంలోని తన పూర్వీకులనూ పవిత్రులుగా చేస్తాడు. అలా గంగ నీరు హిమాలయ స్థానాన్ని పునీతం చేసి సముద్రంలో పుష్కలంగా నీరు ఉండేటట్లు చేసింది.

దిలీపుడూ, భగీరథుడూ తమ పూర్వీకుల కోసమే బ్రతికారనిపిస్తుంది. ఇలాంటి నిస్స్వార్థపు బ్రతుకులో ఉన్న పవిత్రతేమిటో మనకు ఎన్నడైనా తెలుస్తుందా!

తీర్థయాత్రా కాలంలో అగస్త్యుని కథతో మొదలు పెట్టి, ఎన్నో కథలు ధర్మరాజు విన్నాడు. వ్యాసుడు ఆ కథలలో ఎన్నో వివరాలు చెప్పటంలో ఏదో అర్థం ఉందనీ అది తెలియాలనీ అనిపిస్తుంది. వ్యాసుడు ఊసుపోకకు వ్రాసిన గ్రంథం కాదిది; ఇదే ననేమిటి, 16 పురాణాలూకూడా అలా అంత రార్థపరంగా వ్రాసినవే. వ్యాసుడే పద్మ పురాణంలో ఇలా వ్రాశాడు—

శ్లో॥ వైకుంఠె నాథ కోపంథాః సతుగోప్యోహి వర్తతే
దస్యోపదేష్టా పురుషః ప్రాయోభాగ్యేన లభ్యతే

రహస్యార్థాలున్నాయి (గోప్యంగా) ఈ కథల్లో. పాలల్లోంచి నేతిని తీసినప్పుడే దేవతలకు హోమం చేసేందుకు వీలు కలిగే విధంగా ఈ కథల్లోని

పదాల, విషయాల, అంతరాంతరాల్లోకి వెళ్ళి నిలబడగలిగేవాడు అదృష్ట వంతుడు అన్నాడు. మహత్తరమైన ఫలితం ఏదో వాడికి దొరుకుతుంది అన్నాడు. అది అద్వైత తత్త్వ పూర్వకమైన మోక్ష మార్గమేనని వేదార్థం తెలిసినవారు చెప్పారు. వేదార్థం విశదీకరించడానికే వ్యాసుడు పురాణాలూ, భారతమూకూడ వ్రాశాడనేది జ్ఞాపకం చేసికొవాలి.

అగస్త్యుడంటే నిశ్చలమైన జ్ఞాన తత్త్వమని అర్థం. ఇంద్రుడు మనసు, సాధకుని మనసు. దానిని—వృత్రాసురుడు—అంటే ఆవృతి కలవాడు—ఆవరించాడు, అదే మాయ. దీనిని పోగొట్టటానికి దధీచి అనే పరమాత్మ తత్త్వం తన వెన్నెముక నిచ్చింది. దానికి ఆరు అంచులున్నాయట. దానితో ఈ మాయను ఇంద్రుడు గెలిచాడు. ఆ ఆరు అంచులూ మూలాధారం స్వాధిష్ఠానం మణిపురం అనాహతం విశుద్ధం ఆజ్ఞా చక్రాలపై సాధన అనే అర్థము. అవి సాధనా లక్ష్యాలుగా సాధన చేసినప్పుడు మనసునకు గల మాయ తెగిపోగలదని సూచన.

వృత్రుడు వదలినా ఇంకా కొన్ని దుష్టవృత్తులు — కాలకేయులనే వాళ్లు — శరీరంలో దాగొంటూ సాధకుని ముందుకు పోనీయక అడ్డుపడుతున్నారు. వారిని నిర్జించాలంటే సత్వృత్తు లయిన దేవతలకు మాయ అడ్డువస్తూనే ఉంటున్నది. మాయ ఇక్కడ సముద్రపు నీరుగా తెలియ చెప్పారు. దానిని హరించేవాడు అగస్త్యుడంటే నిశ్చల జ్ఞాన తత్త్వమే దానిని హరించగలదు అని అర్థం. నిశ్చల జ్ఞాన తత్త్వం గలవాడు కనుకనే అగస్త్యుడు సముద్రమంతటి మాయను ఆపోశనం పట్టాడు. మాయ అలా నిశ్చల జ్ఞాన తత్త్వం వల్లనే తిరస్కరించబడవలెనని బోధ.

వింధ్య పర్వతానికి — "వింద్య" అని చెప్పితే "కేవలం తార్కికమైన జ్ఞానం" అని అర్థం వస్తుంది. సూర్యునికి అడ్డుపడుతున్నాడంటే విమలమైన జ్ఞానానికిఅడ్డు తగులు తున్నాడని అర్థము.తర్కంవల్ల విషయం తెలియటమంటూ ఉండదు. అంతులేని తర్కమే పెరుగులుతుంది. కాని అనుభవ జ్ఞానంలో శాశ్వతుడైన అగస్త్యుడు వచ్చేటప్పటికి వింధ్యుడు వంగి నమస్కరించినాడు. ప్రత్యక్షానుభవం కలిగినవాని ఎదుట వివిధ ప్రమాణాలవల్లకలిగే సాక్ష్యమూ, తర్కమూ, వ్యర్థమై నిలుస్తవి అని అర్థం. "మాకాను"అని చెప్పే సాక్ష్యం ఉన్నప్పుడు — నీవు చూసి ఉండి యుండక పోవచ్చు అనే ఊహాపోహాత్మక తర్కం వ్యర్థమని బోధ చేయడానికే ఈ కథను వ్యాస మహర్షి చెప్పాడు.

ఇలా అంతరాంతరాల్లోని సాధనాక్రమం తెలిసి ఉపనిషత్ప్రతిపాదితమైన మోక్ష మార్గం తెలియడానికి వీలుండటం వల్లనే భారతం వేదార్థ బృంహిత మైందనటం మర్చిపోరానిది.

## 2. ఋష్యశృంగుని కథ

విశ్వామిత్రుని ఆ స్నదమునూ, కౌశికినీ, ఋష్యశంగ హ్రదమునూ సేవిస్తూ వెళ్తూ ఉంటారు ధర్మరాజాదులు. అప్పుడు ధర్మరాజు ఈ ఋష్య శృంగుని కథంతా చెప్పవలసిందంటాడు.

"కశ్యపుని కుమారుడు విభాండకుడు అఖండబ్రహ్మచారి. ఎల్లప్పుడూ అడవుల్లోనే తపస్సుచేసికొంటూ ఉండేవాడు. ఈయన ఒక హ్రదంలో స్నానం చేస్తుంటే ఊర్వసి అనే పిల్ల కన్పిస్తుంది. అప్పుడు ఈయనకు రేతస్కందమవుతుంది. ఆ రేతస్సుగు నీళ్ల తాగటానికి వచ్చిన ఒక లేడి తాగి గర్భం ధరించి ఋష్యశృంగుడనె కుమారుడ్ని కంటుంది. విభాండ కుడు అతడ్ని పెంచుతూ ఉంటాడు. పుట్టిన దగ్గర్నుంచీ అతడికి తండ్రి తపస్సు, తపస్సులు తప్పితే ప్రాపంచిక విషయాలు తెలీవు.

ఇలా ఉండగా, అంగదేశాధిపతి అయిన రోమపాదుడనేవాడి రాజ్యంలో బ్రాహ్మణ శాపంవల్ల అనావృష్టి వస్తుంది. దానిని పోగొట్టుకోవడం ఎలాగని ఆయన మహనీయుల్ని సంప్రదిస్తాడు. వారు ఋష్యశృంగుడికి ఒక వరమున్నదనీ, దాని ప్రకారం ఆయన ఎక్కడ ఉంటే ఆ దేశంలో సువృష్టి ఉంటుందనీ, అందుచేత ఆయన్ని తెచ్చి ఇక్కడ ఉంచితె ఈ అంగరాజ్యాని కయిన దోషంపోతుందనీ చెప్పారు.

అప్పుడు రోమపాదుడు నానాప్రయత్నాలుచేసి, కొందరు చలాకీఅయిన అందమైన యవ్వనవతులను అడవికి పిల్చి ఋష్యశృంగుని ఆకర్షించి అంగ దేశానికి తీసికొని రావలసిందని పంపుతాడు. ఆ బృందం వెళ్ళి అందులో ఒక అమ్మాయిని, ఋష్యశృంగునిదగ్గరకు కూతాత్తుగా పంపుతుంది. అతడు ఈమెను చూచి తపసి అనుకొని ఇంత అందంగా ఉన్నడా! అనుకొంటాడు. ఆమె కట్టిన చీరల సౌకుమార్యం జడల అందం మెచ్చుకొంటాడు. పట్టు కొని స్పర్శ అనుభవిస్తాడు. ఆమె తన ముఖం ఆయన ముఖానికి చేర్చి

ముద్దు పెట్టుకొంటుంది. అతడు ఈ విధంగా ఆమెయందు రాగాన్ని పెంచుకొంటాడు. ఆమె పాలిండ్లు పట్టుకు చూస్తాడు. ఆమె అడుతున్న బంతికూడ ఏదో పండు అనుకొంటాడు. తాను అతిథిగా ఆమెకు ఆతిధ్యమిస్తానంటాడు ఆమె "కాదు నీవే రావలసినది మా ఆశ్రమానికి నేను ఇచ్చే ఆతిథ్యం స్వీకరిస్తేనేగాని వీల్లే"దంటుంది.

మరునాడు ఆమెతో వెళ్ళిపోతాడు అంగదేశానికి. అక్కడ సువృష్టి కలుగుతుంది. రోమపాదుడు తన కుమార్తె అయిన శాంతను ర్తాయనికిచ్చి పెండ్లిచేసి అనేక గోసహస్రాలు ఇచ్చి ఆయన్ని అక్కడే ఉంచుకొంటాడు. అక్కడ విభాండకుడు కుమారుడు కనపడని కారణంచేత వెతుక్కొంటూ వస్తాడు. చివరకు ఇక్కడ కుమారునీ కోడలనూ చూచి సంతోషిస్తాడు. ఋష్యశృంగుడు కేవలం ప్రకృతి దూరమైన సాధనతో ఉద్ధతినందజాలక ప్రకృతినికూడ సాధనలోకి తీసికొనటమనేది తప్పనిసరి అయింది. వివాహ సంస్థను జనుల్లో మత రూపకంగా ప్రవేశపెట్టిన కారణం సాధారణ వ్యక్తి కేవలం ప్రకృతికి దూరంగా సాధన చేయజాలదనేదెనని తెలియదగింది.

ధర్మరాజాదులు ఆ మీదట గంగా సాగర సంగమానికి వెళ్తారు. అక్కడ వైతరణి అనే మహానదిని చూస్తారు. ఈ తీర్థంలో స్నానమాడిన వారు దేవతలుపోయే మార్గాన పోతారని రోమశుడు ధర్మరాజుకు చెప్తాడు. అప్పుడు ధర్మరాజు భార్యా సహితుడై స్నానమాడి, పైకివచ్చి. రోమశునితో "నేను స్నానం చేస్తున్నప్పుడు నాకు అఖిల లోకాలూ కన్పడినవి. వైఖానసుల వేదాధ్యయన శబ్దాలు వినపడినవి. ఇదంతా మీ బోధవల్ల, దయవల్ల కలిగిన ఫలితం "అని నమస్కరిస్తాడు. రోమశుడు ఆశ్చర్యపడతాడు. "ఎంత పుణ్యాత్ముడవో ముప్పదివేల యోజనాల దూరానవున్న అధ్యయన శబ్దాలు నీకు వినపడడం ఎంత విస్మయమైన విషయం" అంటాడు.

ధర్మరాజుకు కలిగిన ఈ అనుభూతివల్ల తెలుసుకోతగిన విషయం ఒకటుంది. మనం కళ్ళతో చూసాం, చెవుల్తో వింటాం ఇలా పంచేంద్రియాలతో గ్రహించిన విషయాలు మనసుతో అనుభూతి చేస్తాం. ఇలా కాకుండా కేవలం మనసూ బుద్ధిలతో అనుభూతి చేయటం కూడా ఉంది. స్వప్నంలో ఎన్నో చూసాం. అనుభూతిచేసాం. అన్నీ అనుభూతులే. జాగ్రతలోని

అనుభూతులకూ స్వప్నంలోని అనుభూతులకూ తేడా లేదు. స్వప్నంనుంచి తిరిగి జాగ్రతకు వచ్చి "అప్పే అది పట్టి కల్ల" అనుకొనటమే ఈ రెండు అనుభూతుల విషయంలో కలిగే పరిణామాల తేడా. రెండూ స్మృతిలో ఉంటవి. ఆ స్మృతిలో వున్న విషయాలకూ, అనుభూతులకూ తాదాత్మ్యమైన విషయం తిరిగి జాగృతిలో చూసినా లేదా వినినా ఆ అనుభూతులే పరిణతి చెంది క్రొత్త అనుభూతులు కలగడానికి ఆస్కారం అవుతుంటుంది.

ఇప్పుడు రోమశుడు చెప్పిన వైతరిణీనదిలో స్నానం చేస్తే "దాని ఉత్తర తీరంలో పూర్వం అనేక యజ్ఞాలు చేయబడియున్న కారణంగా దేవయానంలో పోవడం అవుతుంది." అన్నమాటలిని, ధర్మరాజు తనకయిన పూర్వ అను అనుభూతుల ఆధారంగా అఖిల లోకాలూ చూడటం చివరకు వైఖానసుల అధ్యయనం వినడం తటస్థించింది. ఈ తీర్థ సేవల ఉపయోగం ఈ అనుభూతులను పొందటమె. మనసు అందుకు తగిన కంపనాలను అందుకొనే స్థితిలో ఉండవలసి ఉంటుంది.

ధర్మరాజునకయిన అనుభూతి రోమశునకు కలిగినట్లు లేదు. తరువాత రోమశుడు పూర్వం విశ్వకర్మ ఇక్కడ యజ్ఞం చేశాడనీ చేసి కశ్యపుడనే వానికి ఈ దక్షిణ దేశ రాజ్యాన్ని దానం చేశాడనీ చెప్తాడు.

## 3. పరశురాముని కథ

మహేంద్రగిరి మీద ఎప్పుడూ ఎంతో మంది ఋషులు తపస్సు చేస్తూ ఉంటారు. ధర్మరాజు అక్కడకువెళ్లి పరశురాముని తనకు చూపవలసిందని అడుగుతాడు. అందుకు వారు "పరశురాముడు మీరు వస్తారనీ మిమ్మలను చూడాలనీ అనుకొంటూనే ఉన్నాడు. ఆయన ఎక్కడకో వెళ్లారిప్పుడు. రేపటికి వస్తారు. మీరు ఇక్కడ రేపటివరకూ ఉండండి" అంటారు. ఆతరువాత ధర్మరాజు అడిగిన మీదట పరశురాముని పుట్టుకను గూర్చిన కథనంతనూ వారు ఆయనకు చెబుతారు.

"జమదగ్నికీ రేణుకకూ కుమారుడు పరశురాముడు. జమదగ్ని, నదినుంచి రావటం ఆలస్యమైందని రేణుకను, మనసావ్యభిచరించిందనే ఆరోపణమీద చంపవలసిందని తన కొడుకులకు ఆజ్ఞ నిచ్చాడు. చివరి వాడైన పరశురాము

పొక్కడే ఆమెన్ను చంపి జమదగ్ని కోపానికి శాంతి చెప్పుతాడు. తరువాత జమదగ్నిని ప్రార్థించి ఆమెను బ్రతికింప జేస్తాడు. ఆమెను చంపిన పాపం తనకు రాకుండానూ, తన సహోదరులు శాపవిముక్తులయేటట్లా ఆయననుంచి వరం పొందుతాడు.

ఆ తరువాత కార్తవీర్యార్జునుని చంపి రాజవంశాలన్నిటిని కూల్చివేస్తాడు. ఇలా పరశురాముని కథను ఆ ఋషులు చెప్తారు. ఆ మరునాడు పరశురాముడు రాగా ఆయన కెదురు వెళ్ళి పూజించుతారు పాండవులు.

అక్కడి నుండీ గోదావరీ నదీ క్షేత్రాలకు పయనించి అర్జునుడు ఎన్నో దానాలను అక్కడ చేసిన సంగతులు విని ఆనందిస్తారు. తామూ దానాలు చేస్తారు. ఆ తరువాత దక్షిణం ప్రయాణం చేసి తిరిగి పడమరకు వెళ్ళి ప్రభాస తీర్థం చేరుకుంటారు.

పరశురామ అంటే పరతత్త్వమునకు చెందిన ఆనందమని అర్థము. జమదగ్ని జీవుడు, సాధకుడు. రేణుక అంటే అణువులతో కూడినది – ప్రకృతి అని అర్థం. జమదగ్ని సర్వం ఖల్విదం బ్రహ్మ సాధన చేస్తున్నవాడు. అనగా ప్రకృతిని చూచి పరమాత్మను దర్శించే సాధన అది. రేణుక నదికి వెళ్ళి గంధర్వుని విమానం చూచి మతి పోగొట్టుకొని ఆలస్యం చేసింది. అనగా ప్రకృతిలో లీనమైంది. అందుకని జమదగ్ని శిక్ష నిచ్చాడు. పరశురాముడు ఆ శిక్షను అమలు పెట్టాడు. కాని ఆమెన్ను మళ్ళీ బ్రతికించటంతో "ప్రకృతీ పురుషుడూ" ఏకమనే స్థితిని జమదగ్ని సాధించాడని వ్యాసమహర్షి చెప్తున్నాడు.

కార్తవీర్యార్జునుడంటే కృత + వీర్య + అర్జునుడు సంతరింపబడిన వాసనల ప్రభావంవల్ల ఋజుప్రవర్తన కలిగినవాడని అర్థం. అతడు కామధేనును కోరినాడంటే సాధకునకు సిద్ధులపై ఆశ పెరిగిందని చెప్పటం. సాధనలో అది కుంఠితప్రగతి. అందుకని పరశురాముడు వానిని చంపేశాడు. సాధకునకు సిద్ధులపై మమత లేకుండ పోవాలి అనడమే ఈ బోధ. కార్తవీర్యార్జునుని కుమారులూ ఇతరులూ ఇతర దుర్వృత్తులు. వాళ్ళనందరినీ ఇరవయి ఒక్కమారు వెతికి చంపేదంటే పంచమహాభూతాల్లో పంచతన్మాత్రలలో దశేంద్రియాలలో అంతేగాక ప్రవృత్తిలో ఉండే దుష్ట వృత్తుల్ని

వెదికి వెదికి తొలగించటం సాధకుని పని అని అర్థం. పరశురాముడు పృథివీ రాజ్యమంతా కశ్యపునికి దానమిస్తాడు. కశ్యపుడు అంటే పశ్యకుడని అర్థం చెప్పవచ్చు. పరమాత్మ అనే అర్థం వస్తుంది. బుద్ధిని అహంకారాన్ని పరమాత్మపరం చేసి ఊరుకొన్నాడని అర్థం. కథచెప్పి పొమ్మంటె దాని అంతరార్థం ఆలోచించి తెలిసికోవటం కర్తవ్యం. వ్యాసుడు గోప్యంగా పెట్టిన కోథ ఇది.

ప్రభాసతీర్థం ద్వారకకు దగ్గర. అందుకుని అక్కడకు ద్వారకనుంచీ రాముడూ కృష్ణుడూ పాండవుల్ని చూడడానికి వస్తారు. సర్వాస్త్ర లాభాన్ని పొందిన అర్జునుడు ఇంద్రుని దగ్గర ఉన్నాడని అంతా ముచ్చటించి ఎంతో సంతోషాన్ని అనుభవిస్తారు. బలరాముడు దుర్యోధనుని దుష్టత్వాన్ని తెగడి ధర్మాత్ములైన పాండవులె రాజ్యపీఠ మెక్కాలి అని వాదిస్తాడు. కృష్ణుడూ సాత్యకీ ఔనంటాడు. "మీ అందరి సహాయముంటె మాకు లెక్కేమి"టంటాడు, ధర్మరాజు.

మళ్ళీ ప్రయాణం సాగిస్తారు. నర్మదానదిలో స్నానం చేస్తారు. అక్కడ శర్యాతి అనే రాజు యజ్ఞం చేసిన స్థలం చూశారు. లోమశుడు అప్పుడు సౌకన్యాఖ్యానం ధర్మరాజుకు బోధిస్తాడు.

## 4. సౌకన్యాఖ్యానము

ధర్మరాజాదులు తీర్థయాత్రలకై ప్రయాణం చేస్తూ, వైడూర్య పర్వతం దాటి ఒక సరోవరం వద్దకు వచ్చేటప్పటికి రోమశునకు, శర్యాతి అనే రాజు కుమార్తెయైన సుకన్య చ్యవనమహామునిని పెండ్లిచేసికోవటం జ్ఞాపకంవచ్చి చ్యవనుడు అశ్వనీదేవతలను యజ్ఞంలో సోమపీథులుగా చేశాడట అంతకు పూర్వం అశ్వనీదేవతలకు ఈ హక్కు లేదు అన్నాడు.

ఆ కథేమిటంటె చ్యవనుడు భృగుఋషి పుత్రుడు, ఆ వనంలో అనేక వేల సంవత్సరాలపాటు తపస్సు చేసుకొంటూ ఉండేవాడు. అలా చేస్తున్న సమయంలో ఆయన చుట్టూ పుట్టలు పోసినవై, శరీరం కనపడకుండా పెరిగి పోయినయి, చాలా కాలానికి ఈ శర్యాతి అనే రాజు భార్యా పుత్రికలతో సహా అక్కడకు వచ్చి విడిసినవాడై ఉండగా అతడి కుమార్తె అయిన సుకన్య

అక్కడ తిరుగుతూ ఈ పుట్టపంక చూస్తుంటే రెండు రంధ్రాలు అవుపడ తాయి. వాటిగుండా తళతళ మిలమిలలాడుతూ రెండు జ్యోతులు అవుపడతవి. అమె ఆశ్చర్యపోయి పుల్లతో వాటిని పొడుస్తుంది. ఆ కన్పడినవి చ్యవనుడి కళ్ళు.

ఈ అపచారానికి శర్యాతి బృందం అందరికీ మూత్రపురీషాలు ఆగిపో తవి. ఇలా ఎందుకయిందోనని శర్యాతి విచారిస్తున్న సమయంలో సుకన్య వచ్చి ఇలా తాను పుట్టలోకి పుల్లతో పొడిచాననీ అది అపచారమయిందేమో ననె సందేహం వున్నదనీ వెలిపుచ్చుతుంది. అప్పుడు శర్యాతి ఆ పుట్టద రికి వచ్చి చూచి ఆ మునినిగని నమస్కరించి తన కూతురు చేసిన తప్పి దాన్ని క్షమించి అనుగ్రహింపవలసిందంటాడు. అందుకు ఆ ముని తాను మహావృద్ధు అయినా, ఆ పిల్లను తనకిచ్చి పెండ్లి చేయవలసిందంటాడు. తనకూ తన సైన్యాలకూ వచ్చిన బాధనుండి ముక్తుడు కావడానికిగాను ఆమెను ఆయనకు ఇచ్చి వివాహం చేస్తాడు శర్యాతి. సుకన్య భార్యగా పరమభక్తితో పరిచర్యచేస్తూ ఉంటుంది చ్యవనునకు.

అశ్వనీ దేవతలు ఒకసారి ఈ సుకన్యవద్దకు వచ్చి "అంత వృద్ధుతో నీ కామేచ్ఛతీరేదెలాగా. మమ్మల్ను వరింపవలసిం"దంటారు. ఆమె అలిగి తన భర్తతో చెప్పుతుంది వీళ్ళసంగతి. అప్పుడు చ్యవనుడు అశ్వనీదేవతలు ఆయుర్వేద విదులన్న విషయం తెలిసి, ఆమెతో నీవు వాళ్ళ ఉపపాదనను అంగీకరించి "నీకు నవయువ్వనవంతుడైన వరుని చూపవలసింద"ని కోరుమంటాడు. ఆమె అలాగే కోరుతుంది వారిని. వారు అంతట వెళ్ళి ఆ సరోవరంలో మునుకుతారు. అదిచూచి చవ్యనుడుకూడ అందులో దుముకు తాడు వారుమళ్ళీ బయటకు వచ్చేటప్పటికి నవయువ్వనులై వస్తారు. అలాగే చ్యవనుడూ వస్తాడు. సుకన్య ఎదుట నిలుస్తారు ముగ్గురూ. సుకన్య వెంటనె తన భర్తయైన చ్యవనునే వరిస్తుంది. ఆతడిప్పుడు యువ్వనుడే గనుక అశ్వనీ దేవతలకు అభ్యంతరపెట్టే అవకాశం లేకపోయింది. అప్పుడు చ్యవనుడు వారితో—"మీకారణాన నేను వృద్ధత్వాన్ని పోగొట్టుకొని యౌవ్వనుడైనాను గనుక యజ్ఞాల్లో మిమ్మల్ను సోమపానము పొందేటట్లు చేస్తాను అంటాడు. వారు సంతోషించి వెళ్ళిపోతారు.

చ్యవనుడు తన జరాభారం పోగొట్టుకొన్నట్లు శర్యాతివిని చాల సంతోష పడుతాడు, అప్పుడు చ్యవనుడె ఆ శర్యాతిచేత యజ్ఞం చేయించి అందు సోమాన్ని అశ్వనీ దేవతలకు ఇవ్వబోతాడు, వెంటనె ఇంద్రునకు కోపం వస్తుంది. అలా వీల్లేదంటాడాయన. ఆ మాటలను లెక్కచేయక చ్యవనుడు అశ్వనీ దేవతలను సోమపీథులుగా చేస్తాడు— ఇంద్రుడు ఆగ్రహించి వజ్రాయుధం ఎత్తి పైకి వస్తాడు. కాని చ్యవనుని తపోబలంవల్ల, ఇంద్రుని చేయి వజ్రాయుధంతో సహా పైకి ఎత్తుకొని అలా స్థంభీభూతమై పోతుంది. ఇది చాలదన్నట్లు చ్యవనుడు కోపంతో అగ్నియందు వ్రేల్చుతాడు. వెంటనె ఒక మహాభయంకరుడైన రాక్షసుడు పెద్దనోరు దంతాలుతో పెద్ద శరీరంతో పుట్టుకొచ్చి ఇంద్రునిపైకి వస్తాడు. ఇంద్రుడు వెంటనె చ్యవనునె శరణువేడుతాడు. చ్యవనుడు అనుగ్రహిస్తాడు. ఇంద్రుని చేయి స్వాధీనమవుతుంది. ఇంద్రుడు చ్యవనుని ఇష్టప్రకారం అశ్వనీదేవతలకు ఇకనుంచీ యజ్ఞాల్లో సోమపీథులయే హక్కును మన్నిస్తాడు.

ఆ రాక్షసుడు చ్యవనుని ఆదేశంపొంది, మద్యము, కామిని, వేట, జూదములలో అంతర్హితుండై ఉంటాడు. వ్యసనాలుగా వీటిని అనుభవించేవారికివి పూర్తిచేయబడజాలని ఆశగా పుట్టించుతూ ఉంటాడుట.

ఇలా కథలు చెప్పుకొంటూ ధర్మరాజాదులు యమునా నదిని చేరుతారు.

## ౫. మాంధాత చరిత్ర

మాంధాత ఈ యమున వద్ద అనేక సంవత్సరాలు క్రతువులు చేసినట్లు చెప్పుతూ లోమశుడు ఆయన కథను చెప్తాడు. ఈయన తండ్రి యవనాశ్వుడు. వేయి అశ్వమేధాలు చేసినవాడు. ఇక్ష్వాకుల వంశజుడు. ఈయనకు ఎంతో కాలం పుత్రులు లేరు. అందుకని భృగు ఆశ్రమానికి వెళ్ళి ఆయన్ను ఉపాసిస్తాడు. భృగు అప్పుడు ఆరాటుచేత పుత్రకామేష్టి చేయిస్తాడు. ఆ యజ్ఞంలో మంత్ర పూరితజలం తెచ్చి ఒక చోట జాగ్రత్తగా ఉంచుతారు. కాని ఆనాటి రాత్రి అది ఫలాస అని తెలియక ఆ రాజు దానిని తానే తాగేస్తాడు. అది వారి భార్యల కివ్వవలసినట్టిది. ఆ కారణంగా ఆతడి కడుపులోనే ఒక పిల్లవాడు పెరుగుతుంటాడు. ఆతరువాత నూరేండ్లకు రాజు ఎడమభాగం ఛేదించు

కాని బాలార్క-తేజుడైన బాలకుడు వెలుపడుతాడు. అతడే మాంధాత. ఇంద్రుడుకూడ ఈపిల్లవానిని చూడవచ్చి తల్లిలేని వాడవటంచేత స్తన్యమునకు బదులుగా పిల్లవాని బొటన వ్రేలినే వాని నోట బెట్టి అమృతాన్ని అనుగ్రహిస్తాడు.

ఈ మాంధాతకు ధ్యాన మాత్రాన వేదాలు, సర్వశాస్త్రాలు, ధనుర్వేదము, సకల దివ్య సాయక ప్రయోగాలు వచ్చినవట. ఈయన ఇంద్రునితో సహాసనంగా అర్ధాసన మెక్కిన మహామహుడు. ఈయన చేసిన యజ్ఞాల వల్ల తీర్థమై వెలసింది.

## 6. సోమకుని చరిత్ర

యమునా సరస్వతులు గంగకు నీరు తెచ్చే పాయలు. సరస్వతీ తీరంలో ఈ సోమకుడు యజ్ఞం చేశాడు. ఈ యజ్ఞాలు అక్కడి ప్రజలూ, దేశం, భూమి పవిత్రం గావడానికి చేసినవి అయినప్పుడే అవి తీర్థాలుగా రాణించి అక్కడకు వచ్చి గ్రుంకులిడిన వారిపై, పుణ్య ప్రభావాన్ని కలిగిస్తవి. కాని ఈ సోమకుని చరిత్ర చిత్రమైనది. ఇతడికి నూర్గురు భార్యలూ, ఒకే ఒక కొడుకు, ఆ కొడుకుని నూర్గురు భార్యలు అత్యంత మమకారంతో పెంచుతుంటారు. అతడికి చీమ కుట్టితే అందరూ విషాదం పొంది బిగ్గరగా ఏడుస్తుంటారు. ఈ బాధ చూడలేక ఆ రాజు ఋత్విజుని పిలిచి, అయ్యా నాకు నూర్గురు భార్యలకూ నూర్గురు పిల్లలు పుట్టేటట్లు ఏదైనా యజ్ఞం చేయించరాదా అంటాడు.

ఆ ఋత్విజుడు అలా అయితే నే చెప్పినట్లు చేయుమని, ఆ ఒక్క కొడుకునూ యజ్ఞపశువుగా వధించి క్రతువు చేయిస్తాడు. ఆ కుమారుని వపాహవ్యాలతో హవ్యవహుణ్ణి తృప్తి చేయించేటప్పటికి ఆ ధూమాన్ని ఆఘ్రాణించిన మాత్రం చేత నూరుమంది భార్యలూ గర్భవతులై నూరుగురు పుత్రులను కంటారు.

కాలక్రమాన ఆ ఋత్విజుడు నరకానికి పోతాడు. ఈ సోమకుడు చచ్చిపోయి స్వర్గానికి వెళుతూ ఈ ఋత్విజుణ్ణి నరకంలో ఉండటం చూచి ఇలా ఎందుకయిందని అడిగితే "నీచేత ఆ దారుణమైన యజ్ఞం చేయించిన ఫలంగా

నేను నరకంలో ఉన్నాను రక్షించాల్సిందని అతడంటాడు. సోమకుడు యమ ధర్మరాజును కలిసి తన తపో ఫలం కొంత ఆ ఋత్విజునకు దానం చేసి ఆయన్ను రక్షిస్తాడు. ధర్మపరంగా సోమకుడు యజ్ఞ కర్మలు చేయడంవల్ల పుత్రుడు పుట్టాడు. అంటే ముక్తి కాంక్ష కలిగింది అని అర్థం. బాలుడికి చీమలు కుట్టినవంటే—కోరికలనే వాసనలవల్ల ముక్తికామునకు బాధ కలిగిందన్నమాట. సాధనకున్న కోరికలన్నీ (భార్యలందరూ) గోయని పేర్చారు. అనగా అన్ని కోరికలూ తిరిగి ముక్తి కాంక్ష వైపునకు పురోగమిస్తున్నవి. యజ్ఞం చేయింపవలసిందనటం అన్ని కోరికలూ ముక్తి కాంక్షలో దేనికది లయం అయ్యేట్లు చేయడానికి ఆసించాడని అర్థం.

ఆ యజ్ఞం పాపం అన్తుకొంటూనే సోమకునిచే ఆ ఋషి చేయించాడు. పుత్రులు పుట్టారు. ఋత్విజుడు నరకం అనుభవిస్తుంటే సోమకుడు చూచి తన తపోఫలం ఆయనకు సగమిచ్చి ఆయన పాపం తానుకూడ అనుభవించి చివరకు పాప పుణ్యాలను నశింపజేసి మోక్షం పొందినాడు. చేసిన పాప పుణ్యాలు, పరమాత్మ తత్త్వంలో సంపూర్తిగా చేరలేక పోయినట్టి సాధకుని విషయంలో అనుభవించబడటం ద్వారా మాత్రమే తీరుతవి అని బోధ.

ఆ తరువాత ధర్మరాజాదులు ముందుకు సాగివెళ్ళి ప్లక్షావతరణ అనే తీర్థంలో స్నానాలు చేస్తారు. అక్కడ ధర్మరాజు సూర్యలోకాన్ని ఇంద్రలో కాన్ని చూడగలుగుతాడు. ఇంద్ర లోకంలో ఇంద్రుడి దగ్గరున్న తన తమ్ము డైన అర్జునుడిని గాండీవంతోసహా చూడగలుగుతాడు. ఇలా వెళ్తూ కథలను చెప్పుకొంటూ ఉంటారు.

## 7. శిబి చరిత్ర

భృగుతుంగమనే పర్వతం దగ్గిర శిబియజ్ఞం చేశాడు. అలా చేస్తే ఇంద్ర పదవి అతడికి దక్కుతుందేమోనని భయపడి ఇంద్రుడు అగ్నితోసహా శ్యేన ముగా కపోతముగా వస్తాడు. గ్రద్ద తనను తరుముకొస్తుంటే కపోతం శిబిని శరణు పొందుతుంది. శ్యేనము 'అదినా ఆహారం. దానిని నాకు కాకుండా చేయటం పాప మనే వాదం లేవదీస్తుంది. అందుకు శిబి "నాశరణు జొచ్చిన ఈ కపోతాన్ని వదలనుగాని ఆమేర నా శరీరంనుంచి మాంసం

"ఇస్తానంటాడు. సరె ననుకొంటారు. కపోతం ఎంత బరువుందో అంత మాంసం కోయాలనే ఊహతో కపోతాన్ని త్రాసులో ఉంచి తన శరీరంలో నుంచి మాంసంకోసి రెండవ పళ్ళెంలో వేస్తుంటాడు. ఎంతవేసినా చాల లేదు. చివరకు తానే మొత్తంగా వెళ్ళి ఆ పళ్ళెంలో కూర్చుంటాడు. శిబి ఆచరణ వేదాంతి. ఇంద్రుడు ఆశ్చర్యపోయి తన నిజస్వరూపం చూపి వరాలు ఇచ్చి ఆశీర్వదించి అగ్నితోసహా వెళ్ళిపోతాడు.

## 8. అష్టావక్ర చరిత్ర

ఆ చోటనె ఉద్దాలక మహర్షి ఆశ్రమం. ఆయన కుమారుడు శ్వేతకేతూ ఆయన మేనల్లుడు అష్టావక్రుడూ అక్కడ ఉండేవాళ్ళు. అష్టావక్రుని తండ్రి ఏకపాదుడు. ఎప్పటినుంచో ఆయన శిష్యులకు వేదాలను సంత చెప్తూ ఉంటాడు. ఆయన భార్య గర్భవతి అయి ఉంది. ఆమె గర్భంలోనున్న అష్టావక్రుడు తండ్రినుద్దేశించి—ఇలా ఎంతో కాలం వేదాలు చదివించాలెనా? విశ్రాంతిలేక నీ శిష్యులు తప్పులుకూడ పలుకుతున్నారుకదా!" అంటాడు. అందుకు ఏకపాదుడు కోపించి స్వాధ్యాయానికి వ్యతిరేకంగా వక్రంగా మాట్లాడినావుగనక నీవు అష్ట వంకర్లతో పుట్టుతావని శపిస్తాడు. ఈయన ఆచరణ వేదాంతి అనాలా? శుష్క-వేదాంతి అనాలా? ఈ పుట్టబోయేవాడు అష్టావక్రుడైనా ఫరవాలేదనే తత్వం ఉందిగాక. కాని ఆవేశం కారణంగా ఈ ప్రవర్తన సరిగాలేదు అనిపిస్తుంది.

పురుడు వచ్చె రోజులు దగ్గరపడటంతోనే ఘృతం తైలం ధాన్యం ఇవి బాలెంత ఆరోగ్యం కాపాడటానికి కావలసి ఉంటవి గనక వాటిని ఎక్కడో అర్థించి తేవటం అప్పటి ఈ విప్రులకు అలవాటు. ఆప్రకారంగా ఏకపాదుడు జనకమహారాజు ఆస్థానానికి వెళ్తాడు అక్కడ వరుణుడి పుత్రుడైన నంది తటస్థపడినవాడై వేదాంత విషయాలపై వీనితో వాదించి ఓడించి తీసికొని పోయి ఎక్కడో నీటిక్రింద ఖైదుచేసి ఉంచుతాడు. ఇక్కడ ఆయన భార్య అష్టావక్రుని ప్రసవిస్తుంది. అప్పుడె ఉద్దాలకుని భార్య శ్వేతకేతునికంటుంది. శ్వేతకేతు, అష్టావక్రునకు మేనమామ. ఇద్దరూ సమవయస్కులు. అక్కడ ఉద్దాలకుని శిక్షణలో పెరుగుతుంటారు. పండ్రెండేండ్లయిపోతుంది.

అప్పుడు తన తండ్రి జనకమహారాజు ఆస్థానానికిపోయి తిరిగిరాలేదన్న సంగతి అష్టావక్రుడెరిగినవాడై తానే వెళ్ళాడక్కడకు. అక్కడి దౌవారికుడు ఇతడిని లోపలకు పోనీయడు. ఎందువల్లనని అడుగగా మహా విద్వాంసులనే పంపుతాను– నీవు చిన్నపిల్లవాడవు అందుచేత పోనీయనంటాడు. చిన్నవాళ్ళు విద్వాంసులు కారని నీవెలా చెపుతావు మహా విద్వాంసులుంటే వారితోనే వాదించేయగలను నే"నంటాడు అష్టావక్రుడు. అప్పుడా దౌవారికుడు జనకునకు ఆ వార్త చెప్పి, ఇతడ్ని అక్కడకు చేర్చుతాడు.

జనకుడు ప్రశ్నలు వేసాడు అష్టావక్రుని. అన్నింటికీ ఆయన సమాధానం నిశితంగా చెప్తాడు. అంతట సభలోనున్న వందికూడా ప్రశ్నలు వేస్తాడు. వివాదం అవుతుంది. అందులో వంది చిత్తుగా ఓడిపోతాడు. అతడికి గర్వ భంగమవుతుంది. అప్పుడు వంది చెరపట్టి నీటిలో ఉంచిన అందరు బ్రాహ్మణులనూ ఏకపాదునిసహా వదలింపజేయటం అవుతుంది.

అష్టావక్రుడు అలా తండ్రిని చెరవిడిపించి ఇంటికితెచ్చి తల్లికి చూపుతాడు. ఇదీ అష్టావక్రుని కథ. గ్రహింపు అనేది తల్లిగర్భంలో ఉండగానే కలుగుతుంది. మనుష్యులలోననే భావం.

ఇలా చెప్పుకొంటూ ఇతర ఆశ్రమాలు గడచి రైభ్యాశ్రమం భరద్వాజాశ్రమం చేరుతారు ధర్మరాజాదులు.

## 9. అవక్రీత చరిత్ర

భరద్వాజుడూ రైభ్యుడూ సుహృదులు, భరద్వాజుని కుమారుడు అవక్రీతుడు. రైభ్యుని కుమారులు అర్వావసు, పరావసు అనేవాళ్ళు. అర్వావసు పరావసులు అధ్యయనంచేసి గురుముఖంగా విద్యావంతులవుతున్నారు. అవక్రీతుడు తపస్సుచేసి విద్యను సంపాదించగలననే విశ్వాసంతో తపస్సు చేస్తున్నాడు. ఇంద్రుడు వచ్చి అవక్రీతుని కలిసి, గురుముఖంగా విద్యను పొందక ఇలా తపోబలంచేత విద్యను పొందెనట్లయితె, ఎలాంటి సాధకులకయినా. ఆ తపస్సు మదాన్నీ, మాత్సర్యాన్నీ మాత్రం వృద్ధి చేస్తుంది నాయనా! అని చెప్తాడు. అయినా అవక్రీతుడు తన ప్రయత్నం మానలేదు. చివరకు అవక్రీ

తుడు తన ప్రయత్నం మానలేదు. చివరకు అవక్రీతునకు విద్యను ప్రసాదిస్తాడు ఇంద్రుడె.

అవక్రీతుడు తండ్రిదగ్గరకు వెళ్ళి తానీవిధంగా విద్యలను సంపాదించానని చెప్తాడు. తండ్రి విద్యకు సంతోషించినా వానిగర్వానికి సహింపక ఒక కథ చెప్తాడు. బాలధి అనె ముని, పుత్రుల్ని కోల్పోయినవాడై చివరకు తపస్సుచేసి, చిరంజీవి అయిన కుమారుని పొందుతాడు. ఆ కుమారుని పేరు మేధావి. ఆమేధావికి తపోబలంవల్ల తాను చిరంజీవి అనే సంగతి తెలియడం వల్ల అతడు మహా గర్వి అయిపోయి, ధనుషాక్షుడనే తపోధనుడి ఎదుట గర్వించి ప్రవర్తిస్తాడు. ఆ తపస్వి అందుకు అల్గి అతడ్ని చంపేస్తాడు. గర్వం అందుచేత మంచిదికా"దంటాడు. ఈ కథ చెప్పి ఆరైభ్య పుత్రులతో మత్సరింపకుండ ఉండవలసింది అని అవక్రీతునకు బోధ చేస్తాడు భరద్వాజుడు:

ఆతరువాత కొన్నాళ్ళకు అవక్రీతుడు రైభ్యాశ్రమానికి వెళ్ళి వారితోటలో పరావసు భార్యనుచూచి ఆమెవెంట పడుతాడు. ఆమె ఇతడి శాపానికి భయపడినదై అంగీకరించినట్లై ప్రవర్తించి, చివరకు వెళ్ళి తన మామగారితో ఈతడి ప్రవర్తన సంగతి చెప్పేస్తుంది. రైభ్యునకు కోపం వస్తుంది. కర్తవ్యం స్ఫురిస్తుంది. తన జుట్టులోని ఒక జట తీసి హోమం చేస్తాడు. అందులోంచి తనకోడలికంటె అందమయిన స్త్రీ పుట్టుతుంది. అంతేగాక వంకరదంతాలతోనూ శూలంతోనూ సహా ఒక రాక్షసుడు పుట్టుతాడు. అప్పుడా రైభ్యుడు వారిద్దరినీ వెళ్ళి అవక్రీతుని చంపెయ్యమంటాడు.

ఆపిల్ల ముందుగా వెళ్ళి అవక్రీతుడి చిత్తాన్ని వికృతిగాచేసి అతడివద్దనున్న కమండలువును తీసికొని పారిపోతుంది. అతడు పాత్రలేనివాడై అపాత్రుడై ఉంటాడు. అప్పుడారాక్షసుడు అవక్రీతుని సంహరింపబోతాడు. అవక్రీతుడేమీ చేయలేక, పారిపోతాడు—మహానదుల్లో దూకి దాగొందామంటె అవి ఇంకిపోయి ఇతడ్ని బయటకు తోపుతవి. చివరకు తండ్రి ఆరాధించే అగ్నిహోత్రంలోకి వెళ్ళబోతాడు. కాని రాక్షసుడు వెనుకనుండి వచ్చి శూలంతో పొడిచి చంపి ఆ పిల్లతోసహా వెళ్ళిపోతాడు.

భరద్వాజుడు వచ్చి, ఇది తెలిసి, పుత్రుని దహింపజేసి, దుఃఖాన్ని భరింపజాలక దేహత్యాగం చేస్తాడు.

ఇక అర్వావసు, పరావసులు బృహద్యుమ్నుడనే రాజుకు ఋత్విజులై యజ్ఞం చేయిస్తూ ఉంటారు. ఒకనాడు పరావసుడు రాత్రివేళ ఆశ్రమానికి వెళ్తూ ఎదురుకుండా ఏదో మృగం వస్తున్నదనుకొని దానిని చంపేస్తాడు. కాని అది తన తండ్రి రైభ్యుడేనని తరువాతగాని తెలియలేదు. తరువాత ప్రేతకార్యాన్నిదీర్చి సోదరుని పిలుపనంపి పితృవధసంగతి చెప్తాడు. ఇద్దరూ దుఃఖిస్తారు. తర్వాత పరావసుడు తనకు బ్రహ్మహత్యాపాతకము వచ్చిందనీ, ప్రాయశ్చిత్త విధి చేయడం తనకై తాను చేయింపలేడు కనక, అగ్రజుడైన అర్వావసుడె ఆ పాతకాన్ని వహించి, ప్రాయశ్చిత్తవిధి పూర్తిచేసి రావలసిందని చెప్పి తానే యజ్ఞాన్ని పూర్తి చేయించడానికి వెళ్తానని అర్థిస్తాడు. అర్వావసు "సరె" నని వెళ్ళి ప్రాయశ్చిత్తవిధిని పూర్తిచేసి యజ్ఞ ప్రదేశానికి వస్తాడు.

అప్పుడు పరావసుడు ఆ బృహద్యుమ్నునితో "రాజా ఈతడు బ్రహ్మహత్యా పాతకుడు. ఈతడిని ఈ ప్రదేశానికి రానీయకు" మంటాడు. పరావసుడు బహుశ తన అన్నగారు ప్రాయశ్చిత్తవిధి సక్రమంగా చేయలేదనే శంకవల్లనో లేక తానొక్కడే ఋత్విజుడుగా ఈ యజ్ఞం చేయించిన ఘనతా దానివల్ల కలిగే లాభమూ పొందుదామనో, అలా అన్నాడు. కాని అర్వావసు మాత్రం, తాను బ్రహ్మహత్యా ప్రాయశ్చిత్త వ్రతాన్ని పరావసునకుగాను జరిపి వాని పాపాన్ని హరింపచేసిన మాట వాస్తవమని చెప్తాడు.

అలా చెప్పినందుకు దేవతలు మెచ్చుకొంటారు అర్వావసుని. ఆతడికి వరములిస్తాము అడుగవలసిందంటారు. అప్పుడు అర్వావసుడు ఏమడిగినాడనేది కథలో చెప్పుకోవచ్చు. అపక్రీతుడయితే ఏమడిగేవాడు. పరావసు అయితే ఏమడిగేవాడు అనేది చిత్రమైన ఆలోచనా విషయం. ఎవరి సంస్కారాలనుబట్టి వారు అడుగుతారు అనేది నిజం. అర్వావసుడు, రైభ్యుడూ, భరద్వాజుడుతో సహా అవక్రీతుడుకూడ బ్రతకాలని వరమడిగినాడు. అంతా అలాగే బ్రతికివస్తారు. అప్పుడు అవక్రీతుడు బ్రతికివచ్చి ఆ దేవతల్ని అడుగుతాడు. నేను రైభ్యునిచేత చంపబడ్డానుగదా నేనూ శాస్త్రాలను ఎరిగిన

వాదనుకదా! ఈ రైభ్యునకు ఇంతశక్తి ఎలా వచ్చింది అంటాడు. అందుకు దేవతలు,—

> సుపుత్రుండు యవక్రీతుఁ, బరమక్లేశమునఁజేసి వడసినవిద్యా
> స్ఫురితుఁ డగుఁగాక - గురుముఖ విరహితముగ బడసినవియు
> వెలయునె యెందున్

అని చెప్తారు. ఈ తండ్రి కొడుకుల కుటుంబంలోని వారి ఈ కథచిత్రమైన మనస్తత్వాలను ప్రదర్శిస్తున్నది. ఆ చరణ వేదాంతులెంతవరకయినారు? శుష్క-వేదాంతులెవరు? అనే విచారణం శ్రోతలూ పఠితులు ఎవరికివారు తమ తమ ధీవిశేషాన్నిబట్టి గ్రహించాల్సి ఉంటుందనిపిస్తుంది.

ఇలా చెప్పి రోమశుడు, కైలాసం వెళ్దాం. అది ఇక్కడకు ఆరువందల యోజనాల దూరంవుంది. పోవటం చాల కష్టం అంటాడు. ప్రయాణం సాగుతూనె ఉంటుంది.

## 10. ఉత్తరనగగమనం

ధర్మరాజాదులు తీర్థయాత్రలను రోమశుడనే మునితోపాటు చేస్తున్నారు. కైలాసం వెళ్ళాలి అనుకొన్నారు. కాని అక్కడకు ప్రయాణం చాల కష్టమనీ, ధర్మరాజూ నకులుడూ రోమశుడూ మాత్రం వెళ్ళవచ్చేటట్లూ భీముడు, సహదేవుడూ ద్రౌపది అంతా ఉండిపోయేటట్లు మొదట ఉపపాదిస్తాడు ధర్మరాజు. కాని భీముడు ఒప్పుకోలేదు. కావాలంటే చిన్నవాళ్ళ నందర్నీ తాను ఎత్తుకొని కొండ నెక్కుతానన్నాడు. ఆ కారణంచేత రథాలూ గుఱ్ఱాలూ అన్నీ సుబాహువనే వాని రాజ్యంలో పుళిందుల అధిపతియైన సుబాహు వద్ద నుంచి బయలుదేరుతారు.

వీళ్ళిలా వెళ్తూ గంధమాదన పర్వతం వెళ్ళేసరికి పెద్ద సుడిగాలి వస్తుంది. చెట్లన్నీ పడిపోతుంటాయి దుమ్ము లేగుతుంది. ఒకళ్ళకొకళ్ళు కనుపడరు. అంతా విడిపోతారు. పెద్ద వర్షం కురిసి వెలిసింతర్వాత కొంతసేపటికిగాని మళ్ళీ కలిసికోలేరు. గంధమాదనమంటె మనసులోని వాసనల నాశం అని అర్థం. వీరక్కడకు వెళ్ళిన మీదట ధర్మరాజుకు తామిలా విడిపోవటంతో

ప్రక్క ప్రక్కల నున్నవారం క్షణంలో ఎవరికి వారం బ్రతుకులు చూచు కొన్నాం : ఏది ఎవరు శాశ్వతం : అర్జునుడు ఎక్కడో ఉన్నాడుగదా అని అంతకుముందె తానను కొనటం ఎంత వెర్రితనం అనుకొన్నాడు.

మళ్ళి ఆ కొండ ప్రదేశం ఎక్కుతూ ఉంటారు. ద్రౌపది ఇక నడపలేక కూలబడుతుంది. అప్పుడు భీముడు అన్నగార్ని సంప్రదించి ఘటోత్కచుణ్ణి తలుస్తాడు. అతడు మాయావి గనుక ఎక్కణ్ణుంచో వన పరిచరులతో సహా వస్తాడు. భీముడు అతణ్ణి పిల్చి ద్రౌపదిని ఎత్తుకుని కొండ నెక్కమంటాడు. కాని ఘటోత్కచుడు పాండవుల్నీ ద్రౌపదినీ కూడ తానెత్తుకొని వెంటనున్న బ్రాహ్మణులనందరనూ తన అనుచరు లెత్తుకొని కొండ ఎక్కే ఏర్పాటు చేస్తాడు. దైవబలం కలవారికి ఇలా దైవం తోడవుతుంది. రోమశుడు సిద్ధుడు కనుక ఆకాశంలో ఎగిరి వెళ్తుంటాడు. అలా వారంతా నరనారాయణా శ్రమం చేరుతారు. గంగలో స్నానం చేస్తారు. బదరీ వనంలో ఆరు రోజు లుంటారు. అరిషడ్వర్గాలను అదుపులో పెట్టారని అర్థం.

## 11. సౌగంధికాప హరణం

ఒక నాడు భీముడూ ద్రౌపదీ విహరిస్తుండగా ఒక పెద్ద పుష్పం వేయి రేకులు కలిగింది చల్లని గాలితో ఎగిరి వచ్చి పడింది. ద్రౌపది ముచ్చట పడి ఇలాంటివి చాలా కావాలి అనుకొంది. ఆపూవును ఇద్దరూ తీసికొనిపోయి ధర్మరాజు కిస్తారు. ఆ తరువాత భీముడు ధర్మరాజుకు చెప్పకుండానే ఈశాన్య దిక్కునకు ప్రయాణమై ఒంటరిగా వెళ్ళి పోతాడు అలాంటి పూవుల కోసం.

అదంతా కీకారణ్యం. చెట్లు పడేస్తూ,తీగలు తెంపివేస్తూ దోవచేసికొంటూ పోతున్నాడు భీముడు. సింహాలను సింహాలతోనూ, ఏనుగులను ఏనుగుల తోను కొట్టి మగతా వాటిని త్రోపి పడేస్తూ వెళ్తున్నాడు. శంఖం పూరిస్తు న్నాడు. అది చాలా భయంకరంగా వినిపిస్తోంది.

అక్కడ హనుమంతుడు విశ్రమించి ఇది విని భీముని శంఖారావమేనని తెలిసికొంటాడు. అతణ్ని పలుకరించాలని దోవకు తోకను అడ్డంగా పెంచి నిద్ర నటిస్తూ పడి ఉంటాడు. భీముడు ఈ కోతిగా నున్న ఆకారాన్ని భయ

పెట్టాలని అనిస్తాడు. అందుకు హనుమంతుడు ఇలా మాట్లాడుతాడు భీమునితో :—

"నాయనా ! నేను ముసలిని ! జంతువులకు ధర్మాలు తెలీవుగాక. నీవు మనుష్యుడవు ! సర్వ భూతదయ మనుష్యుల సామాన్య ధర్మం. వృద్ధుడనైన నన్ను గద్దరిస్తావేం ? ఇటు ప్రక్కకు సిద్ధులేగాని ఇంకెవరూ వెళ్ళటం కుదరదు. ఆ పండ్లు కోసుకు తిని తిరిగి వెళ్ళిపో. మిత్రుడుగానే చెప్తున్నాను" – అంటాడు. భీముడు ఆ పుష్పాల కోసం వెళుతున్నాననీ దోవ యివ్వకపోతే పూర్వం హనుమంతుడు సముద్రం దాటి దూకి వెళ్ళినట్లు ఈ కొండనూ, నిన్నూ దాటి వెళ్ళిపోతాననీ అంటాడు. ఆ ప్పుడు హనుమంతుడు "అదేమిటి ? అలా ఎందుకు ఎగిరి వెళ్లాడూ" అని అడిగి భీమునిచేత రామాయణ కథను చెప్పిస్తాడు. భీముడు తానూ హనుమంతుడంతటి పరాక్రమం కలవాడ్నే నంటాడు. అందుకు హనుమంతుడు 'నేను ముసలివాణ్ణీ లేవ లేను గాని నా తోకను కొంచెం ప్రక్కకు తొలిగించి వెళ్ళిపొ'మంటాడు. భీముడు రెండు చేతులా ప్రయత్నిస్తాడు లేవలేకపోతాడు ముందుకు పడుతాడు. వెంటనే గర్వం వదిలి రెండు చేతులూ కలిపి నమస్కరిస్తాడు. "అయ్యా నువ్వు గంధర్వుడవో, సిద్ధుడవో, దేవవరుడవో ఎవరో అయియుండాలి, అనుగ్రహించి చెప్పాల్సింది" అంటాడు.

అప్పుడు హనుమంతుడు తాను ఫలానా అని చెప్పి 'రామచంద్రమూర్తిని తలచిన వారంతా హనుమంతుని తలుస్తారని రామచంద్రమూర్తి నాతో అన్నాడు. అందుకని ఆయన్ను ముందుగా నీ చేత తలపింప జేశాను–ఆ కథ నడిగి,–అంటాడు. భీముడు మళ్ళీ నమస్కారం చేసి, తనకు హనుమంతుడు సముద్రం దాటినప్పటి రూపం చూపాల్సిందని కోరుతాడు. అందుకు "ఆ రూపం ఇప్పుడు చూపటం ఎందుకు అప్పటి కాలం వేరు, ఆ కొలతలు వేరు. అప్పటి చరాచర భూతాలు వేరు. పెద్ద ఆకృతులను కలిగి ఉండేవిగాని ఇప్పటి ఆకృతు లుండేవి కాదప్పుడు" అంటాడు హనుమంతుడు.

భీము డంతట "యుగాలెన్నో గనక, నాకు నీవు ఆ యుగాల్లోని ఆ చార భూచార వర్తమానాలు తెలియజెప్ప వలసింది" అని అడుగుతాడు.

అందుకు హనుమంతుడు చెప్పిన మాటలు ఎంతో తెలియ తగినవి, స్మరించ తగినవి :—

"కృతము కాని కర్తవ్యంబు కృత యుగంబు నందు లేదు" అంటూ మొదలు పెట్టాడు. కృత యుగంలో ప్రతి ఒక్కడూ తన కర్తవ్యాన్ని చేసే వాడేనట. చేయని వాడు లేనేలేడని ధ్వని. కర్తవ్యం అనే దల్లా చేయబడు టూనే ఉండేదని చెప్పటం. "చతుష్పాద మగుచు ధర్మ మనఘ ! నర్తిల్లు" నన్నాడు. ఎవరి కర్తవ్యం వారు చేయటమే సాధన. అది అంతా చేస్తే ధర్మం నాల్గు పాదాలా నడిచి నట్లేనట. ఈశ్వరుడు తెల్లనివాడై అందరనూ రక్షిస్తూ ఉంచే వాడట. సనాతన ధర్మమే అక్కడ నాథుడు. ప్రజలందరకూ ఒకే ఒక వేదం ఉండేది. అది చెప్పిన విధంగా బ్రహ్మ-క్షత్రియ-వైశ్య శూద్రులు నడుచుకొనేవారు. ఇది కర్తవ్యం కనుకనే చేస్తాను అనే దృష్టితో పనులు చేసేవారు. అందువల్ల వారు "అకామ ఫల సంయోగము" నందు కొన్నారట. అంటే కోరకుండానే ఫలం కలిగేదని అర్థము. ఆ ఫలం ఏమి టట ? అంటే పుణ్య లోకాలు కలగటం. అప్పుడు, అసూయా నిహార దర్ప, పైశున, విగ్రహ, క్రోధ మద మత్సర భయ సంతాప వ్యాధి ప్రజా క్షయ, ఇంద్రియ క్షయాలు లేవట ! ఇది కృతయుగ విషయం.

ఇలాంటి స్థితి ఉంటుందని కనీసం నమ్మే వాడైనా ఇప్పుడున్నాగా ఈ యుగంలోననే సందేహం కలుగుతుంది మనకు.

త్రేతా యుగంలో ధర్మం మూడు పాదాల మేర వర్తిల్లుతుండేదిట. అంటే కర్తవ్యం చేయడానికి నాల్గోవంతువారికి కుదరలేదని స్థూలంగా అనుకోవచ్చు. జనులు నిత్య సత్య వ్రతులు యజ్ఞ తపోదానాది క్రియలు చేస్తూండే వారు. విష్ణుమూర్తి ఎఱ్ఱని రంగుతో ఉండేవాడుట.

ద్వాపరంలో రెండు పాదాల మేరనే అనగా సగభాగమే ధర్మం నడిచింది. వేదాలు నాలుగుగా విడగొట్టటమయింది. ధర్మం కామం కూడ ఉంటూ ఉం డింది. అది వేద శాస్త్రార్థాల చేత వేదక బడుతుంటుంది. జనులకు సత్యం గాని, శమంగాని ఉండటం అరుదు. కామ కాములై మాత్రమే బహు క్రతు వులు చేస్తారు. ప్రభువు నల్లనివాడై జగాలను రక్షిస్తుంటాడు.

ఇక కలియుగంలో ధర్మం బలం తగ్గిపోతుంది ఒక్కనాల్గోవంతుమేర మాత్రమే ధర్మంమనుతుంది. కృష్ణుడు భయంకరమైన రంగుతో ఉండి జగత్తును రక్షిస్తూ ఉంటాడు. జనులు తమోగుణ యుక్తులవుతారు. కామక్రోధాది దోషాలవల్ల ధర్మం తెలియనివారై అధర్మ వర్తనులవుతారు. అప్పుడు చేసే తపోదానాది కర్మలు కొద్దిపాటివై అయినా బహుఫలాలనిస్తవి. ఇదీ యుగప్రకార విషయం అని హనుమ భీమునకు చెప్తాడు.

ఈశ్వరుడు తెల్లనివాడై ఎఱ్ఱనివాడై నల్లనివాడై లేదా పీతవర్ణుడై ఉండి ప్రజలను రక్షిస్తాడంటే ఏమని అర్థం? ఈశ్వరుడు అనేవాడు ఒక మనిషిలాటి వాడనుకోవద్దు. భగవంతుడనేది ఒకానొక (Concept) భావం. ప్రజలు రక్షింపబడుతున్నారనీ అతడు రక్షిస్తున్నాడనీ అనటం దృష్ట్యా. కృత యుగంలో కేవలం సత్త్వగుణంవల్ల ప్రజలు రక్షింపబడ్డారనీ. త్రేతాయుగంలో రజోగుణ ప్రకోపం ఉండి దాని ద్వారా రక్షింపబడ్డారనీ, ద్వాపరయుగంలో తమోగుణం (నలుపు) వల్ల ఆవరింపబడుతూ రక్షింపబడ్డారనీ ఇక కలి యుగంలో ఈ మూడు గుణాలూకూడ సమమై ప్రజల మనసుల్ని నడుపుతున్నవనీ అర్థం. భగవంతుడంటె మనం ఇలా ఉండటానికయిన అమరిక (Mechanism) ఏదో అదేనని తెలియటం అవసరం. అందుకనే, గుణాలు ఏవైతె ఉన్నవో అవి ఆ భగవంతుని ఒక రకంగా వర్ణించటానికి ఉపయోగిస్తవని ధ్వని. మరి—భగవంతుడు అతీంద్రియ వాచకుడుకదా.

తరువాత భీముడు అడిగినమీదట హనుమ. త్రేతాయుగంనాటి కొలతలు గల రూపం చూపించటానికి శరీరం పెంచటం ఆరంభించాడు. కొద్దిసేపట్లో ఆకాశంలో ఎక్కడికో వెళ్ళిపోయింది హనుమతల. ఆయన ఆకారం భీమునికి భయం గొల్పింది. వెంటనే "చాలు చాలు మహానుభావా: ఇక పెంపవద్దు—నాకు తెలిసింది" అని ప్రార్థిస్తాడు. హనుమ శాంతిస్తాడు.

సౌగంధిక సరోవరానికి వెళుతున్నట్లున్నావు అక్కడ యక్షరాక్షసులుంటారు. నీవు సాహసం చేయకుసుమా అనీ ఆ సరోవరం దేవతల భోగం కోసం ఉండినట్టిది. దేవతలు ఎలా సాధ్యులవుతారంటే-బలి, హోమం. నమస్కారం మంత్ర తంత్రాలద్వారా సాధ్యులవుతారు. అంతేగాని సాహసం ద్వారా కాదుసుమా: నీవు నీధర్మం చేస్తూనె పర ధర్మంకూడ తెలుసుకొనవల

సించి. బుద్ధిలేనివాళ్ళు "వాళ్ళు అలాగెందుకుండాలి నేనిలా ఎందుకుండాలని విమోహితులవుతారు. నీవు ఈ ధర్మాత్మ ధర్మ విభాగమెరిగిన విద్వాంసుల నుపాశించి శుభాచారుడవు కావాల్సింది. అలా ఆ ఆచారం పాటిస్తే ధర్మం చేస్తున్నవాడివవుతావు. ధర్మంవలన వేదప్రతిష్ఠ అవుతుంది. వేదాల వల్ల యజ్ఞం ప్రవర్తిల్లుతుంది. అలాటి యజ్ఞంవల్ల దేవతలు తృప్తులవుతారు" అంటాడు. దేవతలంటె మంచిమనసు. యజ్ఞమంటె సర్వభూతాల శ్రేయస్సు కోరటమూ అలా ప్రవర్తించడమె వేదం చెప్పేది. అదె-వీటి సమన్వయం ఎవరి మెదడులో అవుతుందో అతడికె మోక్షం."

ఇలా చెప్తూనే దేశ కాలాలు గమనించి బుద్ధిమంతులు సాహసం వదలి వేసి, సామదాన భేదాలనే ఉపాయాలచేత కార్యసిద్ధిని పొందుతారు. సర్వకార్యాలూ మంత్ర మూలాలుకావటంచేత, విద్వాంసులూ ప్రబుద్ధులూ అయినవారితో మంత్రం చేయవలసింది అంటాడు. ఈ మంత్రం చేయు మంటే ఏమని అర్థం? వారితో కలిసి ఆలోచించి తెలిసి ప్రవర్తించుమని అర్థం. మంత్రార్థాలు మనకు తెలియకపోవటం అది ప్రారబ్ధం. దానిని తెలిసి మననం ధ్యానంచేస్తే మనమూ అంతో ఇంతో పెద్ద వస్తులకు శక్తులమై ఉంటామనిబోధ.

తరువాత హనుమ భీముని ఆశీర్వదించి కౌరవ పాండవ యుద్ధంలో నన్ను తల్చుకో నీకు క్షేమం కూరుస్తానని పంపుతాడు. ఆంజనేయ దర్శనంవల్ల అభయుడైన భీమునకు పరమాత్మ తత్త్వ బోధ అయింది.

భీముడు చివరకు వెళ్తాడు ఆ సరోవరానికి. కావలసినన్ని పూవులు కోసి కొని వస్తుంటాడు. అక్కడి రాక్షసులూ కాపరులూ వచ్చి అది కుబేరుడి అధీనమయిన సరమనీ అతడ్ని అడిగి అనుమతి పొంది వాటిని తీసికొని వెళ్ళమనీ చెప్తారు. భీముడు వినడు. వాళ్ళను చిదకకొట్టి పంపుతాడు. వాళ్ళు వెళ్ళి ఆ కుబేరుడుకి చెప్తారు. అందుకు కుబేరుడు పాండవుల్లోనివాడా! అయితె పోనీలె-తీసికొనిపోనిమ్మని వూరుకుంటాడు. పాండవులంటే వాళ్ళకు కూడ అంత గౌరవము. మనకు వారి మాత్రమైనా మనకుంతి పాండవులపై గౌరవం లేకపోవటం తత్వమెంతో తెలుపుతుంది.

ఇక్కడ ఇలా ఉంటే భీముడు సమయానికి రాలేదని ధర్మరాజాదులు కంగారు పడతారు. చివరకు ద్రౌపది చెప్తుంది తాను సహస్ర పత్ర కుసుమాలు ఎక్కడుంటయ్యో తెచ్చిపెట్టుమని అడిగితే అందుకు వెళ్ళాడని. అయ్యో! అయ్యో! అని ధర్మరాజు వెంటనే ఘటోత్కచునీ, వాని సిబ్బందినీ పిల్చి హుటాహుటి ఆ సౌగంధికా సరస్సుకు పదమంటాడు. అంతా అక్కడకు చేరుతారు. భీముడువచ్చి వీరికి నమస్కరిస్తాడు. ధర్మరాజు భీముని అలా ఎందుకు సాహసించి ఒంటరిగా వచ్చావని మందలించి నామాటమీద గౌరవముంటే ఇక నలాంటి పనులు చేయకుమంటాడు. అక్కడి యక్షులువచ్చి ధర్మరాజాదులను గౌరవిస్తారు.

## 12. జటాసుర వధ

అక్కడ రాక్షసు లుంటారుగనక అక్కడినుంచి వెళ్ళిపోవలసిందని ధర్మరాజుకు యక్షులు సలహాఇస్తారు. కాని వెళ్దామనుకొంటూనే ఉంటారు కొన్నాళ్ళు. ఘటోత్కచుడూ వాని సిబ్బందీ మాత్రం వెళ్ళిపోయినారు. కాని ఇంతలో జటాసురుడనే రాక్షసుడు వచ్చి తాను బ్రాహ్మణుడని చెప్పుకొని వీరిలో చేరుతాడు. తీరా భీముడొకసారిలేని సమయం చూసుకొని ధర్మరాజునూ, ద్రౌపదినీ నకులుడ్నీ ఎత్తుకొని ఎగిరిపోతుంటాడు. సహదేవుడు వెంటబడుతూ భీమన్నా! అని పిలుస్తుంటాడు.

ధర్మరాజు అలా తీసికొనిపోబడుతూ కూడ ఆ జటాసురుణ్ణి అడుగుతాడు "ఎంతనికృష్టుడైనా తిన్న ఇంటి వాసాలు లెక్కపెట్టడే! నీవు బ్రాహ్మణుడుగా వచ్చి మా ఇంట్లో తిని ఈపని చేస్తున్నావేమిటి చివరకు మా ఆయుధాలు మాకిచ్చి మాతో పోట్లాడి జయించు అదీ మగసిరి లక్షణం" అంటూ కాలితో నొక్కుతాడు జటాసురుణ్ణి. అతడి వేగం తగ్గిపోతుంది. ఇంతలో సహదేవుడువచ్చి కలుస్తాడు. భీముడూ వస్తాడు. అంతా కలిసి బ్రహ్మాండంగా యుద్ధం చేద్దామనుకుంటే వీరందర్నీ ఉండుమని తొలగించి భీముడొక్కడే యుద్ధంచేసి బకాసుర హిడింబాసురుల్ని వధించిన విధంగా జటాసురుడ్ని కూడ చంపేస్తాడు.

జటాసుర వధలో త్రిపుటీ సాధనలో వచ్చే చిక్కుల్ని సూచించాడు వ్యాస మహర్షి. సాధనలో అనేక విఘ్నాలు వస్తవి. ఆవిఘ్నస్వరూపుడె జటాసురుడు. అలాటి విఘ్నాలకు భయపడరాదని చెప్పటం ఇక్కడి బోధ. భీముడు అభయ వృత్తికి ప్రతీక. అతడు లేనపుడే ఈ జటాసురుడు మోసం చేయటానికి ఆరంభించింది. ద్రౌపదిని, ధర్మరాజునూ నకులుడ్నీ ఎత్తుకు పోతాడు. ద్రౌపది ముక్తికామనకు ధర్మరాజు అష్టాంగయోగ సాధనకు నకులుడు ఐహిక భోగ విరాగానికి ప్రతీకలని పూర్వమె చెప్పుకొన్నాం ఆది పర్వంలో. అభయవృత్తి కూడఉంటే ఈ విఘ్నం వచ్చేదికాదు. భీముడు లేకపోవటం అభయం లేకపోవటాన్ని సూచిస్తున్నది. అలాటప్పుడేం చేయాలనేది మోక్ష సాధకులకు సూచన: ధర్మరాజు తన బరువును పెంచి బొటన వ్రేలితో జటాసురుడ్ణి నొక్కినాడంటే తన సాత్త్విక వృత్తిని ఉధృతం చేయడమె ఇక్కడి మార్గమని బోధ. దానివల్ల విఘ్న ప్రాబల్యం నశిస్తుంది. కాని అభయంవల్లనే ఆ విఘ్నం పూర్తిగా పోవాలిగాక; భీముడు రావాలి. అందుకు జ్ఞాన ప్రకాశానికి ప్రతీక అయిన సహదేవుడు భీముడ్ని పిలిచాడనటం ముఖ్యం. జ్ఞాన విషయం విచారణచేసి అభయాన్ని పొందాలి అనేది ఇక్కడి మోక్షసాధనాత్మకమైన బోధ.

సౌగంధికాపహరణ కథలో వేయిరేకుల కమలం సహస్రార చక్రమనీ, కుండలిని అక్కడకు చేరడానికి కుంభకం (భీముడు) ఒక్కటేగాక పరమాత్మ (ఆంజనేయుని) అనుగ్రహం ఉండాలనీ అంటారు.

భీముని విజృంభణానికి ధౌమ్యాది ఋషులూ, ధర్మరాజాదులూ ఎంతో సంతోషిస్తారు. పాండవులు అలా ఆ హిమగిరి శిఖరం మీద పదిహేడు రోజులుంటారు విజయాత్ములై.

ఇది తృతీయాశ్వాసము



# మహాభారత కథలు

## (అరణ్య పర్వము-చతుర్థాశ్వాసము)

## 1. యక్ష యుద్ధం

గంధమాధన తీర్థం చూసుకొన్న తర్వాత ధర్మరాజాదులు ఇంకా ఉత్తరానికి మాల్యవంతానికి వెళ్తారు. ఇవన్నీ అరణ్యాలె. అక్కడ శ్వేతకి అనే నది ఉంది. అందులోని పుష్పాలో ఏమోనన్నట్లు గాలికి ఎగిరివచ్చి ఐదు రంగులతో మంచి సువాసన కలిగిన ఒక పుష్పం పడుతుంది వీరిముందు. వారు చాలా బాగున్నదని సంతోషిస్తారు.

ద్రౌపది మళ్ళీ భీముడ్ని ఏకాంతంగా కలిసి ఆ పుష్పాలు తనకు తెచ్చి పెట్టుమంటుంది. భీముడు ఎవరికీ చెప్పకుండా ఉత్తరానికి వెళ్ళతాడు. ఆ కొండకొమ్మ నెక్కుతాడు. అక్కడ వైశ్రవణుడి మేడ ఉంటుంది. అది చూసి శంఖంపూరిస్తాడు. అదివిని అక్కడ ఉండే రాక్షసులూ యక్షులూ వచ్చి భీమునితో యుద్ధం చేస్తారు. భీముడొక్కడూ వాళ్ళందరిని చిత్తుగా కొట్టుతాడు. వారి పాలకుడైన మణిమంతుడు తప్పనిసరిగా భీమునితో యుద్ధానికి వస్తాడు సింహంచేత ఎదుర్కొనబడిన మృగం గతిలేక ఎదురు తిరిగినట్లుగా వచ్చాడట.

ఇంతకూ అలా ఎందుకు రావలసి వచ్చిందంటే బహుశ తాను ఈ భీముని చేత చావవలసి ఉన్నదని అతడికి తెలీదు· అగస్త్యుని శాపం వున్నది మణి మంతుడికి— మనుజుడి చేతిలో చస్తావుగాక అని.

వచ్చి. చాలా గొప్పయుద్ధం చేస్తాడు. పైకి ఎగిరిపోబోతాడు. భీముడైతె తన గద విసరి వాణ్ణి కొట్టి చంపుతాడు. ఇలా మణిమంతుడు చనిపోయి నాడని కుబేరునికి కబురందుతుంది. అతడు ఆశ్చర్యపడిపోతాడు. మణి మంతుడ్ని చంపగలిగినంత బలశాలి ఈ భీముడని తెలిసి.

ఈలోగా భీముడ్ని వెతుక్కుంటూ ధర్మరాజూ నకులుడూ సహదేవుడూ యుద్ధంపూర్తి అయిన ఆచోటికి వస్తారు. అక్కడ ఈ భీముడు రణావశేషాల మధ్య ఉండి ఉంటాడు. ఈ సమయంలో కుబేరుడు వచ్చి ధర్మరాజాదుల చేత నమస్కృతుడై వారిని ఆశీర్వదిస్తాడు. అగస్త్య మహాముని మణిమం

తునికి ఎందుకు శాపమిచ్చిందీ చెప్తూ మణిమంతుడు చచ్చిన తరువాత తన పాపాలేమైనా ఉంటే అవికూడ నశిస్తాయని అగస్త్యుడు అన్నట్లు కుబేరుడు చెప్పి జరిగిన పనికి వగవడం కన్నా సంతోషించడమే చేస్తాడు. ఆ కథేమిటంటే—

కుబేరుడూ మణిమంతుడూ స్నేహితులు. వాళ్ళు ఆకాశమార్గాన వెళ్తూ ఉండగా క్రింద అగస్త్యుడు తపసు చేసికొంటూ ఉంటాడు. ఆ మణిమంతుడు తాంబూలం ఉమ్మివేస్తే అది అగస్త్యునిమీద పడటంచేత ఆయన వీరిద్దరికీ శాపంపెట్టి మళ్ళీ అనుగ్రహించాడు.

ఆ తరువాత కుబేరుడు పాండవులకు సలహా ఒకటి చెప్తాడు. లోకతంత్ర విధానాలు ఐదున్నాయి (1) ధృతి (2) దాక్షిణ్యము (3) ఉపదేశము (4) కాలము (5) పరాక్రమము. ఇవితెలిసి క్షత్రియుడు ప్రవర్తించినట్లయితే ధర్మవిదుడై ధరణీ చక్రాన్ని నిర్వక్రమంగా రక్షించకలుగుతాడు అని. ఈ విశేషాలనెఱుగకుండ సాహసంతో వృథారంభుడయినవానికి పాపమేవస్తుంది. ఈ సంగతిని వివరించి ఈ భీమునికి అది నచ్చచెప్పి రక్షించాల్సింది అని చెప్తాడు. ఇది అంతా మనకూ తెలియవలసినదీ ఆలోచించి విచారించి ఎరుగవలసినదీ ననిపిస్తుంది.

కుబేరుడు వెళ్ళిపోతూ అర్జునుడ్ని పంపుతాను ఇక్కడికి అందాకా ఫలాని వాష్టిషేణాశ్రమంలో ఉండవలసింది—అని సలహా ఇస్తాడు. అలాగె పాండవులు ఒక నెలరోజులా ఆశ్రమంలో ఉంటారు—మందరగిరి శృంగాన్నీ దాని చుట్టూ తిరిగే సూర్యచంద్రులూ నక్షత్రాలూ సప్తర్షుల్నూ అందరినీ చూస్తూ కాలం గడుపుతారు. ఆ తరువాత ఒకనాడు ఇంద్రుడి రథమెక్కి మాతలి సారథిగాఉండగా అర్జునుడు మహా దీప్తితో వచ్చి ధర్మ భీములకూ, బ్రాహ్మణులకూ నమస్కరిస్తాడు. తమ్ముళ్లను ఆదరిస్తాడు. మాతలిని అంతా పలుకరించి సన్మానించి పంపేస్తారు. అర్జునుడు ఆ రాత్రంతా తమ్ముళ్లతో మాట్లాడుతూ కాలం గడిపాడు.

తెల్లవారిందో లేదో ఇంద్రుడు పాండవులందర్నీ చూడాలని పెద్దవిమానంలో పరివారంతో సహా బయలుదేరి అక్కడకు వచ్చి అందర్నీ హితమధురవచనాలతో అభినందించాడు. అర్జునుని గురించి గొప్పగా చెప్పి దివ్యాస్త్ర నిపుణుడై

సాడనీ నివాత కవచులనే రాక్షసుల్ని సంహరించాడనీ తనకెంతో మేలు చేశాడనీ చెప్పి అందర్నీ దీవించి వెళ్ళిపోతాడు.

ధర్మరాజు ఇదంతా తలచుకొని తలచుకొని-మహా సంతోషంతో నీవు వెళ్ళిన దగ్గర్నుంచి ఎలా ఎలా ఆ అస్త్ర లాభాన్ని పొందావో చెప్పాల్సింది-దేవేంద్రునకే నీవు మేలు చేశావన్నాడు. అదెలా జరిగిందో ఆకథా విధానమంతా చెప్పాల్సిందంటాడు. అందుకు అర్జునుడు తాను బయలుదేరినప్పటి నుంచీ శివునితయి తపసు చేయటం పాశుపతం గ్రహించడం ఇతర దేవతలంతా తనకు శస్త్రాస్త్రాదులివ్వడం, తాను చివరకు ఇంద్రలోకంలో అమరావతికి వెళ్ళి ఉండటం-చెప్పి, అక్కడ ఇంద్రునే తన గురువుగా అంగీకరించి ఆయన అనుగ్రహంవల్ల దివ్యాస్త్రాల ప్రయోగం, ఉపసంహారం నివర్తనము ప్రాయశ్చిత్తము ప్రతిఘాతము ఇవన్నీ నేర్చుకొన్నట్లు చెప్తాడు.

ఆ తరువాతనె ఇంద్రుడు తనకు గురుదక్షిణగా-నివాతకవచులనే రాక్షసులు మూడు కోట్లమంది, సముద్రంలో దాక్కొని దేవతలకు అపకారం చేస్తున్నవారున్నారనీ వాళ్ళను చంపవలసిందనీ కోరినాడట.అలా అంటూ తన కిరీటం దివ్యభూషణాలూ అర్జునుడికిపెట్టి, స్పర్శ మాత్రమెగాని మిగతా రూపంలేని కవచం తొడిగి అర్జునుని పదివేల హయాలూ రథం మాతలితో సహా పంపుతాడు - యుద్ధానికి. ఆ రథాన్నెక్కి వృత్ర, శంబర, బలాది రాక్షసుల్ని ఇంద్రుడు జయించాడని దేవతలంతా ఆ రథపు చరిత్ర అర్జునునికి చెప్పారట. దేవదత్తమనే శంఖంకూడ ఇంద్రుడిచ్చాడు అర్జునునికి.

అప్పుడక్కడ సముద్రం దగ్గర తాను శంఖం ఊదినక్షణాన ఆ రాక్షసులు వెలుపడి వచ్చి రథాన్ని చుట్టు ముట్టారు. మాతలికే ఆరథాన్నెలా నడపాలో తికమక అయిపోయింది, అప్పుడు అర్జునుడు తానే రథం నడుపుతూ యుద్ధం చేస్తాడు. మాతలి చాల సంతోషిస్తాడు. ఆ తరువాతి యుద్ధం ఎంతో పంతంతోనడుస్తుంది. నన్నయ్య పది పద్యాలు చాల రమ్యంగా వ్రాసి వర్ణించాడు. అది చదివి ఆనంధించవలసిందె. చివరకు నివాతకవచులు చస్తారు. వారి పుర్ణం సముద్రంల్లోనుంచి లేచి ఆకాశానికి ఎగురుతుంటే తమ మగవారు చనిపోయారని ఆ స్త్రీలు ఏడుస్తుంటారు. అప్పుడు అర్జునుడికి ఆ నగరం ఇంద్ర నగరంకంటె ఎంతో అందమైనదని తెలుస్తుంది. అందుకని మాతలినె అడుగుతాడు——

రత్నాల ఇండ్లతో చక్కని పురం ఉండికదా ఇక్కడ ఉండక, ఇంద్రుడు ఆ అలకాపురిలో ఉన్నాడేమ అని. అందుకు మాతలి, "ఈ పురం నిజానికి ఇంద్రుని చేతనే నిర్మింపబడింది. రాక్షసుల భయంవల్ల ఈ సముద్రంలో పురం కట్టించి ఉంటాడు ఇంద్రుడు. కాని బ్రహ్మచేత వరాలు పొందిన రాక్షసులు దీని నాక్రమించి ఇంద్రుణ్ణి గెలుస్తున్నారు. వీళ్ళకిచ్చిన వరము, అమరులచేత ఓడింపబడరనె : ఆ కారణంచేతనే ఇంద్రుడు మనుష్యుడవైన నీచేత వీరిని ఓడింపించి చంపించాడు" అన్నాడు. ఆ శాపంవల్లనే వారు శాపదం నరుడవైన నీకు పుణ్యము చేసిన కారణంవల్ల అనంతమైన కీర్తి కలగటం కూడాను అన్నాడు.

తీరా నివాతకవచుల్ని చంపి తిరిగి వస్తూవుంటే ఒక తపోవనం అతి విచిత్రమైన పురం కన్పడిందిట. అర్జునుడు ఇదెవరి పురం అని అడుగు తాడు. అందుకు మాతలి, పులోమ అనీ కాలక అనీ ఇద్దరు రాక్షస స్త్రీలు తపస్సు చేసి, బ్రహ్మచేత వరం పొంది ఈ పురాన్ని పొందుతారు. పైగా తమ సుతులు దేవతలవల్ల చనిపోరాదని కూడ వరం పొందారు. ఈ పురాలు వాళ్ళవి అంటాడు.

ఐతే పోనీ వాళ్ళనూ నేనే చంపుతాను అని యుద్ధానికి వెళ్ళి పెద్ద యుద్ధం చేస్తాడు అర్జునుడు. చివరకు వాళ్ళమీద పాశుపతాస్త్రం ఉపయోగిస్తేనే గాని వాళ్ళు చావలేదు.

ఇదంతా విన్న ఇంద్రుని సంతోషానికి హద్దు లేకపోయింది. శత్రువులు నశించటం ఒకటి – తన కుమారుడు గెలవటం ఇంకా గొప్పది. తాను చెప్ప కుండానే పోయి పౌలోమ కాలకేయుల్ని చంపటంతో ద్విగుణీకృతమైన సంతోషం పొందినాడు.

దేవతలు చంపలేక పోవటమేమిటి ? మనుష్యులు చంపడమేమిటి ? అని స్థూలంగా అనిపిస్తుంది. దేవతలు మంచి మనసులు కలవారు, వీరు తెలివి తేటలు, మనోబలం ఉధృతంగా కలవారు, మనః ప్రధానులు. రాక్షసులు శరీర ప్రధానులు, క్రూరత్వ ప్రధానులు. మరి మనుష్యులకు ఈ రెండూ ఉంటున్నాయి. వాళ్ళ ఏకాగ్రతవల్ల మనోబుద్ధుల్ని అతీంద్రియ విషయాల పైకి పంపి ఒకొక్కప్పుడు దేవతల కంటే మిన్న కావటానికీ – లేదా శరీర

కంగా ఉధృతిని పొందిన వారై భీమునిలా, అర్జునునిలా రాక్షసుల కంటే బండగా తయారు కావటానికీ అవకాశం ఉన్నవారు. ఎవరు ఏ పని చేస్తే ఆ పనిలోనే వారు గొప్ప అంటాము. "ఎద్దులా ఉన్నావు తేలు మంత్ర మెరుగవా" అని ఒక తెలుగు సామెత ఉంది. ఎవరి చాకచక్యం వారిది. ఈ దృష్ట్యా – దేవతలచే కాని పని అర్జునుడిచే అవడం, లేదా మణిమంతుడి విషయంలోలా భీమునిచే అవడం ఇవి విపరీతాలేమీ కావు.

అలా నివాత కవచుల సంగరం సంగతి అర్జునుడు చెప్తే విని ధర్మ రాజాదులు చాల సంతోషిస్తారు. అర్జునుడు తాను సంపాదించిన శస్త్రాలు, అస్త్రాలూ సోదరులకు చూపుతాడుకొన్ని. ఆ సమయంలో నారదుడు వచ్చి అవి నిరర్థకంగా ప్రయోగింప కయ్యా: త్రిలోకాలు తగలబడి పోతాయి అని వారిస్తాడు.

ఆ తరువాత కొండలు వదిలి క్రిందికి ఘటోత్కచుడి సహాయంతో అతడి అనుచరుల సహాయంతో దిగుతారు. తమ రథాలను సుబాహుపురంలో ఉంచిన వాటిని తిరిగి పుచ్చుకొని ఘటోత్కచుణ్ణి పంపేసి ఒక సంవత్సరం హిమ వత్పర్వత ప్రాంతంలో ఉంటారు పాండవులు.

## 2. అజగరోపాఖ్యానము

హిమవత్పర్వత ప్రాంతంలో పాండవులు అరణ్యవాసం చేస్తున్న సమ యంలో ఒకసారి భీముడు ఒంటరిగా వేటకని వెళ్తాడు. అక్కడ హఠాత్తుగా ఒక పాము నోట్లో చిక్కుకొంటాడు. ఆ పాము చాల పెద్దది. పెద్దనోరుతో అది వేట శ్రమవల్ల విశ్రమిస్తున్న భీముడ్ని అమాంతంగా నోట కరచుకొని తోకతో చేతుల్ని శరీరాన్ని బిగించివేస్తుంది.

భీముడు తానే తప్పించుకోలేకపోయినందుకు ఆశ్చర్య పడిపోయినాడు. కేవలం ఒక పాముని తాను నిర్జించలేక పోవటం అతడికెలాంటి మనః స్థితిని కలిగిస్తుందో దురూహ్యం.

ఆ స్థితిలో భీముడి మనోసాహసం కూడ అడుగంటి పోతుంది. తనకు మించిన శారీరక బలం కలిగిన రూపం చూసేటప్పటికి అది దేవుడో దేవతో

ఇంకా పైవాడోననిపిస్తుంది. ఎందువల్లనంటే 'తాను' అనేది తనకు చాల గొప్పది. తను చూచే వాటన్నిటికంటె తను అనుభవించే వాటన్నిటి కంటె తన శరీరంకంటె, తన మనసుకంటె తన తెలివికంటె తాను గొప్ప అనే భావన ఉంటుంది ప్రతివారికీ. తాను ఈ మూడింటితో కలిసిన ఇంకేదో మరొకటి అనేది మనసులో మెదుల్తుంది కనక వీటన్నిటిలో దేని కంటె నైనా తాను గొప్ప అనే భావం రావటం విడ్డూరమేమీకాదు.

ఇప్పుడు తనకంటె భిన్నమని ఏ పామునయితె భీముడు చూస్తున్నాడో దానిచేత పట్టుబడి తనకు ఇంతరవకూ బాసటగా ఉన్న తనదనుకొన్న బలం ఉపయోగింపక, క్రొత్త అనుభూతిని కలిగించేటప్పటికి, తను ఈ మామూలు ప్రపంచంలోనివాడై యుండగా అది ప్రత్యేకంగా దేవలోకానికి చెందింది కాబోలు అనుకొంటున్నాడు భీముడు. అందుకని ఆ పామును ఆ మాట అడుగనే అడుగుతాడు– "నీకింత బలం ఎలా వచ్చిం"దని

అప్పుడా పాము మనుష్యవాక్కులతో చెప్పుతుంది. తనకాబలం వరం పొందటం వల్ల వచ్చింది. తాను క్రిందటి జన్మలో ఒక శాపం పొందటం వల్లనే తాను ఆవరం అడిగి పుచ్చుకోవలసి వచ్చింది. పూర్వజన్మలోనూ ఇప్పుడూ కూడ 'నేను' 'నేనూ' అనేది ఒకటేనా ? ఈ శరీరం మాత్రం ఇప్పుడు పాముగా ఉందన్నమాట. పూర్వ జన్మంలో 'నేను' అంటే ఎవరుట?

ఆ పాము చెప్తుంది. తాను ఒకప్పుడు ఇంద్రపదవి అనుభవించినవాడు ఆ సమయంలో బ్రాహ్మణులకు అవమానం చేసినవాడైన కారణాన శపించ బడ్డాడు. ఇలా పాముగా ఉండిపొమ్మని. వెంటనే తనకు తన తప్పు తెలిసి వారిని ప్రార్థిస్తె – సరె అలా పాముగా ఉన్నంత కాలం నీ ఎదుటకొచ్చిన వారి బలం నీ కంటె హీనమైపోతుందిగాక అని వరం ఇచ్చారు. అందు కని ఇంత సునాయాసంగా భీముని పట్టుకోకలిగాడు. అది అంటుంది– "కాని నాస్థితి ఇప్పుడెంత అధమానికొచ్చిందో తలుచుకొని దుఃఖపడు తున్నాను" అని.

ఇప్పుడు భీముడి స్థితికూడా అలా తగ్గిపోయి ఉన్నది. శరీర బలం ఉపయో గింపదు కనక కేవలం బుద్ధితో విమర్శ చేస్తున్నాడు. దుఃఖాలు ఇలాగే వస్తుంటవి. సుఖాలూ వస్తవి. వీటిని అనుభవించుటమె ప్రత్యుపాయం.

మనసు, బుద్ధిలను ఏకంగా నిశ్చలంగా ఉంచుకొంటె ఆ పరిస్థితులు కొంత కాలానికి మారవచ్చు. మారుతవి. వచ్చిన సుఖాన్ని దుఃఖాన్నికూడ, "అలా వచ్చినవి" అని గ్రహిస్తూ ఉండటమె బుద్ధీ మనసూలపని. ఇదే అప్పుడు చేయవలసిన పని అని, అదే ఆలోచన చేస్తూ ఊరుకుంటాడు భీముడు. సుఖ దుఃఖాల్లో మనంకూడ చేయవలసిన పని అదె. అదె సుఖదుఃఖాల్ని అనుభవించ కుండా వేరుగా ఉండే స్థితి అని గమనించాలి. మరి శరీరబాధ ఎలా? అంటె. శరీర బాధె వచ్చిన దుఃఖం. దాన్ని నేనూ నా మనసూ బుద్ధీలు అనుభవించ టల్లేదు. శరీరమె అనుభవిస్తోంది. ఇదీ విమర్శనా బుద్ధి.

చివరకు ఆ పాముతో భీముడు అంటాడు. "సరె నా శరీరం ఏదో అవుతుందిగాక దిగుల్లేదు. నాకోసం వెతికి కనపడక ఎంత ఎంత అవస్థలు పడతారో నా సోదరులయిన ధర్మరాజాదులు వాళ్ళు వచ్చేదాకా నాశరీరాన్ని మ్రింగి వేయకుండా ఉంటె నా సోదరులకు నా విషయం సమాచారమందు తుంది" అని.

అలాగే ధర్మరాజాదులు ఈ భీముణ్ని వెతుక్కొంటూ ఉంటారు. ధర్మ రాజు అక్కడకు రానేవస్తాడు. భీముడిలా ఒక పాము నోట్లో ఉండటం చూసి ఆ పామును అడుగుతాడు "అయ్యా! నీవు సర్పరూపం దాల్చిన దైత్యుడవో దేవతవో తెలీదు. నేను యుధిష్ఠిరుడను. నీకు మాంసభక్షణం అవసరమైన కారణాన ఇతణ్ని నీవు పట్టుకొని ఉన్నట్లయితె తగినంత మాంసం వేటాడి తెచ్చి ఇస్తాను. ఈతడు నా తమ్ముడు. వీనిని వదలిపెట్టవలసింది" అని. అప్పుడు మళ్ళీ ఆ పాము మనుష్య భాషణంద్వారా తన పూర్తికథ చెప్తుంది-

"నేను నహుషుడనే పూర్వరాజును, నీపూర్వీకులకు పూర్వీకుణ్ణి. ఇంద్ర పదవినధిష్ఠించినవాణ్ణి. కాని ఐశ్వర్య గర్వంచేత, వివేకం పోగొట్టుకొని బ్రాహ్మణులచే రథం మోయించి నడిపించాను. వారు నాకు శాపం ఇచ్చారు. శాప మోక్షణంకూడ చెప్పారుగాక ఎలాగంటే-నా ప్రశ్నలకు సమాధానం ఎవ్వరయినా చెప్పినట్లయితె అవి విని సంతుష్టుడ నయినప్పుడు ఈ పాము రూపం తొలగిపోతుందన్నారు. నాకు కొన్ని సందేహాలున్నయి ధర్మశాస్త్రంలో. అవి తెలియాలని ఎప్పటినుంచో నాకున్నది. నన్ను శపించినవారు నాకు అప్పుడు చెప్పలేదు. ఐ హు శ అప్పుడు చెప్పినా నాకు అప్పుడున్న

గర్వంపల్ల ఉన్నదున్నట్లు అర్థం చేసికొననే లేక పోయేవాణ్ణి. అందుకే ఈ శాపం వారు నాకిచ్చి కన్ను తెరిపించారేమొ బహుశ. ఇంతకూ ఆ ప్రశ్నలకు నీవు సమాధానం సంతుష్టికరంగ చెప్తే ఈ భీముడ్ని వదిలేస్తాను అంటాడు.
ధర్మరాజు అయ్యా: నీకు నేను చెప్పగలవాడనా? అయినా ప్రయత్నిస్తాను అంటాడు. ఆ ప్రశ్నలు ఏమంటే — (1) ఏ గుణాలు కలవాడు బ్రాహ్మణుడు (2) ఆ గుణాలను కలిగినవాడు శూద్ర జన్మడయితే అతడు బ్రాహ్మణుడయిపోతాడా? (3) అప్రియం చేసినా, అబద్ధమాడినా హింస చేయకుండా ఉండేవాడు సుగతికి వెళ్తాడంటారు ఎలా?

ఈ ప్రశ్నలు అడిగిన కాలంలో బ్రాహ్మణుడన్నా శూద్రుడన్నా అతడు ఫలాని కులానికి చెందినవాడనె అర్థం సాధారణ మానవుడి దృష్టిలో ఉన్నది. కాని మొదట వర్ణాల విభజనం గుణకర్మ వశం కావటంచేత నహుషుడు ఈ ప్రశ్న చేశాడు. ఈయన ఇంద్రపదవిలో ఉన్నప్పుడీలాంటి సంవాదం అప్పటి మునులు సహించలేదు. బహుశః కేవలం గుణకర్మకే ప్రధానం అంటే ఎవరి గుణం ఏదో తెలియక వర్ణ సంకరమె అయిపోయి కర్మలు చెడిపోతాయని భయపడినారు. ఇప్పుడు ధర్మరాజూ, నహుషుడూకూడ అరణ్యాల్లో మిగతా జంతువులలో సమానంగా బ్రతుకుతున్న సమయంలో అలా వర్ణసంకరమైన భయాలేవీ వారికి ఉండవు గనక నిశ్చయమైన ధర్మమేదో ధర్మరాజు చెప్పబోతాడు అని మనం నమ్మవచ్చు.

ఇంతకూ ధర్మరాజు ఈ ప్రశ్నలకు సమాధానం ఈ క్రింది విధంగా చెప్పాడు.

1. బ్రాహ్మణునకు సత్యక్షమాదమ శౌచదయా తపోదాన శీలాలు ఉంటవి. అవి ఎక్కడయినా ఒకడి ప్రవర్తనలో ఉన్నట్లయితె అతడు గుణరీత్యా బ్రాహ్మణుడె. సుఖం వచ్చినా దుఃఖం వచ్చినా విమోహాన్ని పొందక ఉండటమెలాగు అనే విద్యేవానికి పొందబడిన విద్య.

2. మరి యీ లక్షణాలన్నీ కలిగినవాడు శూద్రజన్మలో పుట్టినా బ్రాహ్మడవుతాడా అంటే–బ్రాహ్మణుడు, శూద్రుడు, అనేవి గుణకర్మ విభాగమయినన్నాటిక్కూ అతడూ బ్రాహ్మణుడుగానే వ్యవహరింపబడినా, బ్రాహ్మణుడనగా బ్రాహ్మణ కులజుడేనని అర్థం చేసుకొంటున్నవారికి ఇతడ్నిజూపి ఇతడు

బ్రాహ్మణుడేనంటే వారు ఎలా దానిని అర్థంచేసికోగలరు? అందుకె నీవు ఈ రెండో ప్రశ్నను వేశావు నిజమె. ఈచిక్కు ఎలా సంప్రాప్తించిందంటె "ప్రమాదంబున వర్ణసంకరమయినపుడు వర్ణపరీక్షార్థముగా బ్రాహ్మణాదులకు వృత్తంబు వేఱు వేఱ"ని స్వాయంభువుడైన మనువు చెప్తాడు. జన్మనుబట్టి ఫలాన అంటూ వారి వృత్తం ఇలా ఉండాలి అన్నాడు. ఇతడు ఫలానివాని పుత్రుడయితే, ఆ ఫలానివాని కులముకలవాడేను అనీ జన్మను బట్టి అతడి కులాన్ని చెప్పి, ఆ కులంవానికి సమాజంలో అతడికి ఉండవలసిన నడవడిని నిశ్చయించటం ద్వారా శాసనం చేశాడు శాసకుడుగనక. ఈ కారణంచేతనే "జన్మతా" వర్ణ నిశ్చయం అనేది వర్ణసంకర సమయంలో మనువు చెప్పిన **ఉపాయం**. అది శాసనీయమె. సమాజంలో ఎవరెవరికి ఎలాటి స్థితి ఉండాలో అందుకుగాను చెప్పినటువంటిదిది: దానిని పాటించకపోతే ఆ శాసనాన్ని ధిక్కరించటమె అవుతుంది.

శూద్రుడనబడుతున్న వానికి శూద్రజన్మతో పుట్టినవానికి పైె చెప్పిన బ్రాహ్మణ లక్షణాలుంటే అతడు బ్రహ్మపదార్థ తత్త్వ విషయంలో ఉద్ధృత మయిన స్థితికి పోగలిగినవాడే కావచ్చు కాని రాజశాసనం ప్రకారం సచ్ఛూద్రుడె అవుతాడు. సమాజంలో బ్రాహ్మణుడని అనబడజాలడు. శాసనరీత్యా అతడు శూద్రుడె. అయితె ఎప్పుడుగాని అతడి వృత్తాన్ని అనగా నడవడిని, పోగొట్టుకోరాదుగాక—జన్మతః ఎవరయినప్పటికి—

విత్తహీనుండు వెండియు వివిధ విధుల
విత్తవంతుండుగా నేర్చు—వృత్త హీను
డైనవాడు విహీనుండ యండ్రు-గాన
విత్తరక్షకు కడుమేలు వృత్తరక్ష

విత్తం పోయినా ఎలా తిరిగి సంపాదించి నిలద్రొక్కుకుంటాడో అలా వృత్తం (నడవడి) పోతె తిరిగి సంపాదించలేడు. కనుక విత్తం కాపాడు కోవటంకంటె వృత్తం కాపాడుకొనటం అవసరం అన్నాడు ధర్మరాజు—

ఇప్పుడు క్రొత్త శాసనాలు వచ్చి కుల విభాగ ప్రాధాన్యత ఏ విషయంలో కూడ ఉండరాదని మన రాజ్యాంగచట్టంలో నిబంధించుకొన్నాక, ఇక మిగి

లింది బ్రహ్మపదార్థతత్వ విషయ జ్ఞాన పరిశోధన యొక్క-దానికే ఈ గుణ కర్మ విభాగికమయిన విమర్శ వర్తిస్తుంది. ఈ పరిస్థితి ఇప్పటిది :

(3) అహింస సంగతి:- దానం, ప్రియంచేయటం, సత్యము, అహింస అని ఈ నాలుగూ సమాన ప్రతిపత్తి కలిగిన వస్తువులు. ఇందులో 'అహింస' గొప్పదని చెప్పాల్సి వస్తోంది. ఎందుకనంటే,- దేవతలూ, మనుష్యులూ, జంతువులూ అని ప్రాణికోటి స్థూలంగా మూడు భాగాలు. మనుష్యులు మధ్యరకంవారు. దేవతలు ఇంకా పైస్థితికి పోవడమనేది కేవలం బ్రహ్మపదార్థతత్వ విషయం అవగతం చేసికొనటంవల్ల కలుగవలసినదే: ఇక మిగిలిన మనుష్యులూ జంతువులలో మనుష్యులే ఈ పై నాల్గింటినీ చేయకలిగినవారై పైస్థితి అయిన దేవత్వం పొందగలిగేది. కాని జంతువు లయితే ఈ నాల్గింటినీ ఆచరింపగలిగిన స్థితిలేకపోగా - ఒక వేళ ఉన్నా హింసనే ఎక్కువ చేస్తున్నస్థితిలో ఉన్నవి. మనుష్యులకు చెప్పిన ఈ ధర్మంలో జంతువులలాగా హింస చేయటం అనేదాన్ని పూర్తిగా నిరసించ డానికిగాను అహింస చేపట్టటం ప్రధానమని చెప్పుతున్నారు. అనగా మను ష్యుడు జంతు లక్షణమైన హింసను ఏకాలానా చేపట్టరాదని చెప్పడానికి అహింస పరమ ఆచరణీయ మయినదని ధ్వనింపజేయటం ఇక్కడి ప్రధాన బోధకు లక్షణం.

ఈ సమాధానాలతో నహుషుడు సంతృప్తి పొందుతాడు. భీముని వదలి పెట్టుతాడు. తనకు శాప విమోచనం కావడంచేత సస్థితికి వచ్చి ధర్మరాజా దులను ఆశీర్వదించి వెళ్ళిపోతాడు. ఇక్కడివరకూ నన్నయ రచించిన మహాభారత కథ అయింది.



ఆంధ్ర మహా భారతంలో అజగరోపాఖ్యానం వరకూ నన్నయ్య కవిత్వం నడిచింది. ఆయన రచన పవిత్రంగా మడికట్టు కొన్నట్లుంటుంది. ఆయన చెప్పిన ధర్మాలన్నీ సూచనా పూర్వకమై ఆలోచనకు తావిచ్చేవిగా ఉంటవి. ఇక ముందు రాబోయే కథలు ఎఱ్ఱాప్రగడ కవిత్వ భాగంలోని కథలు.

## 3. మార్కండేయుని బోధలు

ధర్మరాజాదులు సరస్వతీ నదీ తీరాన కొన్నాళ్ళుండి మళ్ళీ కామ్యక వనానికి వస్తారు. ఈ వనం హస్తినాపురం, ఇంద్రప్రస్థం పట్నాలకు దగ్గర. వీళ్ళు మొదట వనవాసానికి బయలుదేరినప్పుడు కూడ ఇక్కడ కొన్నాళ్ళుండి వెళ్లారు.

ఇక్కడకు వాళ్ళు తిరిగివచ్చిన సంగతి శ్రీకృష్ణునికి తెలిసి వెంటనే సత్యభామా సహితంగా వీరిని చూడటానికి వస్తాడు. శ్రీకృష్ణునికి ధర్మరాజే భారత దేశాన్ని చక్రవర్తిగా పరిపాలించాలనీ, అతడికే అలాంటి లక్షణాలున్నవనీ అభిప్రాయమున్నది. క్రిందటిసారి వచ్చి వాళ్ళను చూచినప్పుడే కౌరవుల్ని గెల్చి, ధర్మరాజు రాజ్యం చేయాలని నిశ్చయంగా చెప్పి మరీ వెళ్ళి పోయినాడు.

శ్రీకృష్ణుని రాకకు ధర్మరాజాదులు మహా సంతోషపడుతారు. ఆహ్వానించి ఆదరిస్తారు. శ్రీకృష్ణుడు శాంతమైన ముఖంతో వారిని, ముఖ్యంగా అర్జునుడ్ని చూస్తూ చాల సేపు ఉండిపోతాడు. ధర్మరాజుతో ఇలా అంటాడు – "నిర్జర సమూహాలను మెప్పించి, అస్త్ర సంచయం సంపాదించి, యీ అర్జునుడు తేవటం నీ భాగ్యమనాలి. దానికి కారణం నిజానికి నీ నిష్ఠ – నీ తపస్సు. రాజ్యం కంటే ధర్మాన్నే ప్రేమిస్తూ ఉండటం నీకు అలవాటు. నీవు వేద వేదాంగ విదుడవు, వివిధ యజ్ఞాంగ కర్తవు, ధరణినంతనూ ఏలడానికి ఇవే తగిన లక్షణాలు" అని.

ఇవి ముఖస్తుతికి అంటున్న మాటలుకావు, నిజం తెల్పేవి. ధర్మరాజుకు దమం–సత్యం–యుక్తి–ధైర్య నిరూఢి–నిత్య తృప్తి–శమం ఇవి నైజములు,

ఆయన మనస్సు అర్థవశం కాదెప్పుడూ. కామ లోభాలు దానినిఆవహించు కోవు. అందుకే శ్రీకృష్ణుడు "నీ వెల్లకాలమూ త్రిలోక పూజ్యుడవవుతావు" అన్నాడు.

భారతం చదువుతున్నప్పుడు ఈలాటి ధర్మరాజు మనసులో స్మరించుకొని కథలోని విశేష విషయాలు అర్థంచేసికొనటం అవసరం. ఇన్ని అత్యంత ధార్మిక లక్షణాలు ఆయనకున్నవి అని తెలియక "పేరు ధర్మరాజు పేరువే పవిత్రు" అంటూ భారతకథలనే దురర్థం చేసుకోరాదు.

నిజానికి ద్యూతం పేరుతో కౌరవులు దురామ్మర్గంతో చేసిన పాపాలకు బలిగా సహించగలిగిన ధర్మాత్ముడింకెవరున్నారు చరిత్రలో! అతనికి కించిత్తు కోపం కల్గితే చాలదా ఆ క్షణాన భీమార్జునులు తిరుగబడితే – భీష్మ ద్రోణులు కలిస్తే– ప్రజలు విప్లవం లేవదీస్తే - దుర్యోధనాదులు చిత్తుకావ టానికి. ఆ మాటె శ్రీకృష్ణుడంటాడు–నీవు చేసిన నియతివల్లకాదా నీ తమ్ములు అనే సముద్రాలు సర్వజగాలను ముంచెత్తక పోయింది" అని.

చతురంబోధి పరీత- క్షితితల సామ్రాజ్యలక్ష్మికిం బతివి జగ
న్నుత నీవు నీవదలచిన- నతిదుష్కరమెందు లేదనగ్గళ
మహిమన్.

నీకు సహాయంగా అంధకులు వృష్ణులు ఎంతోమంది ఉన్నారంటాడు. ఈమాటలు వింటే ధర్మరాజుకు చక్రవర్తి అయేతలంపును రేకెత్తించటానికే శ్రీకృష్ణుడు అక్కడకు వచ్చాడా అనిపిస్తుంది. ఈ ఊహ ధర్మరాజాదుల అరణ్యవాస కాలం అజ్ఞాతవాస కాలం పూర్తి అయేలోపున సర్వదేశాలకూ వెళ్ళి ఊతం పుంజుకొంటుంది.

కేవలం చూడటానికి వచ్చినట్లై వచ్చి, కుశల ప్రశ్న చేస్తూనే ఈ ఊహను ఎక్కించేస్తున్నాడు ఈ శ్రీకృష్ణుడు అనిపిస్తుంది. భగవంతుడు "బుద్ధియోగం దదామ్యహం"అన్నట్లు నిర్వాతిత త్త్వప్రతీకలయిన శ్రీకృష్ణుడు సత్ప్రవృత్తులకు ఉన్నవి నెక్కి బోధచేస్తున్నాడు. ద్రౌపదిని సమాహ్లాదించి నీ కుమారులయిదు గురున్నూ ప్రద్యుమ్నుడిదగ్గర శస్త్రాస్త్రవిద్యలు నేర్చుకొంటున్నారంటాడు.

ఆమె సవతియైన సుభద్ర తన కుమారునికంటె ద్రౌపది కుమారులనే ఎక్కువ ఘనంగా చూస్తోందిట.

అదెగాక శ్రీకృష్ణుడు మార్కండేయుడనే మహావృద్ధమునిని తెచ్చి వీరికి ధర్మ వివరాలు చెప్పడానికి ఏర్పాటు చేసినట్లు అవుపడుతుంది. వీరిలా మాట్లాడుతూ ఉండంగానే మార్కండేయముని వస్తాడు. అప్పుడు శ్రీకృష్ణుడే ఆయనతో అంటాడు "మేమూ ధర్మరాజాదులూ అంతా మీవాగమృతధారలను వినడానికై ఇక్కడ ఉన్నాము" అని. అప్పుడె నారదుడూ వస్తాడు. ఆయన దేవముని. ఆయనకూడ, కృష్ణపాండవ ప్రియహితార్థంగా పరమ పుణ్య కథాకథనం చేయాల్సిందని ఋషియైన మార్కండేయుని నిమంత్రణం చేసి వెళ్ళిపోతాడు.

మార్కండేయుడు జ్ఞాని. కర్మయోగి. భక్తుడు కూడ. కర్మయోగి కనుక తనకు కర్తవ్యమైన పనులను మాత్రమే చేస్తాడు. తనకు. తెలుసుకదా యని అన్నీ అవాకులూ చెవాకులూ చెప్పడు. అసలు ఫలాని సందేహం ఉంది నాకు మీరు ఇది విశదపర్చి చెప్పండి అన్నప్పుడే ఆ సందేహం తీర్చే కర్తవ్యం, జ్ఞాని అయిన వానికి కలుగుతుంది. అందుకని ఊరుకొంటాడు— అలాగేనని ఏదో కథను ఆరంభించక. ధర్మరాజు అది గమనించి ప్రశ్న నడుగుతాడు.

"స్వామి! మేము ప్రయత్నపూర్వకంగా ధర్మంగా నడుచుకొంటున్నాము. కాని మేమిలా దుఃఖాల్లో ఉంటున్నాం. ఎప్పుడూ పాపమే చేస్తున్నారు ధృతరాష్ట్రీజులు. అయినా వాళ్లు సుఖోన్నతితో ఉంటున్నారు. ఈ విపర్యయమైన దానికి కారణం ఏమంటారు అని. నేను యోచిస్తున్నానుగానీ తెలియుటల్లేదు. నరుడు ఇప్పుడు చేసే కర్మలకయిన ఫలము ఇక్కడనే పొందుతాడా? పరలోకంలో పొందుతాడా లేక ఇక్కడా అక్కడా కూడ పొందుతాడా? అది చెప్పవలసింది. ఇప్పుడు చేసిన పనుల ఫలం ఈ శరీరంతోనే పోతుందా? అలా అంటే మరి మనుష్యులు చేసే కర్మఫలం ఒకప్పుడు శూన్యమవాల్సి వస్తుందేమొ ఎలాగ?" అంటాడు.

అందుకు క్లుప్తంగా మార్కండేయుడు సమాధానం చెపుతాడు. ప్రథమ కల్పంలో విధాత అత్యంత నిర్మలమయినట్టీ, ధర్మతంత్రాలయినట్టీ శరీరాలను సృజించాడు. ఆ శరీరాల్లో ఉన్న మనుష్యులు, మహా సత్త్వ సంపన్నులూ

సత్యవాదులూ సత్యసంకల్పులూ బ్రహ్మభూతాత్ములూ స్వచ్ఛంద జీవులూ అయి, దేవయానంలో విహరిస్తూ అనాయాసంగా అధిక ఫలసిద్ధిని పొందుతూ సర్వజ్ఞులై ఉండేవారు. విగతమత్సరులై బహు సహస్ర సంతానులయినారు. అసత్య సంధత, సత్యసంకల్పమూ బ్రహ్మభూతాత్ములయి యుండటమూవల్ల వారి మంచి, వారికి, వెంటనే, అప్పటికప్పుడె, ఫలితాన్ని ఇచ్చేసింది.

కాలాంతరాన, అంటే తరువాతి తరువాతి జనాల్లో కామక్రోధాది గుణాలు విజృంభించినయి. ఈ గుణాలు వచ్చినవంటే అర్థం, వారికి ఏదో లేదు కనుక దానికోసం కామం కలిగిందని అర్థం చేసికోరాదు? తమకు వున్నదే-కాని ఇంకా కామం కలుగుతోంది. క్రోధం కలుగుతోంది. ఇంకొకడికి పద్దు—నా కేను— అనే గుణం కలుగుతోంది. ఇలా ఉండటంచేత, దేవతల ద్వారా అనాయాసంగా ఫలాన్ని పొందే అవకాశం పోయింది. దేవతలు వదలిపేశారు. అందుకని మనుష్యులు అల్పాయుష్కులైనారు. అల్పబల శరీరులైనారు. దరిద్రులూ రోగులూ నాస్తికులూ అయి ఒకరిని ఇంకొకరు మెచ్చుకొననివారై ఈ సంకీర్ణమైన అనుభవాలు తమ శరీరం విడిచింతరువాత కూడ తమను అంటుకొని నీడలా వస్తున్నట్లు భ్రమించి, అందులో తమకు కావలసిన కోరికల ననుసరించి తిరిగి కొత్త శరీరాలతో పుట్టటం ఆరంభించారు.

శరీరంతో మాత్రమే చేసిన పనులకు ఆ శరీరానికి ఈ లోకంలోనె ఫలం కలుగుతుంది. శరీరమె కాకుండా మనసుతో కూడ చేసిన పనులకు, పాపం పుణ్యం ఉండినవైె స్థూల శరీరం పోయినా సూక్ష్మశరీరంతో పాటు తరువాత జన్మల్లోనైనా ఫలం ఇస్తూనె ఉంటాయి. కొందరకు అందుకే ఇక్కడా తరువాతి లోకంలో గూడ సుఖముండటం ఇంకొందరికి రెండుచోట్లా సుఖం లేక పోవటం కలుగుతూ ఉంటుంది.

ధర్మమును చేస్తూ ధర్మబుద్ధితో సజ్జన సాంగత్యంచేసి మనేవారు. ఇక్కడా ముందు జన్మలోనూ కూడ సుఖాలనె పొందుతారు. ఇదీ మనుష్యుల విషయం. కాని పాండవులయిన మీరు మాత్రం దివ్యులు. దేవతల మేలుకోసం జన్మించారు. మహీభారాన్ని తీర్చవలసినవారు. ఈ కష్టాలు ఇక నుండవు. సుఖాలు అనుభవింపబోతారు. అన్నాడు మార్కండేయుడు.

ధర్మరాజు తను అడిగిన ప్రశ్నకు చెప్పిన సమాధానంతో తృప్తిపడుతూ ఉంటాడు. తర్కించేసికోడు. బహుశ చెప్పిన వారిమాటలోనే ఇంకా ఇంకా ఆలోచిస్తూ ఊహిస్తూ నిజమైన విషయం అవగతం చేసికొంటాడనిపిస్తుంది. అలాటివాడు కాకపోయినట్లయితే విధాత అలాటి నిర్మల స్వభావుల్ని అప్పుడే సృజించి ఆ తరువాత ఎందుకు సృజింపకపోవాలి? అనీ, లేదా ఈ కామ క్రోధాల్ని ఎందుకు సృజించాడనీ అడ్డుప్రశ్నలు వేసేవాడేకదా.

మహాసత్త్వ సంపన్నులూ సత్యవాదులూ మొదటి సృష్టిలో ఉన్నారన్నప్పుడు, ఇప్పుడూ అలాటివారు ఉన్నారుకదా! బ్రహ్మపదార్థ తత్త్వవిదులు అలాంటివారేకదా అనే సందేహం కలిగినవాడై ధర్మరాజు బ్రాహ్మణ ప్రభావం ఎలాటిదో చెప్పవలసిందని అడుగుతాడు. మార్కండేయుడు ఈ క్రింది కథ చెప్తాడు.

"హైహయుల వంశంలో దుంధుమారుడనే ఒక రాకుమారుడు వేటకై వనానికి వెళ్ళి ఒక తృణలతాగుల్మ మధ్యంలో కృష్ణాజినంపై కూర్చొన్న ఒక బ్రాహ్మణ కుమారుని మృగముగా భ్రమించి బాణంవేసి చంపుతాడు– తరువాత ఆ సంగతిని తెలిసి పశ్చాత్తాపపడి ఇంటికి వెళ్ళి తన వంశ్యులనందరనూ తెచ్చి ఈ బాలుని శవం చూపుతాడు. పరివేదన చెందుతాడు. వీరంతా అక్కడనె ఉన్న తార్క్ష్య మహాముని ఆశ్రమానికి ఈ వృత్తాంతం చెప్పాలని వెళ్ళితె అక్కడ తార్క్ష్య మహాముని వీరికి అతిథి పూజలు చేయాలని ఆయత్తమవుతాడు. వీరు జరిగిన సంగతి చెప్పి–తాము పాపులనీ–పూజల కర్హులు కాదనీ చెప్పారు. అందుకు తార్క్ష్యుడు—

వినుడెన్నడు మాయాశ్రమమున నెవ్వారలకులేవు ఘోరిభయవ్యా
ధి నిరోధ మృత్యుదోషా ద్యనేక దుఃఖములు త్రిజగదాశ్చర్యముగన్

అని తమ ఆశ్రమంలో రోగ భయం సరికదా–మృత్యు భయంకూడ ఉండదంటాడు–పైగా తన కుమారుని పిల్చి ఇతడ్నేనా చంపినామంటున్నారు, అడుగో చావలేదుకదా బ్రతికె ఉన్నాడు అంటాడు.

హైహయులు వానిని చూచి ఆశ్చర్యపడుతారు. "ఇంతటి ప్రభావం మీకెలా కలిగింది" అని తార్క్ష్యునె అడుగుతారు. అందుకాయన,—

ఆలస్యం బొకయింతలేదు, శుచి, యాహారంబు నిత్యక్రియా
జాలం బేమఱ మర్చనీయు రతిథుల్ సత్యంబ పల్కంబడున్
మేలౌ శాంతియు బ్రహ్మచర్యమును నెమ్మిం దాల్తు మట్లౌటనె
క్కాలంబుం బటుమృత్యురోగభయ శంకం బొంద, మేమెప్పుడున్

అంటాడు. ఇదే మా ప్రభావానికి మూలము. సరియైన సమయానికి అన్ని పనులూ చేయడం, శుచి, ఆహారం, నిత్యక్రియలను ఏమరక చేయడం వల్ల శరీరం సౌష్ఠవమై ఉంటుంది. అతిథుల్ని అర్చించటం—సత్యమే పల్కటం—ఇవి మనసు ఎల్లప్పుడూ చేసే పనులు. ఇక శాంతి బ్రహ్మచర్యం, బుద్ధితో నిర్వహింపబడుతూ ఉంటవి. మరి శరీరానికి మృత్యువు వచ్చే అవకాశం ఏ మూలనుంచి ? ఇదె మా ప్రభావానికి మూలం అంటాడు. అంతేగాని మేము బ్రాహ్మణ జన్ములమని అనడు. ఇలా ఉండేవారికి గల ఈ ప్రభావం బ్రాహ్మణ ప్రభావమేనని మార్కండేయుని అర్థం. అనగా బ్రాహ్మపదార్థ తత్త్వ విదులయిన వారు శాంతి, బ్రాహ్మచర్యం వగైరాలన్నిటినీ నిర్వహింప గలిగి ఉంటున్నారని ధ్వని. వారికి ఈ ప్రభావం కలుగుతుందని బోధ.

మార్కండేయుడంటున్నాడు—

కేవలం బ్రహ్మస్వరూపమే గొప్పది అంటూనే మిగతావి పనికిరాని వస్తు కొంటావేమొ! బ్రహ్మక్షత్రియ స్వరూపం తెలియజెప్పే ఒక ఇతిహాసమున్నది వినండి.

అత్రి అనే ముని ఒకసారి తపస్సుకై, వనవాసం వెళ్ళబోతూ భార్య నడుగుతాడు నీవు పిల్లలను కనిపెట్టుకొని ఉంటావా నాతో వస్తావా అని. ఆమె "అయ్యో యీ పిల్లలకి ఏదైనా కొంత ధనం ఇచ్చి వెళ్ళండిగాని-ఏమీ ఈయకుండా పోవడం సరికాదం"టుంది. వెళ్ళి వైన్య భూపతిని అర్థించి డబ్బు తెచ్చి ఇచ్చి వెళ్ళమంటుంది. అత్రి అది నిజమేనని గ్రహించి వైన్యభూపతివద్దకు వెళ్ళి ఆయన్ను "నీవ విధాత వింద్రుడవు నీవ సమస్త జనేశ్వరుండవు" అని పొగడుతాడు. కాని అక్కడున్న గౌతము డీది విని ఆయన్ను ఆదేశిస్తాడు. ఒక మనుష్యుని ఆవిధంగా ఇంద్రుడవనీ ఈశుడవనీ పొగడుతావు! అది సరికాదంటాడు. అందుకు అత్రి "సర్వలోకముల నిర్మల నీతి వెలుంగు ధాత్రీరమణుండు రాజు వానిని నుతించకూడదా" అంటాడు. ఇద్దరకూ వాగ్వివాదం అవుతుంది. చివరకువారు సనత్కుమారుని వద్దకు వెళ్ళి అడుగుతారు. అప్పుడు సనత్కుమారుడు,—

"అత్రి చెప్పింది నిజం. ఈ సమస్త ధాత్రినీ క్షత్రియుడు తన భుజాలపై వహించిన వాడవుతున్నాడు. అందర్నీ 'గావను, త్రోవను, అతడు ప్రభుడు. అతడె శత్రు నిషూదనుడు అందుకని అతడు శక్రుడు ఈశ్వరుడు విధాతకూడాను. రాజుయొక్క మహిత శాసనాన. "సజ్జనులను, మన్నులను సద్విధి జనువారుగాని కదవంజనదెవ్వరికిన్" అంటాడు. పైగా ఆగమాలే-రాజును, విరాట్, సామ్రాట్, యుధాజిత్-ఇలాటి మాటలతో కొనియాడుతున్నవి. అధర్మం జరుగుతుందేమోనని తొలి బ్రాహ్మణులు వెలచి నిజతేజోబలంబులు క్షత్రంబున నిక్షేపించారు. అప్పటి నుంచి బ్రహ్మ క్షత్రాలు పరస్పర సంశ్రయాలు, వెలిగానుండవు. క్షత్రియుడు బ్రాహ్మణ సంసేవనాన, తేజోనిరూఢుడయి దురితాల నడచేవాడవుతున్నాడు. అందుకని క్షత్రియుడు సర్వాధికుడవటం నిశ్చయం."

ఈ తగాయిదా అలా తీరిం తర్వాత వైన్యుడు అత్రికి ధనరాసులిచ్చి పంపుతాడు.

చిత్రమేమిటంటే మార్కండేయుడు బ్రాహ్మణ ప్రభావం గొప్పగా చెప్పి తిరిగి క్షత్రియ స్వరూపం చెప్పి, క్షత్రియుడు సర్వాధికుడని చెప్పటం విశేషం. అతడూ ఇతడూకూడ అధికుడెలాగ అనటం తెలియనితనమవుతుంది. ఎవరైనా వారి ప్రవర్తనవల్ల అధికులౌతారనేది గమనీయం. మార్కండేయుడు మరొక ఇతిహాసం చెప్తూ "సరస్వతీ గీత" అని చెప్తాడు, అందులో ఒక ముని భారతీదేవిని ప్రత్యక్షం చేసికొని, పురుషుండెద్దాన పరమపుణ్యాత్మకుడై చిరపుణ్యగతులు వడయును" అని ఆమెను అడుగుతాడు. ఆమె అప్పుడు చెప్తుంది. వేదాలు చదివి యజ్ఞాలుచేసిన వానికి గోదానం వృషభ దానం వస్త్రదానం ఇవి ఇచ్చినట్లయితె స్వర్గం నరకం చంద్రలోకం ఇలాటి ఫలాలు కలుగుతవని, అంటే జన్మతః ఫలానివారు ధర్మాలు చేస్తే ఇలా అవుతుందని ఎక్కడా చెప్పకుండానే ఎవరు ఏఏ గుణగణాలు కలిగి ఏఏ ధర్మాలు చేపట్టితె వారికి వాటియందే సుఖము లభిస్తుంటుందనేది భారతీదేవి సూచించిన దన్నమాట. ఈ దానాలు, వేదాలు చదివినవారికీ భూసురులకూ ఇవ్వమనటం వల్ల బ్రహ్మ పదార్థ విదులకు ఇచ్చే దానాలు ఎక్కువ పుణ్య ప్రదాలనే సూచన ఉంది.

# 4. వైవస్వతమను వల్వం

ధర్మరాజు "పూర్వం వైవస్వతుడు మహారాజు కదా! ఆయన మనువైనాడు. అతడికి అంతటి ప్రభావం ఎలా కలిగింది చెప్పవలసింది" అంటాడు. ఆయన అంతటి గొప్పవాడు కావటానికి కారణం అతడి ప్రవర్తన అనీ అని పిస్తుంది. కాని అలాటి ప్రవర్తన కలిగినవాళ్ళందరూ అలాటి ప్రభావాన్ని పొందటమనేది కుదరదు అనీ అనిపిస్తుంది. ఆ కథను మార్కండేయుడు చెప్తున్నాడు.

వైవస్వతుడనే రాజు ఒక జలాశయ తీరంలో ఉండి స్నానం చేసే సమ యంలో ఒక చేపవచ్చి మనుష్య వాక్కులతో తను ఉన్న దొరువులో తనను మింగే చేపలున్నందున తనకు తగిన చోటు చూపి ఆశ్రయం ఇవ్వాల్సింది అని అడుగుతుంది. ఆ రాజు ఆ చేపను తెచ్చి ఒక బావిలో వదలి ఎప్పుడో వెళ్ళి "చేపా చేపా ఎలాగున్నావు" అని ఆదరించేవాడు. ఆ చేప "అయ్యా నాకు ఈ చోటు చాలటల్లేదు, ఇంకా పెద్ద నీటి స్థలం కావా"లంటుంది. అప్పుడు ఆ చేపను ఒక తటాకానికి చేర్చుతాడు. కొన్నాళ్ళకు ఆ చేప ఇంకా పెద్దదై ఇప్పుడెలాగంటుంది. దానిని గంగలో చేర్చుతాడు వైవస్వతుడు. గంగకూడ చాలనంత పెద్దదవుతుంది ఆచేప. అప్పుడు దానిని తీసికొని పోయి సముద్రంలో పెట్టుతాడు.

"నీవు నాకు ఉపకారం చేశావు. అది నీ మంచిమనసునకు లక్షణం. నేనూ నీకు ఉపకృతి చేస్తాను. నిఖిల భూతాలూ ప్రళయంలో నశించిపోబో తున్నాయి. మళ్ళీ ప్రపంచం సృష్టిచేసేందుకు వీలుగా ఈ ప్రపంచంలో ఉన్న ఒకొక్క రకానికి కొన్ని కొన్నిగా ఓషధులు తీసికొని ఒక పెద్ద ఓడలో పెట్టించి నీవూ ఆ ఓడనడిపేవాళ్ళు దానిని ఎక్కి సముద్రంలో ఉండవలసింది" అంటుంది.

వైవస్వతుడు అలాగేచేసి ఆ ఓడనెక్కుతాడు. అప్పుడా చేప ఒక పెద్ద కొమ్ముతో అవతరించి ఆ కొమ్ముకూ ఆఓడకూ తాళ్ళు కట్టించి సముద్రంలో ఎక్కడకో తీసికొని పోతుంటుంది. అప్పుడు బ్రహ్మాండంగా మబ్బులుపట్టి గాలివసరి, సముద్రాలు నాల్గు ప్రక్కలా పొంగి భూమి కన్పడకుండా

మునిగిపోతుంది. ఈ ఓడను మాత్రం ఆచేప-కొన్నివేల ఏండ్లపాటు-నీటిపై త్రిప్పి చివరకు హిమాలయ శిఖరం నీటిపైన తేలికన్పడుతున్నప్పుడు అక్కడకు తెచ్చి ఆఓడను ఆ శిఖరానికి తాళ్ళతో కట్టింపజేస్తుంది. చివరకు అంటుంది.

"నేను" విశ్వకర్తను-ప్రభుడను-ఇప్పుడు ఈ మత్స్యంగా అవుపడుతున్నాను. మునులనందరనూ ప్రళయంనుంచి రక్షించాను. ఆరిపోయిన ప్రపంచంతోపాటు మిమ్మలను కలపకుండా తెచ్చాను. ఇప్పుడీమనువు దేవాసురులను మనుష్యులనూ పుట్టిస్తాడుగాక వానికి పరమమైన జ్ఞానోదయంకలుగుతుందిగాక అని చెప్పి వెళ్ళిపోతుంది. ఈ మనువు చరిత్ర చదివినా వినినా దురితములుపోయి ఇహపర సుఖాలు కలుగతవని మార్కండేయుడు చెప్తాడు.

ఈ కథే చిత్రమైనదనుకొంటుంటే ఈ ఫలశ్రుతి మరీచిత్రమనిపిస్తుంది. ఈ కథ జరిగిందనిగాని జరగటానికి అవకాశముందనిగాని-సర్వసాధారణంగా ఇప్పటి మనం అనలేము. ఇతిహాసం కనుక వ్యాసుడు వైవస్వతునిపేర ఈ కథ చెప్పాడంటాము. ఇతిహాసమయితె మాత్రం ఇలాంటి అసంభవమైన కథ చెప్పి పైగా మీకు ఎంతో ఫలం కలుగుతుందనటం ఛప్పుతెచ్చి చెవిలో పెట్టినట్లేనా? అయిఉండదు. ఇందులో తప్పనిసరిగా మోక్షసాధనా మార్గం ఏదో సూచించాడనిపిస్తుంది.

ఇది అహంకార మమకారాలు నశింపజేసే సాధనను గూర్చి చెప్పినకథ. వైవస్వతమనువు వైరిణీనది ప్రక్క సాధన చేస్తున్నాడట. వైరం ఎవరితో సాధకునకు? తామసిక వృత్తులతో, తామసిక వృత్తుల ప్రక్కనే కూర్చుని సాధన ఎన్నాళ్ళో చేశాడు ఆ మనువు. అప్పుడు మత్స్యం వచ్చింది. మత్+స. అంటె అహంకార మమకారముల నశింపు అని అర్థము. ఆ సాత్త్విక వృత్తి ఆయనవద్దకు తానై వచ్చింది. అనగా సాధకుని మనసులో ఉద్భవించిందని ధ్వని. అది చాల చిన్నది. అందుకె ఇతరత్ర వున్న వైర దుర్వృత్తులు దానిని మ్రింగుతున్నాయి అన్నది. రక్షించుకొమ్మన్నది. సాధకుడు దానిని మనసులో గిలించినాడు. రక్షిస్తున్నాడు. అనగా ఆ స్వభావమును పెంచుకొంటున్నాడని బోధ. పెరిగి పెరిగి చెఱువుకూడ పట్టనప్పుడు కాలం అనే (గచ్ఛతి ఇతి గంగ) గంగలో వేశాడు. చివరకు ఆ స్వభావం

పెరిగి పెరిగి సముద్రంలో చేరింది. అంటె ఆనంద సుఖాన్ని చేరిందని అర్థం. అక్కడికి బ్రహ్మానందస్థితి కలిగింది. ఇది మొదటి మెట్టు.

అప్పుడు చేప బీజాలుసహా అన్నీ తెచ్చి ఓడలో పెట్టించుతుంది. వాసనలన్నీ నశింపచేస్తుంది. అనగా ప్రపంచమంతా నశించిందని అర్థం. సముద్రమంతా త్రిప్పి చివరకు హిమవన్నగాన్ని చేరుస్తుంది. అనగా శీతస్వభావం గలస్థితి. అక్కడ ఓడలో తెచ్చిన బీజాలన్నీ అవి ద్వంద్వాలు మళ్ళీ పుట్టి వెలుస్తవి. కాని వాటిని సాధకుడు అదివరకె జయించాడు గనుక అవి ఈతడి సాధనను ఇక చెడగొట్టవు. పైగా అవి అతడి బ్రహ్మానందస్థితిలో లీనమయి ఉంటవి. సాధకునకు సర్వంఖల్విదం బ్రహ్మ సాధన సమకూరిందని అర్థం. అతడందుకె మనువైనాడు.

ఈ వైవస్వతుని ప్రభావం చాని ప్రవర్తనవల్లనే కలిగిందా లేక విశ్వకర్త అయిన ఆచేప రూపంలోని ప్రభువుయొక్క దయకారణంగా కలిగిందా అనే సమస్య మనకెందుకు: ఈ మార్కండేయుడే ప్రళయ కాలంలో నశించనివాడై యున్నప్పుడు ఆ ప్రళయకాల విశేష విషయం ఇతడికి తెలిసిందె చెప్పవలసిందని అడుగుదామని ధర్మరాజు "ప్రళయకాలంలోకూడ నిలువ గలిగిన నీకాశక్తిని ఆ జగదంతకుడయిన పరమేశ్వరుడు ఇచ్చాడుకదా ఈ సకల చరాచరాలూ నశించటం ప్రభవించటం ఎలా అవుతూ ఉంటుందో చెప్పవలసిం"దంటాడు.

## 5. ప్రళయ ప్రకారము

అప్పుడు మార్కండేయుడు శ్రీకృష్ణునిచూసి ఈయన అఖిలభూతేశ్వరుడు. అవ్యయుడు. దేవుడు. ఈయన్ను తలచి ఆమీదట నీకు ఈ ప్రళయ కాల కథను చెప్తానుగాక. అక్కడున్నవారిలో సర్వ ప్రపంచంలో ప్రతి చోట ఉన్న "నేను" "తానే"నని అనుభూతి చెందినవాడు శ్రీకృష్ణుడు. ఆయన సంకల్పం ఎదురుగుండా ఉన్న తనలో గొప్ప ప్రభావాన్ని కలిగిస్తుందని మార్కేండేయుని నమ్మకం. ఆయనలోని "నేను" తనలోని "నేను" ఒకరే కదా ! ఆయనలో పొందిన ప్రతిభ, తనలోకూడ వెలిగి తనవాక్కులు ధర్మరాజాదులకు అర్థం అయేటట్లుగా ఉండగలవనే నమ్మకంతో మార్కండేయుడు చెప్తున్నాడు ప్రళయకాల ప్రకారం :

"బ్రహ్మకు ఒక్క రోజు అనేది పన్నెండువేల దివ్య సంవత్సరాలు. మన కాలమానానికి ఆ బ్రహ్మకాలమానానికి చాలా తేడా ఉన్నది. నిజానికి 10 నిముసాలు నిద్రలో స్వప్నంకని అందులో మనమె చాలా ఏండ్లు రాజ్యం చేసినట్లు, లేదా చాలామంది పిల్లల్ని కనినట్లు అనుభూతి చెందుతాము. స్వప్నంలోగల కాలమానం వేరు. జాగ్రతలోగల కాలమానం వేరు. అలాగే ఆ బ్రహ్మ కాలమానం వేరు. మన జాగ్రతలోగల కాలమానం వేరు అనేది గ్రహించాలి.

అలాంటి రోజులు చేరి సంవత్సరాలు నూరు అయిపోతే బ్రహ్మ కల్పం ఒకటి పూర్తిఅయినట్లు. అప్పుడు ఈ బ్రహ్మపల్ల కలిగిన సకల చరాచరాలూ మార్పుచెంది నశించిపోవటం కద్దు. క్షణ క్షణానికి ప్రపంచం మారటం నిజమే కదా; ఇక నశించి పోవటమంటే ఏమని అర్థం. ప్రతి వస్తువూ పగలగొట్టితే యాటమ్ములూ, ఎలెక్ట్రాన్లులూ అయినట్లు అప్పుడు ప్రతివస్తువూ నీరుగా అయి సముద్రంలో కలిసిపోతుంది. బహుళ, గాలి అయి తేలిపోతుంది. ఆకాశమై కన్పడకపోతుంది. ఎలా అవుతుందనేది చెప్తున్నాడు మార్కండేయుడు.

ఈ కన్పడే సూర్యుడే తన వేడిని పెంచి సముద్రపు నీరంతా త్రాగేస్తాడు. నీళ్ళు ఉండవు జగత్తులో. జీవులన్నీ నశిస్తాయి మిగతావన్నీ కూడ అచరాలై ఉంటయి. ఆ తరువాత గొప్పగా మేఘాలు వచ్చి నీటితో ముంచివేస్తాయి. అన్ని అచరాలూ కూడ నీరై పోతై, ఈ ప్రపంచాన్నంతనూ చీకటి క్రమ్మకొంటుంది. ఆ తరువాత మహావాతమొకటి వీసురుకొంటూ వస్తుంది. మేఘాలు పోతవికాని ప్రపంచాన్ని రచించాల్సిన బ్రహ్మ, విశ్వకర్త–పరమేశ్వరుడు తామర పద్మంమీద ఏకాంతంగా ఉన్నవాడై యోగనిద్ర పోతాడు.

ఇలా ప్రళయం సాధారణంగా అవుతుందని చెప్తూ తాను చూచిన ఒకానొక ప్రళయం సంగతి చెప్తాడు. "ఒకసారి ప్రళయ సమయంలో ఆ గాఢాంధకారంలో దిక్కుతోచక తిరుగుతున్నాను. ఒక్కచోట ఆ నీటిలో ఒక పెద్ద మర్రిచెట్టు! దాని చివర ఒక ఆకుమీద హాయిగా పడుకొని నిద్రింతగానున్న సుకుమారుడ్ని చూశాను. లోకాలన్నీ నశించి నీరవుతుంటే ఈ

పిల్లవాడు ఎందుకు–ఎలా–ఇక్కడ–ఇంత హాయిగా నిద్రలో ఉన్నాడు అని విస్తుపోయాను. ఆయన వద్దకు వెళ్ళాలని ప్రయత్నించేసి వెళ్ళాను. ఆయన పద్మపత్రాల వంటి లోచనాలను ఎత్తి నా వంకకు చూసి "అయ్యా నీవు చాలా అలసిపోయినట్లున్నావు. విశ్రాంతి తీసికొంటానంటే అవకాశ మిస్తాను" అన్నాడు. "నాశరీరంలోకి ప్రవేశించి నిశ్చింతగా ఉండాల్సింది" అన్నాడు. నేను అలసిపోయానంటున్నాడు ఈ మహానుభావుడు. "నేను"కూ ఈ శరీరానికీ సంబంధమేమిటి కాకతాళీయకమేగాని ! నేను ఎప్పుడూ అలసిపోలేదు. కాని ఈ శరీరం అలసట చూసి ఈయన నన్ను అలా అన్నాడుగాక అనుకొన్నాను. ఇంతలో ఆయన నోట్లోకి "నేను" వెళ్ళిపోతున్నాను. లోపలకు వెళ్ళిపోయినాను. అక్కడ ఎంత చిత్రము!

గంగాది నదులున్నాయి. పర్వతాలున్నాయి. సముద్రాలున్నాయి. భూమి ఉంది. సూర్యుడు, చంద్రుడు తారకలు, అగ్ని పెద్ద ఆకాశం గాలులూ అన్నీ వున్నాయి. యక్షరాక్షస గంధర్వులూ, సకల లోకాలు ఉన్నాయి. అలా అక్కడ నూరు సంవత్సరాలున్నాను నేను. 'నేను, నేను' అంటూనే ఉన్నాను. కాని ఆ శరీరం ఈ శరీరమా కాదా అనే ప్రసక్తిలేదు. నేను అని ఇప్పుడు అనుకొంటూ గడ్డాలు మీసాలు పెరిగినవాడే మంగలి షాపులో క్షౌరం నున్నగా చేయించుకొని వచ్చేటప్పుడూ 'నేను' అనే అంటాడు. ఆ నూరు సంవత్సరాల స్థితి అదే. "నేను ఆ నేనేను" అనే మాట– ఖాయం. ఇప్పటి శరీరం అప్పుడున్నదా లేదా అనేది జ్ఞాపకం లేని మాట. అన్నాడని పిస్తుంది మార్కండేయుడు

తరువాత "ఓయిబాబో ఈ ప్రపంచం నాకొద్దు మొర్రో అనుకొంటూ ఆ బాలుని తలచాను, అంతె తిరిగి ఆయన నోట్లోంచివచ్చి ముందుచేరాను. "హాయిగా విశ్రాంతి తీసుకొన్నావా నీవు" అని ఆ బాలుడు నన్నడిగినాడు. అప్పుడు నేను వాని కోమల చరణములకు నమస్కరించి "మీ ప్రసాదంచేత ఆత్యాశ్చర్యకరణమైన సకల చరాచర భూతప్రపంచాన్నీ చూచాను. నీ మాయా ప్రభావాన్ని భావింపజాలకున్నాను. నేను సమ్మోహితుణ్ణయి పోతున్నాను. అలా కాకుండా రక్షించాల్సిం"దన్నాను. అప్పుడా బాలుడు అన్నాడు.

"ఇదంతా నామహిమ. దేవతలూ మునులూ తెలియలేరు. నీవు భక్తుడవు గనుక నీకు చెప్తాను అన్నాడు. "నా పేరు నారాయణుడంటారు. నేను

నేను శాశ్వతుడను. ప్రభుడను, సకల జగాలనూ సృష్టిస్తాను. పాలిస్తాను సంహరిస్తాను. నా ఆకృతులు ఒకప్పుడు బ్రహ్మ. ఇంకొకప్పుడింద్రుడు. లేదారుద్రుడు. జనేశ్వరుడు ఇలా–అన్ని ఆకృతులూను. అగ్ని ముఖం– సూర్యచంద్రులు కళ్ళు– అంతా నేనే. ఇలా నేను చెప్తుంటే ఒక కుంచెతో బొమ్మవేసి చూడటానికి ప్రయత్నించకు. అన్ని ఆకారాలూ నేనేను అని చెప్పటం. నీ జుట్టు, నీ ఒళ్ళు, నీ మనసు, నీగోళ్లు: ఇవ్వన్నీ నీవు కాదా అన్నీ నీలోనుంచి వచ్చినవికావా? అలాగే అవన్నీ నేనే. ఈ ప్రపంచంలో ప్రస్తుతం భూసురులు, క్షత్రియులూ, వైశ్యులూ ఈ మహోత్తరాధ్వరాలు చేసి కొల్చేది నన్నే. అంటే "నేను" అనే దాని మహత్తర విషయం తెలియ డానికి ఈ అధ్వరాలన్నీ వీరు చేస్తున్నారు. పూర్వం మత్స్యావతారం, కూర్మావతారం, వరహావతారం అని చెప్పబడే అవతారాలు ఎత్తింది నేనే. అలా భూమిని ఉద్ధరించింది నేనే, ఈ ప్రళయానికి ముందు ఖాండవ దహనం చేసిందీనేనే. ఈ చరాచర జీవరాసులన్నీ చివరకు "నేను"గా మిగిలి పోవటం చూస్తావుగాక.

ఇన్ని మాటలెందుకు ఇంతకు పూర్వం ఏది ఏది ఉన్నదని చూశావో అదంతా నేనే. ఎలెక్ట్రానుల్లాగా ఎల్లెడల ఉన్నానని అర్థం. ఇకముందు రాబోయే క్రొత్తవన్నీ కూడా నేనే. ధర్మహాని జరుగుతున్నప్పుడు ధర్మ పరులలో చేరినవాడనై (పుట్టి) ధర్మాన్ని నిలబెట్టుతాను. నా సంగతంతా ఇప్పుడు చెప్పాను– నీకు తెలిసి ఉండాలి: ఈ బ్రహ్మ, పితామహుండు అని మీరు పిల్చేవాడూ నేనే. నీ మీద ప్రేమకొద్దీ నాలో ఎన్నో లోకాలు చూపాను, అనుభవం కలిగేందుకు వీలుగా.

ఇంతచెప్పి మార్కండేయుడు ఆ నారాయణుడే ఈ శ్రీకృష్ణుడు సుమా అంటాడు. ఐతే ధర్మరాజు నారాయణుడుకాడా? తాను నారాయణుడు కాడా అనే ప్రశ్నలు వస్తవి. కాని ఆ నారాయణుడే ఫలానా అంటె ఆ ఫలానా వారు ఎవరూ ఒప్పుకోకపోవచ్చు–ఒక్క శ్రీకృష్ణుడు తప్ప. ఆయనకు తానే పరమేశ్వరుడని తెలుసుకనుక అలా అన్నాడు. అందుకు శ్రీకృష్ణుడు కాదనక పోవటమె తార్కాణం. ఎవరినో చూచి ఆ నారాయణుడు "ఈతడే" అన్న ట్లయితే, ఆతడు అయ్యబాబోయ్ నేను కాదనేవాడు". అనుభూతి కానివాడు

గనక. అందుకని శ్రీకృష్ణుని విశేష విషయం తెలియటం ఇక్కడ అవసరం. అప్పుడు ధర్మరాజాదులు శ్రీకృష్ణునకు నమస్కరించి సంభావించుతారు:

## 6. కలియుగ లక్షణం

మార్కండేయుడు ప్రళయ ప్రకారాన్ని ధర్మరాజుకు చెప్పి తాను వట పత్రశాయి వదనంలోంచి లోపలకు వెళ్ళిపోయి మరో జన్మ అనుకోకుండానే ఎన్నో లోకాలు తిరిగి వచ్చి నారాయణుడే ఆ ప్రళయాని కంతకీ అధిపతి అనే మాటలు చెప్తాడు. "నేను" అనేది శారీరక జన్మలు మారినా, మాన సిక జన్మలు మారినా, బుద్ధిమారిపోయినా మారకుండా ఉండినదై అప్పుడది అనుభవించాను. ఇప్పుడిది అనుభవించాను అని చెప్పడానికి సర్వకాలాల్లో ఉంటూనే ఉంటుందన్న తత్త్వ విషయం తెలియజెప్తాడు. అలా చెప్పి చివ రకు శ్రీకృష్ణునే నారాయణుడుగా గుర్తించుతాడు. ధర్మరాజాదులకు శ్రీకృష్ణుడె పరమేశ్వరుడనే విషయం స్థిరం కావడానికి ఈ ఋషులందరూ ఇలా ఉప యోగించారు అనేది మనకు స్మరణీయం.

ద్వాపరం వెళ్ళిపోతుందనీ కలియుగం వస్తోందనీ తెలుసు ధర్మరాజాదులకు. కలియుగమువస్తె ద్వాపరయుగంలో నడిచే కనీస ధర్మమయినా నడువదనే ప్రథ ఉండనే ఉంది. ఐతె ఆ అధర్మం ఎలా కలుగుతుంది? అనే సందేహం ధర్మరాజుకు కలిగి ఆ సంగతి చెప్పమంటాడు. అప్పుడు కలియుగంలో అధర్మం ఎలా వ్యాపిస్తుందో చెప్పాడు మార్కండేయుడు.

ఆ చెప్పిందంతా వింటుంటే మనం ఇప్పుడు రోజూ చూస్తున్న విషయాలే అని తెలుస్తుంది. అవన్నీ అధర్మాలని అప్పట్లో అనుకొనే వారనేది మనం తెలిసికొనాల్సిన విషయం అనిపిస్తుంది.

సత్యంబు నరులకు సంక్షిప్తమగు –అంటాడు. సత్యం అనేది నిత్యం ఆడే ధర్మంగా ఆ రోజుల్లో పరిగణింపబడి ఉండేది అని భారతం చదివి నప్పుడైనా మనకు తెలియవచ్చు. "ఆ సత్యం లేకపోవటంచేత, జనులకు ఆయుః ప్రమాణం తగ్గిపోతోంది. ఆయుపు తగ్గటం చేత విద్యలను నేర్చుకొనే సమయం తగ్గిపోతోంది. అల్పవిద్యలే వస్తవి. అల్ప విద్యల

వల్ల విమోహం కలుగుతుంది. మోహం వలన లోభం వస్తుంది. లోభా వేశం చేత కామం ఎక్కువవుతుంది దానివల్ల క్రోధం ఎక్కువవుతుంది. ఆకారణంగా ఒకరికీ ఒకరికీ వైరం పెరుగుతుంది. ఒకరు ఇంకొకరికి పీడ చేస్తూ ఉంటారు. ఒకడు ఇంకొకడి పేరలోనుండడు. తమతమ గుణాల కయిన వర్తనాన్నే సహజంగా అనుసరించడంవల్ల అవధులు, లక్షణ పరి మితులు ఆంక్షలు అరంభిస్తారు. ఎలాగంటె—

"ఇప్పుడు బ్రాహ్మణులము అని జన్మనుబట్టి తెలిసి జప నియమస్వాధ్యాయం కలవారు వాటిని వదిలివేసి, శూద్రులే ఉద్యోగాలు చేయడమేమి? మేమెందుకు చేయరాదు. అంటారు. ఇక శూద్రులు మత్సరంతో తపస్సు చేసి కేవలం శరీరాన్ని శుష్కింపచేసికొంటారు. జనపథాలు క్రూరమృగా లతో పాములతో ఉన్నట్లై జనులు అరాజకంలో ఉండిపోయినవారై ధర్మం తెలియనే తెలియక ధర్మ నిర్మూలనం చేస్తారు. దేశాన్ని రక్షించాల్సిన వాళ్ళలో మైత్రి అనేది లేకుండాపోయి ఒకరు ఏటికి ఇంకొకరు కోటికీ లాగుతారు.

శాకాల్లో ఓషధుల్లో పస చెడుతుంది. చెట్లు కొంచెం కొంచెం ఫలాలనే ఇస్తవి. ఏలేవారు ప్రజల్ని భయపెట్టేస్తారు. బ్రాహ్మణులనబడే వారుకూడ చివరకు వ్యాపారం చేయాలని చూస్తారు. దేవుడు అక్కర్లేదెవరికీ: వర్ణాశ్రమాలనే పేరుతో ఉన్న ధర్మ గుణాలు వదలిపెట్టి శరీరరక్షణ ఒక్కటే ప్రధానంగా మనుతారు. మనసుకదా పుణ్యానికీ పాపానికీ ప్రధానమైంది. దాని స్థితిని గమనింపకుండా పుణ్యపాపాలే లేవు పొమ్మంటారు; వానలు సరిగా కాలానికికురువవు. క్రయ విక్రయాల్లో కపటమే ఆక్రమించుకొంటుంది. పాపం చేస్తున్న వాళ్ళకు దుర్గతి కలుగుతుంది. వాళ్ళు సాధుచరితులైనా అప్పటి వరకూ, పాపం చేయడంచేత రోగాలతో బాధపడుతారు. పాపులె, తాము చేసే క్రొత్త పాపపు పనులద్వారా రోగం లేకుండాచేసికొనుటం డబ్బు సంపాదింపగలగటం వీటిని కర్మ ఫలాలుగాపొంది కర్మసాగించరంద్వారా ధన వంతులవుతారు. ఎక్కువ ఆరోగ్యంగా కనపడుతారు.

ఆరు నెలలకు వచ్చే పంటలు మూడు నెలలకె వస్తవి. స్త్రీయే ప్రతి మగ వాడికీ చుట్టం అవుతుంది. పితృదైవ కార్యాల్లో ఏదిపడితె అది తింటారు.

మాదేశంలో మేములాగా చేస్తాము అని చెప్పుకొంటారు. హేతువాదంచేసి, వేదాలు ఋషిపురుషులూ చెప్పినవి అలాగే ఉంటాయి — పాటించనక్కర్లేదం టారు. వ్రతాలు యజ్ఞాలు వదిలేస్తారు.

విప్రులయినవాళ్ళుకూడ తత్త్వవిషయం వదలి వేస్తారు. జనులు స్త్రీ లోలురై దీనబంధు జనుల ధనాలన్నీ అపహరిస్తున్నవారై సుహృజ్జన మాతా పితృ హంతకులవుతారు. ఏది చేదామనితోస్తే ఆ పనిని చేసేస్తారు. అది చూసి జనులు వారికి భజన చేస్తారు. వాళ్ళను ఈ విప్రులు ఆశ్రయించి డబ్బును అర్థించి తిట్లు తింటూ సంపాదిస్తారు.

రాజ్యం చేసేవారు, మంచిగా ఉండేవాళ్ళ దగ్గరనే — పశువులనీ, ఇతరా లనీ, స్త్రీధన క్షేత్రాలనీ హరించి, పరస్పర యుద్ధాలు చేస్తూ ఉంటారు. విశ్వంలోని ప్రాణులు నశించేటట్లుగా మారణ యుద్ధాలు చేస్తారు.

సుతుడవమానించు జనకు
బతినవమానించు భార్య పడతులు బతుకున్
మతినొండొరులపుల మెచ్చక
సతతము జరియింతు రిష్ట సంచారములన్

భూమి అంతా కూడ ఇలా దుష్టులచేత ఆక్రమింపబడినదౌతుంది. పద హారేళ్ళకే జనులు చచ్చిపోతుంటారు. ఏడేళ్ళపిల్లకే సంతానం కలుగుతుంది. డబ్బు ఎవరివద్దా నిలువదు. అందుకని దాతలు ఉండనే ఉండరు. ఒకళ్ళ నుండి ఇంకొకరు దొంగిలించుకుంటూ ఉంటారు. పాపం చేయడమే ఎల్ల ప్పుడూ వారి పని, ఎందుకంటె పరులను పీడిస్తేగాని తన స్వార్థం గడవదు గదా. అందుచేత పాపాయపర పీడనం అని పాపం చేయడమవుతుంది. అన్న విక్రయం, వేదవిక్రయం నడుస్తుంటుంది. స్త్రీలు డబ్బుకోసమే యోని గలవారవుతారు.

శూద్రులు అయినవారు ఒకరు వదిమందిని చంపుతూ విజృంభిస్తారు. పాపులయినవారు పాపులయిపోగా మిగిలిన మంచివారు ఈ బాధ భరించలేక పారిపోతారు. శ్రుతి ధర్మాలు వలరీత్యా బ్రాహ్మణులకు తెలియనే తెలియవు.

వాటిని శూద్రజన్మలే చెప్తుంటారు. విపరీత భావనలను అవే నిజమని సర్వులూ వాటినే అనుసరించి పాపకర్ములయిపోతారు.

దుస్త్రీవిహారము, మద్యపానము బాగా వెల్లుతుంటుంది. దేవతా యతనాలూ జగతీసురావసాథాలూ, పావనాశ్రమ భూములూ-ఎంతో పవిత్రంగా ఉండే వన్నీ పాడయిపోతవి. గురుశిష్యులకు అంతర్యముండదు.

నగరాలు, పట్నాలు నాశనమవుతయి. జనులు కొండల్లోకి కోనల్లోకి పోతారు."

ఈస్థితి ఇంకా వస్తుందో లేక ఇప్పటికె రావటం అయిపోయిందో చెప్పటం కష్టం. ఇదిచూచి ప్రతి వ్యవహారంలోని అంతరాంతరాలనూ చర్చించుకొంటూ ఉండటం తప్ప ఇంకేం చేయలేము.

కల్కి-వచ్చి రక్షిస్తాడని కూడ మార్కండేయుడు చెప్పాడు. ఏది రక్షిస్తాడు. మనం చేసే పనులన్నీ మనను చేయనీయకుండా చేసి ఏవో క్రొత్త శాసనాలు చేస్తాడా? అయితే అప్పుడు మనకు సుఖం ఎలా ఉంటుందో ఏమోననిపిస్తుంది. పూర్తిగా సంహరిస్తే చింతలేదు అనుమానంలో పెట్టి అండర్ ట్రయల్లో ఉంచినట్లయితే మనలాటి వాళ్ళవని కష్టమేననిపిస్తుంది. కాని ఒకటి చెప్పారు. ఆ కల్కి-వస్తె ఆరోగ్యం సౌఖ్యం సమధికముగ కలుగుతుంది. అది ఆశించవచ్చు. అది ప్రస్తుతం ప్రపంచంలో అధిగమించినట్లె ఉంది. మరి కల్కి- పుట్టాడేమో తెలీదు. పుట్టకపోతే దుఃఖ భూయిష్టమైన ఈ కలికాలం ఎప్పుడు మారాలో అర్థం కావట్లేదు.

మార్కండేయుడు ఈ విధమంతా చెప్పి ధర్మరాజుతో "పూర్వం వచ్చిన ప్రళయం సంగతిని అడిగావు రాబోయే కలి యుగంలో ఎలా ప్రవర్తన ఉంటుందో అడిగావు. నీకు కావలసింది కర్తవ్యం. ఇప్పుడేమి చేయాలనేది : అది నేను చెప్తాను విను —

ధరణీ సురులను అంటే, ఈ భూమిలో మంచి మనసు గలవారిని తెలిసి కొని వారికి ప్రియము చేయవలసింది. విప్రులు సంతుష్టి నంది నట్లయితే — మంచిమనసులు సంతృప్తి చేయడానికయిన పనులవలన అశేషమైన పుణ్యం కలుగుతుంది. అంతేకాదు. సకల భూతాల యందున్నూ నదయాత్మదవు

కావలసింది. ప్రజల్ని నీ బిడ్డలవలె ప్రేమించు. పూర్వం నుంచీ ధర్మంగా ఆచరింపబడుతూ ఉన్నదేదో దానినే ధర్మంగా భావించి నడుపు. ఏదైనా స్వార్థం కారణంగా పాపం జరిగినట్లయితే నిరసించి ప్రతీకారశాలివి కావల సింది." అంటాడు.

ఈ బోధలో కృతయుగం నుంచి మళ్ళీ కృతయుగం వచ్చే వరకూ సుఖ సంతోషాలూ పుణ్యాలూ తరిగి పోతూ పాపం, దుఃఖం ప్రజల్లో ఎక్కువ కావడం అనే విషయం ఖండితంగా చెప్పారు. మళ్ళీ సుఖ సంతోషాలు కల గాలంటే మళ్లీ పూర్వకాలంలో లాగా తపో దాన యజ్ఞాలు వృద్ధి పొందినవై స్వార్థపర పూర్వకమైన పాపం తగ్గాలి అని చెప్పడమిది : మనకయినా తెలు స్తూనే ఉంది–ప్రపంచంలో ప్రతి ఒక్కరూ ఇతర్ల సంగతి వినక, పట్టించు కొనక, తమ స్వార్థం కోసమె కర్మలు – బ్లాకు మార్కెటింగు – లంచాలు తీసికొనటం వంటివి చేయడం వల్లనె ఈ ధరలు పెరిగి, పనులుగాక సమాజ మొత్తానికి దుఃఖం కలుగుతూ ఉంటున్నదని : ఇది పోవాలంటే వ్యక్తి మారినవాడై స్వార్థం తగ్గించుకొని పరార్థం కోసం బ్రతకాలి. ఈ అర్థం కోసమే మార్కండేయుడు ధర్మరాజుకు బోధ చేశాడు. చివరకు, నీబిడ్డలకు నీ స్వార్థం వదలుకొని ఎలా పోషణ చేస్తావో అలా ప్రజలను చూచుకొన వలసిందన్నాడు.

విప్రుల అన్నప్పుడు బ్రాహ్మణ కులంలో పుట్టిన ప్రతివానిని విప్రుడుగా భావించ వలసిందన్న అర్థం ఉన్నదా : లేదా ? అనే శంక రావటం తథ్యం. అప్పటి పరిస్థితిలో ఆయా వర్ణాలలో పుట్టినవారు తమ ధర్మాలంటూ కొన్నిటిని పట్టుకొని ఆ ప్రకారం చేస్తున్న వారున్నారు. వారిలో బ్రాహ్మణులనబడేవారు తపో దాన యజ్ఞాలు చేస్తూండేవారు. వారిని ఆదరింపవలసిందని మార్కం డేయుడు అప్పుడు చెప్పటంలో ఏలాంటి కులాభిమానంగాని దురభిమానంగాని లేదనిపిస్తుంది. అది అప్పటి పరిస్థితికి తగిన సలహా.

ఐతే మరి ఇప్పుడు ఆ సలహా పనికి రాదా అనవచ్చు. మంచి అయిన వాళ్లెవరు అంటే – పూర్వం నడిచిన ప్రవర్తనలు మంచివని అలా నడుచు కొంటున్న వాళ్లెవరో వాళ్ళు విప్రులని అర్థం చేసికోవాల్సి ఉంటుంది. విద్యార్థులంతా ఆసనశుద్ధిగా భాసీపెట్టు వేసికొని కూర్చొనాలి అని నియమం,

ఇప్పుడు కుర్చీల మీద కూర్చునేవాళ్ళుకూడ ఖాసీపెట్టుతో కూర్చోవాలని ఎలా చెప్పమో ఇదీ అంతే. సూక్ష్మ రీతిలో కాళలంగా ఈ పూర్వ రచనల సర్థం చేసికోవాలి.

## 7. కల్కి–జయము

కలియుగాంతం ఎలా అవుతుందనే కథను మార్కండేయుడు చెప్తున్నాడు. శంబళ గ్రామంలో విష్ణుయశుడనే పేరుతో భగవంతుడే అవతరించి ఊహా మాత్రంచేత వేద శాస్త్రాలన్ను, విశేషాలనూ ఎరిగినవాడై సార్వభౌముడవుతాడు. అధర్మ పర్తనులైన వారిని జయించి, చంపి వేసి ధర్మాన్ని నిలుపుతాడు. భూమి అంతా బ్రాహ్మణ ధనంగా చేసి భాగించి ఇస్తాడట. ధర్మాన్నీ, యశస్సునూ గడించిన వాడై వార్ధక్యంలో తపోవనంలో వసించుతాడట. అతడు ఒకానొక ధర్మాన్ని ప్రతిష్ఠిస్తాడట, దాని ప్రకారం బ్రాహ్మణాది పర్ణాలు సమర్యాదంబులై పర్తింపగలవట. అప్పటి నుండి కృత యుగం ప్రారంభ మవుతుందట.

అప్పటి నుండి –

ఆరామ వ్రజ చైత్య సద్మ వన దేవాగార సౌమ్యంబులై
భూరి బ్రహ్మ తప స్విసంకులములై పుణ్యా ధ్వరారంభ సం
భారో దారములై నితాంత ఫలిత భ్రాజిష్ణు సస్యంబులై
యారూఢ స్థితి నెల్లదేశమును నొప్పారుం బ్రకాశంబుగన్.

అన్ని దేశాలలో కూడ పైవిధంగా సస్య శ్యామలమైన సంపద, బ్రహ్మ తత్త్వ విషయక తపసులు ఉంటవట.

ఈ మాట వినంగానే మనం అప్పుడు ఉండి ఆపరిస్థితిని చూస్తామా అనిపిస్తుంది. ఒకవేళ అప్పుడు మనం – లేదా మన పుత్ర పౌత్రులు – బ్రతికి ఉన్నా ఈ కల్కి ఖడ్గంతో తెగిపోయే వాళ్ళ క్రిందికి వస్తామా లేక ఆయన అనుయాయుల క్రిందకు వస్తామా అనే ఊహ కలత పరచటం సహజం.

పూవు కాయగా మారేటప్పుడు ఆ కాయ ఎలా ఎలా తయారై ఎంత రస పూర్ణంగా ఎంత మార్దవంగా ఉంటుందో ననే ఊహ పూవునకు వచ్చిందను

కొందాం. దానిని బయట నుంచి మనం గమనిస్తుంటాం. అది అలా అను కొంటూనే దాని మొదట్లో తనలోనే కాయకు అనువైన పిండెను తయారు చేస్తుంది. అది తయారు కావడ మేమిటి తను కృశించి వాడి వత్తయై ఒరిగి పోవడ మేమిటి - అలా అయిపోతుంది. కాయగా అయే క్షణాన పూవూ ఉండదు. పూవుచేసిన ఊహలూ ఉండవు. అలాగే కల్కి వస్తాడు అధర్మాన్ని నశింప చేస్తాడు, ధర్మం నిలబెట్టుతాడు అన్నప్పుడు – ఎలా ఈపని చేస్తాడు. ధర్మం అనే దానిలో నమ్మకం లేని నన్ను లేదా నాలాంటి వాళ్ళ నందర్నీ కత్తితో తరిగేస్తాడా అని అనుకొంటం కద్దు! కత్తి లేక పోవచ్చు తరిగి వేయటమూ లేక పోవచ్చు. అనుగ్రహం కారణంగా ఉన్న అందరి మను ష్యుల హృదయాల్లో ధర్మమేదో దానినే వికసింప చేయటం జరుగ వచ్చు. ఇప్పుడు ధర్మం అనే మాటనే కంటగించుకొని అది ఫలానా కులాల వాళ్ళదే గాని లేదా ముసలివాళ్ళదేగాని మాది కాదనే ఇరుకు ఊహలో పడినవాళ్ళంతా వికాసాన్ని పొంది ధర్మమే మనసుల్లో వికసింప జేసికొన్న వాళ్ళు కావచ్చు. అప్పుడు వారే అధినేతలై కల్కి ఆదేశాల ప్రకారం దేశాచారాలను ప్రవర్తింప జేసి, సర్వులూ విప్రులకయిన తత్త్వ విషయాన్నే ప్రతిపాదిస్తూ కృతయుగం లోలా ఉండిపోతారనటం సబబని పిస్తుంది.

ధర్మం ఏకపాదం మాత్రమే అయి, అధర్మం దానికి మూడురెట్లయిఉన్న స్థితిలో అధర్మ పరులను నశింప జేస్తాడనే మాటను యథాతథంగా వాక్యార్థం చెప్పినట్లయితే ప్రజల్లో మూడు భాగాలను చంపి వేయబోతున్నాడనే అర్థం చెప్పాలి. అలా చెప్పినా కులాల ప్రకారం విభాగించి ఒక కులాన్ని నిలిపి మిగతా వారిని చంపుతాడనే అర్థం చెప్పేవీలే లేదు. ధర్మాన్ని మనసులో కలిగినవారిని రక్షించి, అధర్మాన్ని ప్రధానం చేసిన వారిని చంపి వేస్తాడనే పైన చెప్పిన అర్థం. చంపి వేయడమంటే శరీరాలను చంపడం కాదేమోనని పిస్తుంది. వారికిగల అధర్మమైన మనసును మార్చి వేస్తాడు, పువ్వే కాయగా మార్చినట్టు. ఇదీ దాని ప్రక్రియ అనిపిస్తుంది. అలా కాకపోతే మూడు వంతులు అధర్మం ఉంటుంది కనక మూడు వంతుల జనాభాను నాశనం చేస్తా డన్నప్పుడు న్యూక్లియరు వార్ తెస్తాడని చెప్పాల్సి వస్తుంది. అలా చెప్తే 3 వంతుల భూభాగం నాశనమవుతుంది గాని, మొత్తం భూభాగ ములో ఉండే మూడు వంతుల అధర్మాన్ని పాటించేవారే చచ్చి మిగతా వాళ్లు

బ్రతుకుతారనే ఆశ లేదు. మిగిలిన నాల్గవ పాలు భూభాగంలో కూడా మళ్ళీ 3 వంతులు అధర్మం వారు ఉంటారు కదా !

ఇదంతా ఎందుకు చెప్పటమంటే యుద్ధం తెచ్చి శారీరికంగా కొందర్నిచంపి ధ్వజ మెత్తటం కాదు కల్కి చేయబోయేది అనిపిస్తుంది. దుష్ట మనసుల్ని చంపుతాడు. ఇదెలా చేస్తాడని మళ్ళీ శంక ! బోధ వల్ల కావచ్చు ! కాని ఇంకొకడు చెప్పేది విన్నప్పుడు కదా బోధ అనేది ఫలించేది ! అది లేకనే గదా మన ఉపనిషత్తులు, శాస్త్రాలు చెప్పేది ఎవరికీ తెలియకపోవటం ! ఇది ఇప్పటి పరిస్థితి ! మరి — అప్పుడు అంటే కల్కి వచ్చి ధ్వజమెత్తినపుడు. అందుకు తగిన మనసులు మారి సక్రమమవుతవి కావచ్చు. మహానుభావులను కలిసిన తరువాత ఎంతమంది తమ పూర్వ పద్ధతిని మార్చుకొనలేదు ? బుద్ధుడు చెప్పిన మంచిని గ్రహించిన వారు అప్పట్లో ఎందరు లేరు ! శంకరాచార్యుని సందేశాన్ని గ్రహించిన వారు ఎంతమంది తిరిగి సనాతనంలోకి మారలేదు ? బుద్ధి మార్పు, మనసు మార్పు ఇది క్షణికము. అనుగ్రహం ఉంటే మార్పు రావటం ఎంతలోకి !

ఈ కలియుగాంత గాథను ఇలా అర్థం చేసుకొనడానికే వీలుగాని - ఒకానొక వ్యక్తికిగల బలిష్టమైన శరీర కారణంగా మొత్తం ప్రపంచ జనాభాలో మూడు వంతులుగా నున్న అధర్మపరులను ఏరి వాళ్ళను కత్తితో చంపేస్తాడనే దానిని ఎలా నమ్మడం ! ముసోలినీ, హిట్లరు మొదలైనవారు ఏం చేశారు గనక !

ఇంత ఆలోచింపక భారత వచనం పట్టి పోచికోలు అనే జనులు సోమరులనిపిస్తుంది. తాము ఆలోచింపక పోవడమే తమ 'నిరసన భావనహే' వారిని అధర్ములుగా భావించుకోడానికి దోవ ఇస్తుందేమో ననిపిస్తుంది.

ఏదయినా ఈ సంగతిని తిరిగి తిరిగి ప్రతి వ్యక్తీ ఆలోచించి తెలియడానికి ప్రయత్నించడం, సరియైన దోవలో పయనించడం ఎలాగో ఎరుగవలసి యున్నది.

# 8. బ్రాహ్మ శక్తి

ఖనిత్రరాజు కలియుగాంత కథలో బ్రాహ్మణులకు ప్రియము చేయడం సంగతి విని, బ్రాహ్మణ ప్రభావం చెప్పమని అడుగుతాడు. అందుకు ఒక పూర్వ కథ సుదీర్ఘంగా చెప్పాడు మార్కండేయుడు. సంక్షిప్తంగా ఆ కథ ఏమంటే, —

“పరీక్షిత్తు అనే రాజు అయోధ్య నేలుతూ ఒకసారి ఒకవనానికి వేటకయి వెళ్ళి తిరిగి తిరిగి అక్కడ ఒంటరిగా పూలు కోసుకొంటూ ఉండే జవ్వనిని చూచి పలుకరిస్తాడు ఎవ్వరి దానవని. “మానాన్న నన్ను పంపితె ఇక్కడకు సరియైన వరుణ్ణి ఎన్నుకోటానికి వచ్చాను. ఇప్పుడు చెప్పు నేనెవరి దాననో” అంటుంది. ఈ పరీక్షిత్తు కామం చేత చిత్తయిపోయి తానే ఆమెను తన దానిగా చేసికొంటా నంటాడు. ఆమె మాత్రం నన్ను జల విహారానికి రమ్మనకుండా ఉంటేనే నిన్ను వరిస్తాను అంటుంది. అందుకు అతడు ఒప్పుకొని ఆమెను తన పట్నానికి తీసికొని పోతాడు.

తర్వాత కొన్ని రోజులకు ఉద్యానవనంలో విహరిస్తూ రాజు నీటిలో దిగి స్నానం చేస్తూ ఈమెను రావలసిందంటాడు. వరించడం అయి పోయింది గదా ఆమె ఇష్టంమీద జల విహారం చేస్తే మాత్రం ఏమయిందనుకొన్నాడు పాపం! కాని ఆమె అందులో దిగంగానే మునిగి మాయమయింది. రాజు నీళ్ళన్నీ తోడించి వెదికిస్తాడు. చాలకప్పలు బయటపడతవిగాని ఆమె కన్పడదు. చివరకు కప్పలే ఆమెను మ్రింగినవని, ఎక్కడెక్కడి జలాశయాల్లోని కప్పల్నీ కూడ పట్టి చంపిస్తాడు.

అప్పుడు మండూకరాజు ఒక ముని రూపంలోవచ్చి తానే మండూకరాజనీ తన కూతురు సుశోభనే అనేదే పరీక్షిత్తును అలా మాయపుచ్చి వెళ్ళిపోయిందనీ నిజంచెప్పి, తన కూతురును పిలిచి, తిట్టి, రాజునకు ఇచ్చి నీవిలాంటి చెడ్డపని చేశావుకనుక నీ కుమారులు కపటవర్తనులవుతారుగాక అన్నాడు.

ఈ శాపంవల్ల ఆమె కుమారులయిన శలుడు, దలుడు, బలుడు అనే వాళ్ళు కపటవర్తనులయినారు. శలుడు రాజై వేటకని అరణ్యానికి వెళ్ళి ఒక మృగాన్ని కొట్టాడు. ఆ మృగం ఎంతో త్వరగా పరుగెత్తిపోతోంది;

కలుడు తనగుఱ్ఱాలను దాంతో సమానంగా పరుగెత్తించలేకపోయినాడు. అప్పుడు వాని సూతుడు వామ్యములనే గుఱ్ఱాలుతప్ప వేరే ఆ మృగాన్ని పట్టుకో కలిగిన గుఱ్ఱాలు లేవనీ ఆవామ్యములు వామదేవుడనే బ్రాహ్మణుని ఆశ్రమంలో ఉంటవనీ చెప్తాడు. కలుడు నేరుగా వామదేవుని ఆశ్రమానికి వెళ్ళి ఆ మునీశ్వరుని ఆ హయాలను తనకు అరువిమ్మనీ ఆ మృగాన్ని కొట్టి తెచ్చి తిరిగి ఆ హయాలను ఇచ్చేస్తాననీ చెప్పి ఆ ఒప్పందం మీద ఆ గుఱ్ఱాల్ని పట్టుకుపోతాడు. ఆ మృగాన్ని జయించి తెస్తాడు. కాని ఆ గుఱ్ఱాల్ని మాత్రం తిరిగి ఆ వామదేవమునికి ఈయలేదు.

ఒక నెలయిం తర్వాత, వామదేవుడు "ఆ కలుడు మన గుఱ్ఱాలు తనంత తానుగా ఇవ్వలేదుగనక నీవు వెళ్ళి అడిగి తీసికొని రమ్మ"ని ఒక శిష్యుని పంపుతాడు. ఆ శిష్యుడు వెళ్ళి కలుడికి ఎన్నో చెప్తాడు. పరధనాపహరణము పాపమంటాడు. కాని కలుడు విప్రుడయిన మీ గురువుకు ఇవెందుకయ్యా? కావాలంటే రెండు మంచి ఎడ్లనిస్తాను తీసికొనిపొమ్మంటాడు. ఇదంతా విని వామదేవుడే వచ్చి అడుగుతాడు. అందుకు కలుడు కోపించి ఆ తపస్విని శూలాలతో పొడిచి చంపండని ఉత్తరువునిస్తాడు. వామదేవుడు కోపంతో చూడంగానే కొందరు రాక్షసులు పుట్టి ఆకలుడ్ని సంహరిస్తారు. వామదేవుడు అప్పటికి అది చాలునని వెళ్ళిపోతాడు.

కాని దలుడు పట్టం కట్టుకోగానేవచ్చి ఆతడ్ని ఆ గుర్రాలను తనకు తిరిగి ఇచ్చివేయమని అడుగుతాడు. దలుడు మహా కోపం తెచ్చుకొని ఒకబాణం తీసి ఆ మునిని చంపడానికి వదులుతాడు. కాని ఆ బాణంవల్ల నీ కుమారుడే చస్తాడుగాక అని వామదేవుడు శపిస్తాడు. అంతె. అంతఃపుర కాంతలు ఏడుస్తూ వచ్చి పిల్లవానికి బాణం తగిలి చనిపోయాడంటూ చెప్తారు. దలుడు ఈ పిల్లవాడు చావడానికి కారణం ఈ బ్రాహ్మణుని శాపం గనక ఈ బ్రాహ్మణుని చంపేస్తాను అని ఇంకో భాణం తీస్తాడు. కాని వెంటనే అతడి చేతులు స్తంభించి పోతవి. కదలలేకపోతవి. అప్పుడు ఆ రాజు ఆశ్చర్యపడిపోతాడు. బ్రాహ్మణశక్తే ఎక్కువ: నా శక్తి ఎందుకూ పనికి రాదు కనుక ఆయన్నే ఆశ్రయిస్తున్నానని అంటాడు.

వామదేవుడు అనుగ్రహిస్తాడు. స్తంభించిన రాజు చేతులు స్వాధీనమవుతవి. రాజు వామదేవుని శరణుజొచ్చి ఆ హయాలను తెప్పించి ఇచ్చి బ్రాహ్మణ ప్రభావాన్ని మెచ్చుకొంటాడు.

ఈ బ్రాహ్మణ ప్రభావం బ్రాహ్మణ జన్మలనబడే అందరికీ ఉండదుగాక. అది సంపాదించినవారు బ్రాహ్మణులు. అనగా బ్రహ్మ పదార్థ తత్త్వ విషయాన్ని పరిశోధించి ధర్మం, తపం యజ్ఞం నడిపినవారనేది ముఖ్యమైన విషయం, అలా వచ్చినవారి శక్తినే బ్రాహ్మణశక్తి అంటాము.

## 9. ఇంద్రద్యుమ్నుని కథ

మార్కండేయుని కల్పాంతంలోని విషయాలు తను స్వయంగా చూచి అనుభూతిచేసినవన్నీ చెప్పగానే ధర్మరాజుకు ఆశ్చర్యమయిపోతుంది. ఈయన ఎంతటి వృద్ధుడు-అనుకొంటాడు. ఆ మీదట ఈయనకంటె వృద్ధులయినవాళ్ళు ఉంటారా అని అనుమానం కలుగుతుంది. ఆ మాటను ఆయన్నే అడిగేస్తాడు.

చిత్రమైన విషయమేమంటే మార్కండేయుడు ప్రళయకాలంలో వటపత్రశాయి ఎదుటనున్నవాడు, ఆ వటపత్రశాయి నోట్లోంచీ లోపలకువెళ్ళి నూరు సంవత్సరాలు లోపల విహరించి తిరిగి బయటకు వచ్చినట్లు చెప్పాడు అప్పుడు తన మొదటి శరీరంకూడ ఆయన నోట్లోంచి లోపలకు వెళ్ళిందని గాని వెళ్ళలేదనిగాని చెప్పలేదు. శరీరం వదలినా తాను "తాను"గా అనుభూతి చెందుతూ నూరేళ్ళు ఉండి తిరిగివచ్చి తాను మార్కండేయుడేననే గట్టి అనుభూతిని ఆయన పొందినాడనిపిస్తుంది, ఇక వృద్ధత్వం ఎవరికి? ఆయన శరీరానికా ? ఆయనకా? ఆయనకు ఎప్పుడూ తాను మార్కండేయుడేననే గట్టి అనుభూతి అనుగ్రహింపబడింది. ఈ అనుభూతి లేకపోయినట్లయితె ఆయన శరీరం చచ్చిపోయి, మనసు మరచిపోయి, బుద్ధి స్మృతిలేక తాను క్రొత్తగా ఎవరోననే అనుభూతి పట్టుకునేది. ధర్మరాజు నీకంటె వృద్ధులెవరు అనేటప్పటికి, మార్కండేయుడు ఈ రహస్యాన్ని తెలియజేస్తూ స్వర్గంలో ఉండే ఇంద్రద్యుమ్నుని కథ చెప్తాడు. స్వర్గంలో ఉన్నవాళ్లుకూడ కొన్ని పరిస్థితుల్లో ఇక్కడ ఉన్నవాళ్ళల్లో వృద్ధులేనని చెప్పటమా ఇది. వారి శరీరాలు నశించినా వారి మనోబుద్ధులు ఇంకా నశించక ఆత్మతోపాటు వికాసమై ఉంటవికదా అనటమా?

ఇంద్రద్యుమ్నుడు అనే రాజు ఇంద్రుడిపద్ద చాల కాలం ఉంటుండంగా భూలోకంలో వాని కీర్తి తగ్గిపోయినదై ఎవరు వానిని గూర్చి చెప్పకొంటు న్నారో తెలియలేదు. ఆకారణంచేత దేవతలు ఈయనను ఇకనీవు స్వర్గంలో ఉండటానికి వీల్లేదుకనుక వెళ్లిపోవలసిందనీ, నిన్నుగూర్చి ఇంకా భూ లోకంలో ఎవరయినా చెప్పకొంటుంటే అప్పడే ఈ దేవలోకంలో నీవు సుఖాలను పొందుతూ ఉండతగుదువనీ అంటారు.

అందుకు ఆ ఇంద్రద్యుమ్నుడు భూలోకానికివచ్చి మార్కండేయుని అడుగుతాడు– ఇంద్రద్యుమ్నుడయిన నన్ను ఎరుగుదువా అని. అప్పుడు మార్కండేయుడు తనకు తెలియదనీ తనకంటె వృద్ధుడయిన ప్రావారకర్ణు డనే ఒక గుడ్లగూబ ఉన్నదనీ అక్కడకువెళ్లి ఆ గుడ్లగూబనడుగమని చెప్తాడు. అప్పుడు ఇంద్రద్యుమ్నుడు తానొక గుర్రమై ఈ మార్కండేయుని తనపై ఎక్కించుకొనివెళ్ళి ఆ గుడ్లగూబనడుగుతాడు తనను ఎరిగియున్నాడా అని. ఆ నకులము, తనకు సరిగా తెలియదనీ తనకంటె పెద్ద అయిన ఒక నాడీక జంఘుడనే కొంగ ఉన్నాడనీ వానిని అడుగవలసిందనీ సలహాయిస్తుంది. కాని ఇంద్రద్యుమ్నుడు మార్కండేయునితోపాటు ఆ నకులాన్ని కూడమోసి కొని నాడీజంఘుని పద్దకు వచ్చి అడుగుతాడు. నాడీజంఘుడు కూడ సందే హం వెలిబుచ్చి తనకంటె పెద్ద అయిన "అకూపారుడు" అనే ఒక తాబే లుందని చెప్పి అక్కడి మడువులోనున్న ఆ తాబేటిని పిలుస్తాడు. ఆ తాబే లును "ఇంద్రద్యుమ్నుడనే రాజునెరుగుదువా" అని అడుగుతారు.

అందుకా కచ్ఛపము తలచి తలచి కన్నీరు పెట్టుకొని, "అయ్యో! ఆయన్ను ఎటుగక పోవడమేమి ఆయన మహా గుణభూషణుడు. మాకు కలి గిన అనేక కష్టాలను తొలగించినవాడు" అని చెప్తుంది, వెంటనే దేవతలు విమానంతో వచ్చి ఇంద్రద్యుమ్నుని స్వర్గానికి తీసుకొనిపోతాం రమ్మం" టారు. ఆ ఇంద్రద్యుమ్నుడు వారిని కొంచెం ఆగుమని, ఆనకులాన్నీ మార్కండేయునీ వారి వారి స్థలాలకు తీసికొనిపోయి వదలిపెచ్చి దేవయా నంలో స్వర్గానికి వెళ్ళిపోతాడు.

ఈ కథలో విశేషం ఏమంటే మార్కండేయుడు తనకంటె వృద్ధులను ముగ్గురనుచెప్పి, ఇంద్రద్యుమ్నుడనేవాడు స్వర్గానికిపోయి ఇంకా ఉన్నాడనే

మాట చెప్పటం విశేషవిషయం. అందరికంటె వృద్ధుడు 'నేను, అనే వాదే సనేది ఊహించాలి బహుశ. శరీర మార్పులకు ప్రాధాన్యత నివ్వాల్సిన అవసరం లేదని బోధ. అలాకాకపోతే ధర్మరాజంతవానికి మార్కండేయు డంత మహాముని చనిపోయిన ఇంద్రద్యుమ్నుడు వృద్ధుడు అని ఎందుకు చెప్తాడు.

ధర్మరాజుకు సరిగానె అర్థమై ఉంటుంది.

## 10. ధుంధుమారుని కథ

ధర్మరాజు మార్కండేయుని అడుగుతాడు— మనుష్యుడైన కువలాశ్వ దనే ఇక్ష్వాకుడు ధుంధుమారుడెలా అయినాడు? రాక్షసుడైన ధుంధుణ్నెలా చంపకలిగాడు? అని.

మార్కండేయుడు చెప్తున్నాడు. ధుంధుడు మధుకైటభుల కుమారుడు బ్రహ్మరాక్షసుడు. ఇక్ష్వాకులు త్రేతాయుగంవారు. వారిలో 11వ తరంవాడు కువలాశ్వుడు.

ఉదంకుడనే ముని ఆశ్రమానికి దగ్గరున్న ఒకదీవిలో సముద్రంలో పడు కొని ఉండేవాడు ధుంధుడు కృతయుగ కాలమంతా! సంవత్సరాని కొకసారి శ్వాస విడుస్తాడు. ఆ శ్వాసతో ధూమం అగ్ని దుమ్ము వాయువూరేగి సంక టాన్ని దేశాలకు కలుగజేయటం ఆరంభించింది. ఇతడు దేవదానవ గంధర్వు లకు అజేయుడు.

ఈశ్వరుడు ఒకసారి ఆ ఉదంకునికు ప్రత్యక్షమై ఈ ధుంధుణ్ని చంపే ఉపాయం చేయుమంటాడు. ఎలాగంటె ఇక్ష్వాకువంశంలోని కువలాశ్వుని ఆశీర్వదించి అతడి కుమారులయిన 21,600 మందితో ఈ ధుంధుణ్ణి అతడు చంపేట్లు చేయవలసిందంటాడు. ఆ ఆజ్ఞను పాటించి ఉదంకుడు కువలాశ్వుని తండ్రియైన బృహదశ్వుని కలిసి ఏవాట్లాడి కువలాశ్వుని ప్రేరే పింపుతాడు. కువలాశ్వుడు ధుంధునితో పెద్ద యుద్ధంచేస్తాడు. కాని వాని కుమారులంతా చస్తారు, ముగ్గురుమాత్రం మిగిలినారట. మనం రోజు ఒక్కొం టికి 21,600 సార్లు శ్వాస పీలుస్తాము. మిగిలిన పుత్రులు ఎవరోమరి! రోజుకు

21,600 శ్వాసలు వచ్చినప్పై ఇడ, పింగళ, సుషుమ్నా నాడీ శ్వాసలు మాత్రం మిగిలినవి కావలె. ఇది ఏదో అంతరార్థాన్ని తెలియజెప్పేకథ అని పిస్తుంది. కువలాశ్వుడు అందుకె దుంధుమారుడని మునులచేత పిలువబడి నాడట!

ఈ కథ అయిన తరువాత ధర్మరాజు మధుకైటభుల కథ చెప్పవలసిన దని మార్కండేయముని నడుగుతాడు. ఆయన చెప్తాడు.

## 11. మధుకైటభులకథ

జగత్త్రియాలు ఏకార్ణవమై యుండంగా హరి ఒక్కడే మహార్ణవంమీద యోగనిద్రలో ఉంటాడు. ఆయన నాభికమలంలో బ్రహ్మ కూర్చొని ఉంటాడు. బ్రహ్మ అంటే ఇక్కడ కేవలం పదార్థం అని అర్థం చేసి కొనవచ్చు. విష్ణు "నేను" అనే శాశ్వతుడు. ఆ "నేను" యోగ నిద్రనుంచి లేచి బ్రహ్మకు చైతన్యమిస్తే అప్పుడు వ్యక్తిత్వం బ్రహ్మకు కలిగేది. ఈ సమయంలో మధుకైటభులనే వారు మహా దర్పవంతులై వస్తారు. వచ్చి ఈ పదార్థ రూపంలో ఉన్న బ్రహ్మను దెబ్బలుకొట్టారు. బ్రహ్మ గోల పెట్టటం విష్ణు యోగనిద్ర వదలి ఈ మధుకైటభుల్ని చూడటం కలుగుతుంది. చూచి వారి శక్తిసంపన్నతను మెచ్చుకొని మీకు ఏ వరం కావాలో కోరు కొనవలసిందంటాడు. వాళ్ళు జవాబుగా "నీవు మాకేం వరమిస్తావు! మేము నీకంటె గొప్పవాళ్ళం మేమే నీకు వరం ఇస్తాము - నీవే కోరుకొన వలసింది" అంటారు.

వెంటనే విష్ణుమూర్తి అలా అయితే మీరు విజాయతీపరులు గనుక నాకు వరం ఇవ్వండి. ఆ వరం ఏమంటే "మీరు నాచేత చచ్చిపోయేటట్లుగా వర మివ్వండి" అంటాడు. మధుకైటభులు ఆశ్చర్యపోతారు. చిత్తయిపోతారు. కాని "అలాగే మమ్ములను చంపవలసింది కాని నీరులేనిచోటనే మమ్మలను చంపాలి అని షరతు పెట్టుతారు. అప్పుడు విష్ణు తనొక పెద్ద రూపమై తన యూరువులతో స్థలం ఆక్రమించి వాటిపై వారిద్దరనూ ఉంచి సంహరిస్తాడు. అలా రాక్షస బాధ రాబోయే ప్రపంచాలకు తొలగిస్తాడు. ఇదీ మధుకైటభుల కథ. ఇందులోకూడ అంతరార్థముండి తీరుతుంది. దాన్ని గ్రహించాలి ఆలోచించి ప్రతివాడూ!

ఇది నాల్గవ ఆశ్వాసం

# మహాభారత కథలు

## ( అరణ్య పర్వము- పంచమాశ్వాసము )

## 1. కౌశికుడు

ధర్మరాజు, శ్రీకృష్ణుడి సమక్షంలో మార్కండేయుని నాల్గు ప్రశ్నలడుగు తాడు. 1. స్త్రీ సముచితంగా ప్రవర్తించుతూ పతివ్రత-పుణ్యసతి-అని పించుకొంటున్నప్పుడు ఆమె ప్రభావం ఎలా ఉంటుంది 2. స్త్రీ పురుషులలో పుత్రుల విషయమై ఎక్కువ ఆయాసమెవరికి? 3. అలాంటి తలిదండ్రుల విషయంలో కుమారుడెలా మెలగాలి? 4. హీనయోని జాతుండైన పురుషుడు ఇలాటి నడవడి చేతపరమ ధార్మికుడై పరలోకాలను పొందగలుగుతాడా-అని.

2వ 3వ ప్రశ్నలకు మార్కండేయుడు ముందు సమాధానం చెప్తాడు.- తొమ్మిది మాసాలు తనలో భారం దాచుకొని మోసినదై ప్రాణ సంకటం కలుగుతుండగా ప్రసవించి, తల్లి పుత్రుని విషయమై ఆయాసపడుతుంది. తండ్రి పుత్రునికోసం తపాలు, యజ్ఞాలు, దానాలు, వ్రతాలు దేవతా సజ్జన సేవలూ చేస్తాడు. అందువల్ల ఇద్దర ఆయాసం ఒకటే ననాలి. ఆకారణంచేత కుమారుడు తలిదండ్రు లిద్దరకూ భక్తుడై ధర్మాను రక్తుడుగా ఉండాలి, అతడే కుమారుడు గాని మిగతావాళ్ళు సంగతేమిటి గనుక! కేవలం జన్మవల్లనే కుమాళ్ళు వాళ్ళు!!

జననియు జనకుడు నెవ్వని యనువర్తనమున బ్రియంబు నందుదు రెదద
త్తనయుడు ధర్మము గీర్తియు ననూనముగ బొందబడయు నక్షయ
గతులన్

ధర్మాను రక్తుడుగా తమ పుత్రుడు కావాలని తలిదండ్రులు కోరుకోవాలి. ముందు తామే ధర్మానురక్తులు కావాలి.

ఆ మీదట మార్కండేయుడు 1, 4 ప్రశ్నలకు సమాధానంగా కౌశికుని కథ చెప్తాడు.-ధర్మరాజు కాలం నాటికి బ్రహ్మక్షత్రియ వైశ్యశూద్రులనే మాటలు-గుణపరంగా గాక-జన్మపరంగానే వాడబడుతుండేవి అనిపిస్తుంది,

బ్రహ్మపదార్థ తత్త్వబోధకుడు జ్ఞాని అయినవాడల్లా విప్రుడనబడటల్లేదు. అందుకె ధర్మరాజు హీన యోనిజులకు ఉండవలసిన నడవడి ఏమిటి అని అడిగినాడు. మార్కండేయుడు చెప్పినకథ కౌశికునికథ:—

కౌశికుడనే ఒక బ్రాహ్మణ కులంలో జన్మించిన వాడున్నాడు. అతడు తన తలిదండ్రుల విషయం పట్టించుకొనక ఎక్కడికోపోయి ఎంతో నిష్ఠతో వేదాధ్యయనం చేస్తూ ఉంటాడు. ఒక గ్రామానికి ప్రక్కన ఉన్న చెట్టు క్రింద కూర్చొని వేదాధ్యయనం చేస్తుంటే ఆ చెట్టుపైనున్న కొంగ ఒకటి రెట్ట వేస్తుంది. అది వానిపై పడుతుంది. అతడికి కోపం వస్తుంది. పైకి చూస్తాడు. ఈయన చూపు మాత్రంతో కొంగ నిగతజీవియై క్రిందకు పడి పోతుంది.

కౌశికుని హృదయం కరిగిపోయి షోభపెట్టుతుంది. శాంతి ఉండకుండా పోతుంది. కాని ఆ కొంగ తిరిగి బ్రతుకదు.

మధ్యాహ్న మవడంచేత భిక్షాటనానికి బయలుదేరి ఒక విప్రగృహం ముందు నుంచొని "భవతీ! భిక్షాందేహి" అంటాడు. ఆ ఇంటియామె ఈయనకు భిక్షవేయడానికి ఉపక్రమించి అన్నం గిన్నెలో సద్దుతుండంగా ఎక్కడ నుంచో ఆమె భర్త వస్తాడు. ఆమె చేసే ఈ పనిని ఆపివేసి, భర్తకు కాళ్లు కడుగుకొనడానికి నీళ్ళు ఇవ్వడం భోజనం పెట్టడం పనిలో నిమగ్నమ వుతుంది. చివరకు ఆయన భోజనంచేసి విశ్రమించిన తరువాత ఆయన పాద సంవాహనం చేసి అప్పుడు తిరిగి కౌశికునకు భిక్ష కార్యక్రమానికి వస్తుంది. కౌశికునకు కోపం వస్తుంది. "భిక్ష అడగంగానే ఇంతవేసి పంపితే నేను వెళ్ళిపోయేవాణ్ణిగదా ఇంతసేపు నిలబెట్టేశావు! ఎంత నిరాదరణ! అతిశయంతో ఉన్నావే" అన్నాడు.

అప్పుడామె అంటుంది. "నాభర్తకయిన శుశ్రూషలో నిమగ్నురాల నవడం వల్ల మీసంగతి చూడలేకపోయినాను. ఇది తప్పుగా పరిగణించటం సరి కాదు"—అంటుంది. కర్మయోగరీత్యా కర్తవ్యంచేస్తేచాలు. మిగిలిన కర్మలు చేయటం చేయకపోవటం ప్రధానంకాదు అనిబోధ. అందుకు కౌశికుడు "భూసురేంద్రులయిన బ్రాహ్మణులు క్రోధాగ్నితో ఈ భూమినే కాల్చివేయ

గల శక్తిగలవారనే సంగతి తెలియదా" అంటాడు. అందుకామె "అయ్యా తెలియకేమి! ఒకానొక మహాత్ముడు సముద్రంలో నీళ్ళు త్రాగేశాడు. వాతాపిని తిని జీర్ణించుకొన్నాడు ఇంకొకాయన దండకారణ్యాన్నే తగలేశాడు— బ్రహ్మ విదులైన బ్రాహ్మణ ప్రభువులేకేమి వారి మహిమలెందుకు వినలేదు గనుక!" అంటుంది. అనగా బ్రహ్మతత్త్వాన్ని తెలిసిన బ్రాహ్మణులకే ఈ శక్తి ఉండిగాని ఇతరులకు కాదు. అని ఆమె సూచించింది. ఇంకా అంటుంది—

"నాకు పతియే పరమ దైవము. మనోవాక్కాయ కర్మల్లో ఆయననే ఆశించి భక్తి చేస్తాను. నాకు అదే ధర్మంగా మనుతుంటాను. మరొక ధర్మం దీనికి వ్యతిరేకమైంది ఏదీ నాకు లేదు. నీకోపంతో నీవు కొంగను చంపి వచ్చావనే సంగతి నాకు తెలిసింది. ఎవరి ధర్మం వారు నడపాలి. ఎవరి ఆశ్రమ ధర్మం వారిది. నేను గృహిణిని నా కర్తవ్యం ఏదయితే ఉందో అదె చేయాలి. స్వధర్మం అంటారు దాన్నే అదె నేను సమాజానికి చేయకలిగిన సేవ. తాను ఉన్న ఆశ్రమంలో ఏది సమాజానికయిన సేవా రూపంలోగల ధర్మంగా చెప్పబడిందో అదె స్వధర్మం. చేసితీరబడవలసింది. క్రోధం, మోహం రెండున్నూ వ్యక్తికి ఘోరశత్రువులు. క్రోధం సంగతి చెప్పి బ్రాహ్మణులను అవజ్ఞ చేయరాదని నన్ను జడిపించాలని చూస్తావేమి? క్రోధం మోహం రెండూ వదిలించుకొన్న బ్రాహ్మణులకి గౌరవంగాని,—ఊరికే బ్రాహ్మణ్య గౌరవం ఇవ్వాలంటే అలాటిది ఉంటుందా?" అంటుంది.

"బ్రాహ్మణుడు—సత్యం పల్కాలి, హింసా విదురుడూ కావాలి. గురుజన హితార్థి కావాలి. ఇంద్రియాలను జయించినవాడు కావాలి. సర్వులనూ తన వలె చూచుకొనగలిగి ఉండాలి. కామంలో తగుల్కొనని వాడై యుండాలి. కర్మలన్నిటిని సముచిత సంప్రయోజ్యతతో చేస్తున్నవాడు కావాలి. అలాటి పుణ్యాత్ముడు—ఎల్లప్పుడూ అమరులచేతకూడ పూజింపబడుతాడు" అంటుంది. "ఆర్జవము, శమము, అధ్యయనము అనేవి బ్రాహ్మణునకు పరమ ధనము. ధర్మగతికి అవె సాధనలు. నీవు కేవలం స్వాధ్యాయ పరుడవేగాని ధర్మసూక్ష్మమెరుగనివాడవు" అంటుంది. పైకి చెప్పబడే ధర్మం బ్రాహ్మణకులజుడు గౌరవింపబడాలి అని; కాని బ్రాహ్మణుడు ఇలా ఇలా ఉండాలి అనే ధర్మంతో కలిపి—అలాటివాడు గొప్పవాడని కీర్తించటమనేది ధర్మసూక్ష్మం అని చెప్పింది. మిగతా వారిని అవజ్ఞ చేయుమని అర్థంకాదు. ఈ సంగతి ఇంకా సూక్ష్మమయిన విషయం అనిపిస్తుంది.

కౌశికుడు మెత్తపడిపోతాడు. ఈమె శక్తి ఎంతగొప్పది అనుకొంటూ ఉంటాడు. అప్పుడామె అతడ్ని "మిథిలానగరం వెళ్ళు. అక్కడ ధర్మవ్యాధుడనే ఎఱుకలవాడుంటాడు జితేంద్రియుడు సత్యవాది. మాతాపితృ భక్తుడున్నూ నీకు అన్ని ధర్మాలూ చెప్పి నీసందేహాలేమైనా ఉంటే నివృత్తి చేస్తాడు–అంటుంది. కౌశికుడు అందుకు సన్నద్ధుడై ఆమెను ఆశీర్వదించి వెళ్ళిపోతాడు.

## 2. ధర్మవ్యాధుడు

వెళ్ళి వెళ్ళి ఆ మిథిలానగరంలో వారినీ వీరినీ అడిగి కౌశికుడు ధర్మవ్యాధుని ఇంటికి వెళ్తాడు. అక్కడ ధర్మవ్యాధుడు మాంసం కోసి ముక్కలు చేసి వాటిని విక్రయిస్తూ ఉండటం చూచి ఆశ్చర్యపోతాడు–'ఇతడిపద్దనా నేను ధర్మాలు నేర్చుకోవలసింది!" అనుకొంటాడు. అతడు చేసే దంతా హింస అని కౌశికుని నమ్మకం. ఈ నమ్మకం ధర్మవ్యాధునితో సంభాషించిన తరువాత అతడికి వదలిపోయింది. కలిగిన జుగప్సవల్ల ఆ దుకాణానికి కొంచెం దూరంలో అతడు నిలచి ఉంటాడు.

కొంచెం సేపట్లో ధర్మవ్యాధుడే, ఈ బ్రాహ్మణుడు తన కోసం వచ్చినాడన్న సంగతి నెరిగి దగ్గరకు వచ్చి నమస్కరించి ఎంతో ప్రియమొలికేటట్లుగా "అయ్యా మీకు కుశలమా ఆ పతివ్రత నాదగ్గరకు వెళ్ళవలసిందని చేప్తే వచ్చినట్లున్నారుకదా! అలా ఎందుకు వచ్చారోకూడ నాకు తెలిసింది. చాల సంతోషమైన విషయము. దయచేయండి" అని తన ఇంటికి తోడ్కొని పోతాడు. యథోచితంగా పూజిస్తాడు. ఇష్ట విషయ ప్రసంగం చేస్తారిద్దరూ. కౌశికుడు అడుగుతాడు. "నీవు ధర్మవిదుడవు–జీవహింసయే జీవనంగా ఎందుకు గడుపుతున్నావు?" అని. అందుకా ఎఱుక ఇలా చెప్పినాడు. "బ్రహ్మక్షత్రియ వైశ్య శూద్రులకు వారివారికి చెప్పబడిన కర్తవ్యాలు ఎలాగయితె వారివారి స్వధర్మాలై సమాజం మనడానికి కారణమయినాయో–పరమ ధర్మాలయినయ్యో, అలాగే–మాకు, మృగయాపజీవనమె పరమ ధర్మము. ఈ మాంసం అమ్మి ప్రజలకు సరఫరా చేయడంద్వారా సమాజసేవ మేము చేయాలనేది మా స్వధర్మమయింది. పైగా ఇది వంశపరంపరగా వస్తూఉన్న జీవన ప్రవృత్తి. ఈ మిథిలా నగర మహారాజైన జనకుడు ఈ సరఫరా మేము చేయకపోయినట్లైతె శిక్షిస్తాడు. నిజకర్మ పరిత్యాగం నేనెలా చేస్తానుగాక!!

ఇలా కనపడే ఈలాటి ప్రవర్తన కలిగికూడ, నేను జీవహింస చేయుటల్లేదు ఎవరో చంపి తెచ్చిన మాంసాన్ని ధరకట్టి వెలకమ్ముతున్నాను. అందుకని అమలమైన మాంసమున్నూ, అమలమైన కాంతిన్నీ ఈరెండూ నా ధనములు సుమా!

ఇంతేగాదు—నేను, గురువులూ వృద్ధులూ అయిన జన్మలను అతిథులను విప్రులను దేవతలను అర్చిస్తూ ఉంటాను. సత్యమూ శౌచమూ నియమమూ. త్యాగం చేస్తుంటాను. భృత్యుల బంధువులయందు ఓర్పుకలిగి ఎక్కడా అసూయ లేక, ఉంటాను. మనసులో ఆశ అనేది పెంచను. ఇతరుల దోషకథలను వినడానికి ఇష్టపడను. ఎప్పుడూ ఉపవాస నియమ వ్రతాలు పాటిస్తాను. ఒకే భార్యతో ఉంటాను. ఋతు కాలంలోనే ఆమెతో రమిస్తాను. నిందగాని స్తుతిగాని నాకు సమానమె అయినట్లుగా అనుభూతి చేస్తుంటాను. అందు చేత హీనమానిజాతుడనయినప్పటికిన్నీ నేను నిర్మలుడనయినాను. నీవు నావద్ద ధర్మములెఱుగడానికి వచ్చినావుగనక వాటిని చెప్తాను. ఈ పై సంగతులు ప్రసంగ వశంలో చెప్పవలసి వచ్చిందిగాక" అన్నాడు.

"ధర్మాలు మూడు విధాలు—1. వేద విహితములు 2. శాస్త్ర విహితములు 3. శిష్టచరితములు అని. ఈ మూడూకూడ సద్గతికి కారణాలెనని తెలిసికోను. "తన కులధర్మము విడువకమనుట పరమ ధర్మమండ్రు మాన్యులు" అంటాడు. ఈ కులధర్మమనేది వైవస్వతమనువు చేసిన శాసనం. ధర్మమనేది శాసనాలకు శాసనమైన సంవిధానంవంటిదైతే, ఈ రాజశాసనం ఆ ధర్మాన్ని రక్షించేందుకుగాను రాజుచేసే శాసనమనేది గమనించాలి. రాజుచే చేయబడిన ఈ కులధర్మమనే శాసనం పాటించాల్సిందె అని ధర్మవ్యాధుడు ముందుగా చెప్పినవాడై నిశ్చలమైన, నిర్మలమైన, అసలైన, ధర్మాలకెల్ల ధర్మమైన విశేషం చెప్తున్నాడు—ఆ పద్యంలోనే—"1. చిత్తంబున కృపగలుగుట ముఖ్యప్రవని—2. వైరణవలయు నఖిలభావములందున్" అని.

కృప అంటె దయ_సుహృద్భావం అనచ్చు. ఏపని చేస్తున్నా ఇది ఉండాలి నేను మాంసం కోసేవాణ్ణిగదా అని మనుషుల్ని వారి మనసుల్నికూడ కోయ రాదు. నీవు బ్రాహ్మణుడవై స్వాధ్యాయంచేస్తే సరిపోతుందని నీతలిదండ్రుల్ని. వదిల్ని. భిక్షపెట్టవచ్చిన స్త్రీలను అర్థం చేసికొనడం మానరాదు.

రాజ శాసనం సామాన్య ధర్మం. ఈ చెప్పిన సుహృద్భావమనః స్థితి విశేష ధర్మం.—పైరెండేగాక ఇంకా కొన్ని ఉన్నవి.—

3. "విడుపు వలయు సకల విషయ వాంఛలయందు. విషయ వాంఛలను వదలగలిగినవాడు పరిత్యాగశీలుడనబడుతాడు. అతడికి అసాధ్యసిద్ధి కలుగుతుంది. ఇది పరమధర్మ విశేషం అనేది గమనీయం.

4. సత్యహితాలాప చతురత యర్థంబు 5. సంతత సుజన పూజనము వలయు 6. విసుక్రోధ సంరంభ విద్వేషముల జేసి మతి గలంగినను ధర్మంబు దప్పఁ ద్రొక్కక నడచు టత్యుత్తమ సరణి 7. అప్రియముల యందును ప్రియములందు దైన్య హర్షంబుల దగులక యున్నట్టి కళ్యాణ వర్తన కాంక్ష లెస్స. 8. ఎగ్గుసేసిన వారికి హితము సేత—ఇవన్నీ ధర్మ విశేషాలే. ఇవన్నీ మనసుకు సంబంధించిన సాధకాలు. ఫలాని పనిచెయ్యి అనేది శారీరకంగా చెప్పబడే శాసనం. రాజశాసనం అలా ఉంటుంది. వానిని కొట్టరాదు. ధన మపహరింపరాదు. మాతా పితరులను పోషించు — ఇలాగ. కాని ధర్మ విశేషాలు మాత్రం — ఏపని చేస్తూన్నా మనసులో అనుసంధానం చేస్తూ ఉండదగినట్టి వనేది గమనీయం. ఇది ఆచరించటం రాజ శాసనం ఏదేని విషయంలో ప్రచలితమై ఉన్నా ఉండకపోయినా పాటించాల్సినట్టిదే ననేది తెలియాలి.

ధార్మికులయినవారు చేసే కర్మలను నాస్తికులు హర్షింపరు. చెడ్డగా తిట్టుతారు. కాని ఈ పై విశేష ధర్మాలను ఎవరైనా ఒప్పుకొనవలసినవే ననేది గమనీయం. అందుకని ఒక పాక్షికుడు తనను తిట్టుతున్నాడు గదా! అని తన పని మాని వేయటం, ఇంకొక పాశికునకు సమంజసమయిన పని కాదు అంటాడు ధర్మవ్యాధుడు. నీవు నా పనిని అసహ్యించుకొన్నంత మాత్రం చేత నేను నా పనిని మాని వేయరాదన్నమాట. ధర్మం మీద ప్రీతిని వదల కూడదని అర్థం. తరువాతి ధర్మం—

9. "పాపముల కెల్ల నెక్కుడు పాతకములు
సూవె క్రోధ లోభంబులు"

— "వాని రెంటి జయించిన వాడుగాని యెందు పరమ ధార్మికుడని యెన్నబడడు".

అన్నిట్లోకీ క్రోధలోభాలు పరమపాతకాలు. వాటిచేత మనసు కలగిపోవటం తథ్యం. అవి ఒకవేళ కలిగినాసరే ధర్మంతప్పు మరొకటి నేను అనుసరింపను అనే ధైర్యం ఉండాలి.

కౌశికునకు కేవలం తాను బ్రాహ్మణ జన్ముడు గనక స్వాధ్యాయం చేసికొంటె, తాను కొంగను చంపగలిగినంత గొప్ప తనాన్ని పొందాడు గనక చాలునను కొంటున్నాడు. కేవలం వైవస్వత మనువు యొక్క శాసనమే అతడెరిగి అలా చేస్తున్నాడు. ధర్మ విశేషాలు తెలిసికొనక పోవటంచేత పతివ్రత మాటలు విని చిత్తయిపోయి ధర్మవ్యాధుని దగ్గరకు వచ్చాడు.

వేద విహితాలు, శాస్త్ర విహితాలు చేయాలి. రాజ శాసనాన్ని పాలించాలి గాక. ధర్మ విశేషాలు తెలిసి, వేద విహిత శాస్త్ర విహిత కర్మలు చేస్తూనే శాసనాలను పాటించాలి. మూడవదైన శిష్ట చరితను గైకొని "అనసూయతో నడుచుకొంటె కలిగే సంతోషం ఇంతా అంతా కాదు. అలాంటి సంతోషం ఇంకే విధంగా నడుచుకొన్నారాదు గాక" అంటాడు ధర్మవ్యాధుడు.

ఐతే శిష్టాచారాలంటే ఏమిటని కౌశికుడు అడుగుతాడు. అందుకు ధర్మ వ్యాధుడు, —

సీ॥ 1. దానంబు 2. సత్యంబు 3. తపము 4. యజ్ఞము 5. నార్జవము 6. గామ లోభాది వర్జనంబు 7. గురుజన శుశ్రూష 8. క్రోధ రాహిత్యంబు 9. దమము 10. సంతోష 11. మధ్యయన నిరతి 12. దాంభికత్వము లేమి 13. దైన్యంబు వొరయమి 14. యనసూయ 15. అనహం క్రియాభి యుక్తి ఇవి అన్నిటికీ మొదలైనవి. 16. శీల సంరక్ష 17. తీర్థ సంసేవ 18. శౌచ 19. మఖిల భూతములందు దయార్ద్రతగుట 20. మిత హితోక్తులు 21. సంశ్రితమిత్ర గుప్తి — ఇవి శిష్ట చరితంబులు.

ఈ శిష్టాచార క్రమం తెలియాలంటే – క్షేమం తెలియుటం కాదు, ఎలుగాలి : (1) ధర్మానికి వాటంగా ఉన్న విమల చిత్తముండాలి (2) సత్యము (3) అహింస ఇవి బాసటగా ఉండాలి, అహింస ధర్మాల్లో కెల్లా గొప్పది. అంటే సర్వులూ మొదటినుంచి పాటించాల్సినట్టిది, దానికి సత్యము తోడైతే

ప్రకాశిస్తుంది. శిష్ట చరితలలో సత్యమె రటు అధికమైనదని కూడ అంటారు శ్రుతుల చదివినవారు. —

శిష్టాచార మార్గంలో నడచే పుణ్యాత్ముడు కష్టాలు దాటిన వాడై, ప్రజ్ఞ అనే ఇల్లు నెక్కిన వాడై క్రింద మోహమనే బురద నీళ్ళలో మునిగి యున్న లోకాన్ని చూస్తూ అయ్యో వీళ్ళిలా దుఃఖపడి పోతున్నారు కదా ! అని నవ్వు కొంటూ గమనిస్తాడు.

ఈ ధర్మ విశేషాలు చెప్పి ధరవ్యాధుడు చివరకు, కౌశికునితో — అయ్యా నా వర్తనను చూచి అది "హింసా బహుళమై" యున్నదిగదా ! అని అన్నావు హింస యేది అహింస యేది అనే విషయం నీవు తెలిసికొను. —

"ఫలాలు, దుంపలు, ఔషధాలు, శాకాలు తినబడేవి. అంతేకాదు పశువులు మృగాలు కూడ తినబడేవే. అలా బ్రహ్మ ఏర్పాటు చేశాడు. హింస అని పిలుచుకొనేది జరపనే జరపకుండా ఈ జనాలు ఈ జంతువులు బ్రతకటం అవుతుందా ? యజ్ఞాల్లో జంతువులను చంపి హవనం చేస్తారు కదా ? పితృ కర్మల్లో మాంసం వండి పెట్టటల్లేదా ? ఇంతెందుకు భూమి దున్ని సస్యాన్ని పండించేవాడు తన నాగలికొనతో ఎన్ని పురుగులను, జంతువులను చంపుతూ ఉంటాడనవచ్చు. అన్ని కర్మల్లోనూ హింస ఉంటూనే ఉంటుంది. క న క ధర్మమయిన అహింసను పాటించటం ఎలాగంటే, — "తమ తమ యోపినట్లు హింస తెరువున కెడగల్గి యేగవలయు నదియ సూవె యహింసనా నతిశయిల్లు" అన్నాడు. హింస చేయడమనే దానికి దూరంగా జరగాలి అనే ఆశయంతో కర్తవ్యాలు చేసికొంటూ ఉండాల్సిందేనని బోధ. దీనిని మాటల్లో చెప్పటం చదవటం కుదరదు. తెలిసినవారు నడచుకొనే విధానాన్ని వారి ననుసరించి తెలిసి పాటించాలి. అలా కుదరకపంటే శ్రుతి ఎలా చెప్పిందో అలా చేయడమే మార్గం దానిని అవునూ కాదూ అనే హక్కు లేదు. దానిని నిరసించటం కూడదు — నీకై నీకు తెలిసేదాకా. తెలిసేటప్పటికి ఆ తెలిసిందీ, శ్రుతి చెప్పిందీ ఒకే ఒకటని గ్రహించగలవు.

దీననే ధర్మ సూక్ష్మము అంటారు, "భూతాలకు హితం చేస్తూ అందుకు గాను ఏదయినా పలికే అబద్ధం కూడా సత్యమేను" అన్నారు. భూ తా ల కు భయాన్ని అపాదించే సత్యం, సత్యమనిపించుకొనదు. ఈ ధర్మ సూక్ష్మం

అర్థం చేసుకొని, దానిని కొన్ని సందర్భాల్లో బొంకుసు దోష రహితంగా చెప్పటం చూస్తాం. "ప్రాణాతుడైనచో, బరిణయంబున యందును బలుక-బొంకు సత్యాతిశయంబు"అన్నారు, ఇలా ఉంటవి ధర్మ సూక్ష్మలు. చెప్పిన ధర్మం కేవలం మాటలతో అర్థం చేసికొంటే చాలదని ధ్వని. దాని వెనక నున్న సద్భావ పరిపూర్ణత నర్థం చేసికొనటం ద్వారా దానిని ఎరుగ వలెనని బోధ.

ఈ ధర్మ సూక్ష్మలకు వెనుక "వేదాంత తత్త్వం" – అంటే బ్రహ్మ పదార్థతత్త్వ జ్ఞానం – ఉంటుందనేది తెలియాలి. అందుకనే ధర్మవ్యాధుడు అంటాడు.

"మును తమ చేసిన కర్మంబున జూపె నశించు భూతములు సంపెడు వాడు నిమిత్తమాత్ర మింతయెయని చెప్పగ వినమె యంచితా చారులచేన్" అంటాడు. ఇది అట్టి అడుగున ఉండి ధర్మాల భవనాన్ని మోస్తూ ఉండే తత్త్వం. దీనికి సమమైనదే ఇంకొక సంగతి ధర్మవ్యాధుడు చెప్తాడు. –

ఒప్పైదైనా ఒప్పనిదైనా నిజకులోచిత పథమును తప్పరాదు. ఎందుకంటె అది మన ధర్మ శాసనం (రాజ శాసనం) కనుక, ఆ పని నిజభాగ్య విహిత మని అనుకోవాలి అంటాడు. ఇది ఎంతో లోతైన యోచన వల్ల వచ్చిన మాట. ఈ సర్వప్రపంచం ఇలా జరుగుతోంది కనుక నీవు అలా ఆ కుర్చీలో కూర్చుని నేను చెప్పే మాటలు వినడము అనే కర్మ చేస్తున్నావు. కేవలం ఇలా నీవు ఉంటున్నావు గనక, నీతోపాటు మిగతా వారంతా ఎలాగో ఒకలా నడుచుకొంటున్నారు గనక ఈవిశ్వం ఇలా నడుస్తున్నదనుకొనటం సరికాదు. చెట్టు ఉంది గనక ఆకులు, పూలు ఉంటున్నవి, అన్నట్లే–విశ్వం ఉంది గనక ప్రపంచాలున్నాయి. సమాజాలున్నాయి–వ్యక్తులున్నారు. నీవూ కూర్చున్నావు. వ్యక్తికి ఇంద్రియాలున్నాయి. అంతే గాని ఇంద్రియాల కోసం మనిషి (వ్యక్తి) అనీ, వీరి కోసం సమాజాలు అనీ, వాటి కోసం ప్రపంచాలూ అనీ, వాటికోసం విశ్వం నిల్చి ఉందనీ అనుకోవటం పొరపాటు. ఆకులు, పువ్వులు, కాయలు అన్నీ రాలిపోయినా చెట్టు ఉంటూనే ఉంటుంది గదా! ఇదీ అంతే.

అందుకే భగవంతుడైన విశ్వకర్మ తాను ఈ విశ్వంలో చేసేదంతా చేస్తూనే ఉంటున్నాడు. ఆ చేయటం ఈ ప్రపంచాలను, వ్యక్తులను, వారి ఇంద్రియాలను పరికరాలుగా చేసి నడుపుతున్నాడు. నేను చేశాను గనక ఇది జరిగింది అని వ్యక్తి అనుకోవటం ఎలా ఉంటుందంటే నా నాలుక తన్ను నా నుంచి విడగొట్టుకొని "నేను ఇన్ని పలుకులు పలుకు తున్నాను కనక ఈ కౌశికుడు వింటున్నాడు. లేకపోతే ఏముంది" అనుకోవటం లాంటిదే.

అలా చేయబడిన పనుల ఫలానికి, వ్యక్తి తాను కర్త కాదు అనటం అందుకే. ఇది ఆధారం చేసుకొని మూఢులు భగవంతుని దూరుతారు. తమ కర్మకు తగిన ఫలం రాలేదను కొన్నవారై. కర్మగతి చాల దుష్కరమైంది. కర్మ ఫలము కార్యకారణ సంబంధం మీదనే ఆధారపడి ఉంటున్నా ఆ కార ణాన్ని ఇదమిత్థమని తెలిసికోలేక దైవాన్ని దూరటం మూఢుల పని. నిజా నికి కర్మ ఫలంచేతనే దేహమనేది కలుగుతుందని అన్నాడు ధర్మవ్యాధుడు.

అప్పుడు కౌశికుడు 'జీవుడు' సంగతిని చెప్పవలసింది అంటాడు. పుణ్య పాప బంధాలు ఎలాంటివి అంటాడు. ఇది కేవలం వేదాంత విషయం. శ్రీమద్భగవద్గీతలో చెప్పిన విషయాలుకూడ ఈకథలో ధర్మవ్యాధుని మాటల్లో చెప్పబడినవి. అందుకే భారతం చదివితే వేదం, వేదాంతం వరకూ చదివి నట్లే ననటం. అది పంచమ వేద మనటమున్నూ అందుకే.

## 3. ధర్మవ్యాధుని బోధలు

ధర్మవ్యాధుడు కౌశికునకు జీవుని లక్షణాలు చెప్తాడు. జీవుడు సనాతనుడు. అంటే ఎల్లప్పుడూ ఉండేవాడు. ఎప్పటినుంచో ఉంటున్నవాడని అర్థం. ఇతడు పాపం చేయటం అంటూ యథాతథంగా ఉండదుగాని శరీరం పొందిన తరువాత ఆ శరీర మనోబుద్ధులూ వాని ఇంద్రియాలతో కలిసి పాపంగాని పుణ్యంగాని చేయడం కలుగుతుంటుంది. ఆ పాపపుణ్యాల కారణంగానే వానికి కొత్త శరీరం కలుగుతుంటుంది–పాత శరీరం నశిస్తూ ఉంటుంది. శరీరమంటె నశిస్తూందనిపిస్తుందిగాని- జీవుడయితె అలాగే ఉండి. మళ్ళీ ఇంకో శరీరాన్ని తన చుట్టూ ఏర్పాటు చేసికొంటూ ఉంటాడు. అలా క్రొత్త కర్మలుచేస్తూ వాటివల్ల కలిగే సుఖదుఃఖాలు శరీరమనోబుద్ధులు అనుభవిస్తుంటే

చూసి తను అనుభవిస్తున్నట్లే అనుభూతి చేస్తాడు. ఇలా అనుభూతి చేస్తూ ఉండటం చేతనే దేహబంధం అతడికి కలుగుతుంది అన్నాడు ధర్మవ్యాధుడు. ఈ దేహబంధమనే దుఃఖం మాత్రం అతడిదా అని శంక. మిగతా పనులేవీ అతడు చేయలేదన్నప్పుడు ఈబంధం మాత్రం అతడు ఎలా అనుభవిస్తాడు? నిజానికి ఇవీ అతడు అనుభవించడినచ్చు. కాని, మామూలు పనులే-అంటే తన శరీరం చేస్తుందేవి,-తాను చేస్తున్నట్లుగా అనుభూతి చేస్తున్నాడు కదా! అలాగే ఆ బంధంకూడ తనదేనని అనుభూతి చేస్తాడు.

శరీరం చేసేపనులన్నీ ఆశరీరం కలిగినవాడు తానే చేస్తున్నాడనుకోవటం లోకంలోగల రాజశాసనం, అలా అనుకోకపోతే, తాను ఇంకొకడ్ని కొట్టి నేను కొట్టలేదనచ్చుగదా! అలా ఈ లోకపు తీరుకు అలవాటుపడిన ఈబుద్ధి అహంకారం-మొదలయినవి "నేను" అనే ఆ మానవుడ్ని భ్రమలోపడేసి అవి చేసినపనులన్నీ ఆ మానవుడే చేస్తున్నాడనీ, వాటి ఫలితాలు అనుభవిస్తు న్నాడనీ, అతడికి తన శరీరం చుట్టూవున్న వాతావరణంతో బంధం ఉన్నదనే అనుభూతిని కలిగిస్తున్నవి.

ఇది ఎవరికివారు పెద్ద-గొప్ప-పరిశోధన (రిసెర్చి) చేయదగిన విషయం. ఈ విషయంలో ప్రతి క్షణం తాము చేస్తున్నామనుకొన్న పనుల విషయంలో కేవలం తమ మనోబుధ్యహంకారాలూ, ఇంద్రియాలూ. మాత్రమె ఎలా చేస్తున్నాయో, గమనించటం అనేది అందుకయిన గొప్ప సాధన. కౌశికుడు అదే ఆలోచిస్తూ ఆ పుణ్య పాపాల సంగతి చెప్పాలన్నందంటాడు. పుణ్య మంటే పరోపకారం లేదా దేవుడంటె తెలిసి వానికోసం చేసే పని. పాప మంటె పరపీడనమె పాపం. ఈ నిర్వచనాలు ఆధారంగా ధర్మవ్యాధుడు వాటి విషయం చెప్తాడు. (పరం అంటే స్వార్థం కానిది పరమని అర్థం).

గొప్ప పుణ్యం చేసి దేవతగా అవుతాడు-జీవుడు. పుణ్యం పాపంకూడ సమంగా చేసియున్నట్లయితె అతడు మనుష్యుడవుతాడు. కేవలం పాపం మాత్రమే చేసియున్నట్లయితె తక్కువ యోనులలో-అంటే పశు కీటకాలుగా అయిపోతాడు. ఇలా పుణ్యం పాపం చేస్తూ ఉండటాన్నె నడిపిస్తున్నంత కాలమూ ఒకసారి మనిషిగా ఇంకోసారి దేవతగా మరోసారి పశువుగా అయి, తానే ఆశరీరం చేసే పనులన్నీ నెత్తిన వేసికొని సుఖదుఃఖాలు అనుభవిస్తున్నా ననుకొంటూ ఉండిపోతాడు. ఇదీ పుణ్యపాపాల వైనం.

కాని ధీమంతుడైనవాడు ఈ సంగతి ఎప్పుడో గ్రహిస్తాడు–అప్పుడు పాపమయితే చేయడం మానేస్తాడు. మరి పుణ్యం సంగతో? అనిపిస్తుంది. అది చేస్తూనే ఉంటాడుగాని, "నిర్మద, నిరహంక్రియాత్ముడును, మత్సరదూరుడునై చరించుచూ ఉంటాడు. అంటే ఆ పనులన్నీ తానే చేస్తున్నట్లుగా అనుభూతి చేయడు–అహంక్రియాత్ముడు కాడంటె అదీ అర్థం. మదం లేనివాడవుతాడన్నా అదే అర్థం. మత్సరం ఉండదుట మరి ఇవేవీ చేయక ఏం చేస్తాడయ్యా అంటే–ధర్మమార్గంలో, ధర్మము తీపి తెలిసినవాడై సత్క్రియను వదలడుట. ధర్మము ఏదో అప్పటిదాకా తెలీదా ఎవరికీ అనిపిస్తుంది ఈ మాటలు వింటుంటే! నిజమేనేమొ. ఏది ధర్మం ఏదధర్మం అనేది తెలియడం అహంక్రియాత్మునకు అసంభవమైనదని చెప్పడం ఇక్కడ తెలియదగిన విషయం.

నేనూ ధర్మం చెప్పుతానని మాట్లాడేవాడు తర్కం మాట్లాడగలడు. కార్య కారణ సంబంధం చెప్పగలుగుతాడు గాని అన్ని సమయాలకూ వర్తింపగలిగే ధర్మం చెప్పడు. ఇది ఎవరికివారు తర్కించుకొని ఆలోచిస్తేగాని తెలియని విషయము.

ఏమయినా 'కర్తవ్యం' అనేది తనకయిన కర్తవ్యం అనేది,–కొంత వరకు–ఎవరికి వారికి ధర్మాన్ని చూపించగలదనిపిస్తుంది–కాని అతడు ఇంకొకరికిఇదిగో ఇదీ ధర్మం నీవు చెయ్యి అని చెప్పగలిగే స్థితి రావాలంటే నిరహంక్రియాత్ముడు మత్సరదూరుడు, నిర్మదుడు అయినప్పుడే తప్ప సాధ్యముకాని పని అనేది గమనీయం.

కనక ఎవరి కర్తవ్యం వారు స్వయంగాగాని లేదా తెలిసినవారి నడిగిగాని తెలిసికొన్నవారై అలా ధర్మాన్నిమాత్రమే చేస్తుంటే వారి చిత్తము తేరుకొంటుంది. అంటె నిర్మల మవుతుంది. ఎందుకంటె– పాపం చేయటల్లేదు – పుణ్యం కోసం ఈ ధర్మాన్ని చేయటల్లేదు. కర్తవ్యం కనక చేస్తున్నాడు ఈ పుణ్య కర్మల్ని. కనీసం ఈ పుణ్య ఫలం రావాలనే కోరికకూడా పోతుంది. అప్పుడు నిర్మలత్వం శాంతి పెరుగుతవి. ఇంద్రియాల కోసం చేసే పనులన్నిటికంటె ఈ ధర్మకర్మలు ఎంతో శాంతి సంతోషాలిస్తున్నయిగనుక, ఇంద్రియ విషయం అలావదలి తపోదమ సత్యశీలతలో పరిణతి పొందుతాడు. తరువాత పరమార్థ పదవిని పొందుతాడు" అన్నాడు ధర్మవ్యాధుడు.

కౌశికుడు "ఇంద్రియాలను నిగ్రహించకపోతె ఏం పాపం వస్తుంది- నిగ్రహించితె వచ్చే ఫలితమేమిటి" అంటాడు.

ధర్మవ్యాధుడు ఇలా చెప్పాడు- "విషయజ్ఞానం కలగటానికి మూలం మనసు. ఈ మనసు వస్తుతః మంచిదె. కాని దానికి కామం క్రోధం అనే వికారాలు కలుగుతుంటవి. ఇనుము తెల్లనిదె. దానికి స్వాభావికంగా తుప్పు ఉండటం వల్ల నల్లనయిపోయినట్లె మనసు కామక్రోధాలవల్ల ఇంద్రియాలకోసం చేయదగిన పనులవైపునకె పట్టిన దవుతుంటుంది. ఇదె మానవునకు కలుగుతున్న చీకాకు.

పోనీ ఈ ఇంద్రియార్థమైన పనులవైపునకు మనసుపోతే మాత్రమేం అంటావేమో. అలా మనసు పోవడంవల్ల రాగమనేది కలుగుతుంది. 'రాగ' మంటె ప్రేమ లేదా అపేక్ష లేదా ఆశ. ఈ రాగంవల్ల దేనిపై ఆ 'రాగం' ఉన్నదో అది తనకే ఉండాలనే లోభం కలుగుతుంది. లోభి అయినవాడికి, ఇక 'దయ' అనేది ఉండదు. పరపీడనం వల్ల పాపమె కలుగుతున్నదై తగిన వారు చెప్పిన మాటలను వినే బుద్ధే ఉండదు. చెడ్డవారి వైపునకే ప్రేమ పరుగిడుతుంది. మనోవాక్కాయాలు ఒకేదోవనపోవు. ఇహంలో పుణ్యం చేయనివాడవుతాడు. పరంలో దుఃఖమె కలుగుతుంది. అందువల్ల ఇంద్రియాలనే అనుసరించకుండా సజ్జన సాంగత్యంచేసి సరియైన దోవను వెళ్ళవలసి ఉన్నది.

ఇలాచెప్పి. ఇంద్రియాల్ని జయించడమెలాగని అడుగుతున్నట్లున్నావు. అది బ్రహ్మ విద్యా విషయమనేది గుర్తించుకొను, కాని ఆ విషయం వివరించి చెప్పటానికి మాబోటి వాళ్ళకు తగదు". అన్నాడు. శూద్రులు బ్రహ్మ విద్యా విషయాలు చెప్పరాదనే ఆంక్ష ఉన్నదా? తగినట్లు అర్థంచేయగలిగే మాటలు వాళ్ళు మాట్లాడలేరని అలా అన్నారా? అనిపిస్తుంది. అయినా ధర్మవ్యాధుడు చెప్పటానికే ఆరంభిస్తాడు. ఎందువల్లనంటే-దానికి కారణం కూడ తానే చెప్తాడు-వినేవాడు బ్రాహ్మణుడుగనుక అంటాడు: అనగా సరిగా అర్థంచేసికొనగలడని అర్థమా? తత్త్వ పరిశోధనకు వచ్చినవాడే బ్రాహ్మణుడుకదా అని అర్థమా? కౌశికునకు అది తెలిసికొనవలెనని ఉన్నదిగనుక అతడికి ప్రియంగా తాను చెప్పదలచినాడు అనే అనాలి. అందుకుగాను

ముందుగా పరమ బ్రహ్మవిదులయిన బ్రాహ్మణులకు నమస్కరించి చెప్పటం ఆరంభిస్తాడు.

"ఆకాశం, వాయువు, అగ్ని, జలము, పృథ్వి—ఇవి పంచభూతాలు. వీటి గుణాలేమిటంటె శబ్దం, స్పర్శం, రూపం, రసం, గంధమున్నూ. ఈ భూతాలు పుట్టటం కూడా ఆ వరసలోనే ఒకదానిలోనుంచి ఆ తరువాతిది పుట్టటం వల్ల జరిగింది. అవి అలాగే చివరనుంచి మొదటికి, అంతకు ముందు దానిలో లయించిపోతయి. పైన చెప్పిన గుణాలను ఆకర్షించేందుకు గాను మనకు ఇంద్రియాలున్నాయి. చెవి, చర్మం, కన్ను, నాలుక, ముక్కులు. ఇవి జ్ఞానేంద్రియాలు. ఇవికాక మనసు, బుద్ధి, అహంకారము అనేవి మనలో ఉన్నాయి. సత్త్వరజస్తమో గుణాలున్నాయి. ఈ మహాభూతాల వల్ల ప్రపంచం తయారయింది. ఇవన్నీ ఎలాగో కలగలుపుగా కలిసిపోయి ఉన్నప్పుడు అది అవ్యక్తమై ఉండేది. ఏడు రంగుల చక్రం తిరిగి తిరిగి తెల్లగా అవుపడిన స్థితి అది. భూతాలు తమతమ పాళ్ళలో కలిసినవై ఈ గుణాలను వికారాలను క్రమంలో ఆకర్షించుకొని ఉన్నప్పుడు వ్యక్తమయి ఉంటాయి. లేనపుడు అవ్యక్తమె.

ఇది ఇలా నడుస్తూ ఉండేదె. పుట్టటం చావటం, మారిపోవటం అనేది నిత్యమైన విషయం. కాని వ్యక్తి వేరుగా ఇదంతా చూస్తూ అనుభవిస్తున్నా ననుకొంటూ ఉంటాడు. ఈ ఇంద్రియాలు ఆ గుణాలను ఆకర్షించు కొంటుంటే, తాను అనుభవిస్తున్నాననుకొంటూ ఉన్నాడు. అది అజ్ఞానం తాను బుద్ధిని నియమించి వాటిపైకి ఇంద్రియాలు పోకుండ అరికట్ట గలిగితె అదె జ్ఞానం. తానే ఈ భూతాలుగా ఇంద్రియాలుగా గుణాలుగా అయినట్లుగా తెలియడానికి తపస్సు చేస్తాడు. చలించడు. తపమంటే ఏమిటంటావేమొ—

తపమనగ సకల విషయ వ్యాపేతమగు నట్టి బుద్ధి వైభవము సుమీ
తపమున సుస్థిరుడగు యోగపరునకుంగలదె యొండు కర్తవ్యంబుల్

తపస్సుచేసి, ఈ పై జ్ఞానాన్ని సంపాదించుకొనేవానికి ఇక ఏ కర్తవ్యాలూ ఉండవుట. జ్ఞానం అనుభవమయేవరకూ కర్తవ్యాలు ప్రపంచంలో ఉంటూనే ఉంటవి. అవి మానకూడదు. ధర్మాలుంటవి అవిపాటించి తీరాలి. జ్ఞానం ఇంకా రానప్పుడు కూడ కర్తవ్యాలు చేయకపోయిన స్థితి ఎక్కడా ఉండరాదు.

పేను కుట్టుతుంటే తీసి అవతల పారేయాలనే కర్మకూడ కర్తవ్యమే ఒక సమయంలో. జ్ఞాని అయిన తరువాత ఆ కర్తవ్యం చేయకపోయినా అతడికి సేగిలేదు. జ్ఞాని మంచినీరూ త్రాగుతాడు, కల్లూ త్రాగుతాడు, కరిగి ప్రవహించే ఇనుమూ త్రాగుతాడు. అదీ స్థితి! మిగతావాళ్ళంతా కర్తవ్యాలు చేయాలి–ధర్మాలను పాటించి. ఈ రెండే ఆమోదింపబడిన తరగతులు. అలా చేయనివాడు కేవలం అధర్మపరుడవుతాడు. అని ధ్వని. స్వర్గం అనేది ఇంద్రియవర్గ నివారణమే. వాటిని నిరోధింపలేకపోవలసిన దుర్బలతే నరకం!

దేహం రథం. ఇంద్రియాలు గుర్రాలు. ఆత్మ సారథి. పగ్గాలు ధైర్యమే ఆ గుర్రాలు వేగంతో వెళ్ళిపోకుండా ధైర్యంతో లాగిపట్టిన వానికి క్షేమం అవుతుంది. అతడె గొప్పవాడు. అలా వాటి వేగాన్ని తగ్గింపక పోయినట్లయితె, మనసు వాటినె అనుసరించి వెళ్ళిపోతుంటె, బుద్ధి కాస్తా చెడి పోతుంది– సముద్రంలోకి చెత్తవెళ్ళినట్లె. అది కోరదగిందికాదు.

ఐదింద్రియాలూ మనసూలను బుద్ధిద్వారా తనవశం చేసికొనాలి మానవుడు. అంటె ధ్యానసమాధి సమగ్రుడు కావాలి. అప్పుడు బ్రహ్మత్వాన్ని పొందుతాడు వ్యక్తి. ఇది బ్రహ్మవిద్యకయిన కీలకం అని ధర్మవ్యాధుడు కౌశికునకు చెప్తాడు.

బ్రహ్మ విద్య అంటే ఇంతేనా అనిపిస్తుంది. అంతె. కాని అది అనుభవానికి వచ్చినప్పుడె బ్రహ్మమును చేరడమవుతుందిగాని కేవలం తెలివిద్వారా తెలిసి తెలుగులోనో ఇంకో భాషలోనో ఇలా మాటలు చెప్పి ఇంతేనన్న మాత్రంచేత బ్రహ్మవేత్త అయినాడనటానికి అవకాశంలేదు. ఇది శూద్రులకు చెప్పకూడదు అనటం ఒకానొక అక్కరలేని అడ్డుగోడ పెట్టటమనిపిస్తుంది. కాని నిజానికి ఉద్దేశ్యమదికాదు. ఆ మాట కొస్తె పై అక్షరాలు చదివిన లేదా వ్రాసిన వాడల్లా అనుభూతి చేయగలడా బ్రాహ్మణ జన్మదయితె మాత్రం! లేడు. అందుచేత ఆ మాటల్లోని అర్థం గుణరీత్యా శూద్రుడయిన వానికి ఇది చెప్పటమనేది అనవసరమూ, కూడని పని అని చెప్తున్నారని అర్థం. కేవలం ఒకానొక కులంలో పుట్టిన వారిని న్యూనత పరచటం కాదు–ఈ ధర్మం ఉద్దేశం, సాధనచేసి, తపసు చేసే వాడెవడైనా

ఇంద్రియాలను జయించినవాడెవడైనా దీనికి అధికారి కాగలడు. ధర్మవ్యాధుడు శూద్రుజన్మమెదయినా ఈ బ్రహ్మ విద్య తెలిసియున్నాడుకదా! ఇదె అందుకు తార్కాణం.

"సరిగా అర్థం చేసుకోగలిగినవానికె చెప్పాల్సిందీబ్రహ్మ విద్యను"—అనే ధర్మసూక్ష్మం ప్రస్ఫుటంగా తెలియటం జరిపించాడు వ్యాసుడు భారతంలో.

ఆ తరువాత ధర్మవ్యాధుడు గుణముల పద్ధతిని వివరిస్తాడు. తమోగుణం అతినిందితము. సత్త్వగుణము బోధమయము. రజోగుణంవల్ల ప్రకాశమవుతుంటాడు వ్యక్తి. అసుఖంగా కన్పడటం, దైన్యం, విమోహం, క్షమింపలేనితనం ఇవి తామస భావాలు. రాగం, లోభం, ఇవి రాజస భావాలు. ధైర్యం, శాంతి, కరుణ, సంతోషం, విద్య ఇవి సాత్త్వికభావాలు. సాత్వికుడైనట్లయితే, బోధ కలగటంవల్ల, లోక భావాలు తగినవి కావని తెలిసి, విపిగినవాడై, సమస్తముతో తనకుగల సంగమును—అనగా వాటిపై ఆశను-వదలి "నాది" అనే వికారం పోగొట్టుకొన్నవాడై అహంక్రియను వదలుకొన్నవాడై, నియమవంతుడై ఉండి శాంతిని పొందుతాడు.

అలా సత్త్వగుణ నిబద్ధుడయినట్లయితె అతడు జన్మచేత శూద్రుడయినప్పటికిన్నీ నెమ్మది నెమ్మదిగా వైశ్య, రాజ, బ్రాహ్మణ భావములను పొందినవాడై, పాపవిముక్తుడై—అనగా స్వార్థంవల్ల పరపీడనం చేయటం లేనివాడై—ఉంటాడు—అన్నాడు ధర్మవ్యాధుడు.

ఈమూడు గుణాలు మనుష్యునిలో ప్రకోపిస్తూ అణగారిపోతూ ఉంటవి. సత్త్వగుణం ప్రబలమైఉన్నప్పుడే పట్టుదలతో దానిని నిలుపుకొని బోధను పొందాలి అనేది మర్చిపోరాదు. అందుకె మళ్ళీ మళ్ళీ ఈ బోధను మననం చేసికొంటుంటే సత్త్వగుణాన్ని నిలుపుకోవటం అవుతుందనిపిస్తుంది. సత్వగుణం, బుద్ధిద్వారా విజృంభింపచేసికొనవచ్చు. తమోగుణం, ఇంద్రియాల ద్వారా ఎక్కువ అవుతుంటుంది. రజోగుణం మనసువల్ల నడిచేది. అలా అన్నారని ఇంద్రియాల్ని తమోగుణంలో ఉంచి, మనసును రజోగుణంలోనే ఉంచి, బుద్ధిని మాత్రం సత్త్వగుణంలో ఉంచుదామంటె ఏకాగ్రత ఉండటం కుదరదు. మనిషికి ఏదీ స్థిరంగా దొరకదు. బుద్ధిచేత సత్త్వగుణం పెంపొందించటమే ప్రధానంగా మనుతుంటె శరీరం మనసులనూకూడ తనదోవలోకి

బుద్ధి తపికోవటమనేది సంభవమవుతుంది. అందుకే నియమంగా పెట్టుకొని, ధ్యానం చేయుమనడం, పవిత్రులను ఆదరించి నమస్కరించుమనడం, సర్వు లకూ సహాయం చేస్తూ ఉండుమనడం, గురువులకు సేవలు చేయుమనడం, ఇవి నియత కర్మలుగా చేసేవారు తమ బుద్ధి చెప్పిన తీరులో శరీరాన్ని మన సునూ నడుపుతున్న వారవడంవల్ల వారికి సత్త్వగుణం స్థిరమై తగినబోధ కలుగుతుందని ధ్వని.

ఇక శరీరం బ్రతికింది లేదా చచ్చింది అనే ఈ వివరణ కోసం కౌశికుడు అడుగుతాడు ధర్మవ్యాధుని — అగ్ని శరీరంలో ఎలా ఉంటోంది? వాయువు ఎలా ఉంటుంది చెప్పాలిసిందని—

అందుకు ధర్మవ్యాధుడు,—శిరస్సులో ఆత్మాగ్ని అని ఉంటుంది. దానికి ఆశ్రయం నాభి (బొడ్డు). ఈ అగ్నిలోనే ఉంటూ వాయువుచరిస్తూ ఉంటుంది. ఈ వాయువే 'ప్రాణ' అనే వాయువు. నిజానికి ఈ అగ్నిని రగిలిస్తూ ఉండేవాడు వాయువే. ఆ వాయువు "ప్రాణ" వాయువేతాడు. "అపాన" వాయువు కూడాను. ఈ రెండు వాయువులవల్లనూ ఆత్మాగ్ని రగులుకొంటూ ఉంటుంది. గుదప్రదేశమునందు అపాను" డుంటాడు. విణ్మూత్రాలు కలిగే ట్లు చేస్తుండేది ఈ వాయువె. కంఠబిలంలో నుంచి బయటకు లోపలకు వెళ్ళి వస్తుండేవి ఈ వాయువులె. ఇక వ్యాన వాయువనేది శరీరంలోని సకల సంధులలోనూ ఉండి వాటిచేత పనిచేయిస్తూ ఉంటుంది.

ప్రాణాపానులిద్దరూ, ఆత్మాగ్నులను ఆధారం చేసికొని ఉంటవి. సమాను డనే వాయువు అన్నరసాన్ని పచనం చేస్తున్నవాడై బొడ్డుదగ్గర ఉంటూ ఉంటాడు. ధాతువులనన్నిటినీ పోషిస్తూ ఉంటాడు. ఇదంతా తెలిసి, శిరస్సులో నున్న ఈ అభ్యాసాన్ని చేస్తూ వదలకుండా ఎంతో సంతోషాన్ని పొందు తుంటారు, యోగులు ఇది యోగవిషయం.

ఈ ప్రాణాపానసమాహితుడై సర్వమైన దేహాల్లోనూ ఈ అగ్నె చరిస్తూంటాడు. అతడె జీవాత్ముడని తెలిసికోవాల్సింది. అతడు జలంలో ఉన్న కమల పత్రంలాగా అంటక–స్వరూపం లేకుండా—వెలుగుతూ ఉంటాడు. అతడె పరమాత్ముడు సుమా! చేతనంలేని దేహాలను చేతనం కలిగినవిగా చేసేది ఇతడె. ఒక స్థితిలో త్రిలోకాలనూ సంకల్పించేసిన వాడితడెననాలి.

ఈభూతాలన్నిటిలో ప్రకాశించే భూతాత్మడైన వీనినె తెలిసినవాడు అద్వైత బుద్ధిచేసినవాడై సూక్ష్మ విషయగ్రహణ రూపకమైన ధర్మంవల్ల నిత్యజ్యోతిర్మయుడైన ఆ భగవంతుని తెలిసికొన్నారు.

మరి యీ బ్రహ్మవిద్యా ప్రభావమూ సంప్రయోగ రహస్యమూ చెప్తాను వినవలసింది.–తెలివిని పొందిన బుద్ధిమంతుడు శుభాశుభాలజోలికి పోడు. సుఖదుఃఖాలు మొదలయిన ద్వంద్వాలను సమంగానే చూస్తాడు. అలాంటివాడు నియతమైన భోజనం చేస్తూ–అలాగాకపోతె రోగి అవుతాడుకదా–జితేంద్రియుడై రాత్రిం బగళ్ళు యోగధారణ చేస్తుంటాడు. అంటే పై విషయాలు ధ్యానం చేస్తుంటాడు. అలాచేస్తే మనసులోనే ఆత్మను కనుగొన్నవాడై నిరంత దీపకళికలా వెలుగుతూ అమృతత్వాన్ని పొందుతాడు.

కామాన్నీ క్రోధాన్ని జయించడం ముఖ్యం. అందుకే ఈ యోగం, ధ్యానం, జితేంద్రియత అన్నీని. అమ్మో ఇరవయి నాలుగు గంటలూ అలా యోగంలో ఉండగలమా అని భయపడాల్సిన పనిలేదు. కర్మలు చేస్తూనే ఉంటూ–కర్తవ్యకర్మ చేస్తూనే ఉంటూ–కర్మఫల త్యాగి అవటం మేలు. సక్తుడు కావటం మంచిదికాదు. ఇదె అత్యుత్తమమైన యోగం. దానికోసం ప్రయత్నం చేస్తున్నవాడె బ్రాహ్మణుడంటే ఈ భూమిమీద!! అన్నాడు ధర్మవ్యాధుడు.

నిజానికి జీవితం అస్థిరమైంది. ఇది తెలిసి మనసులో ఎవ్వరికీ కీడునాశించకుండ ప్రేమ, మైత్రిని ధరించి కృపాపూర్ణుడై, సర్వమూ సంగ్రహించేవాడుగా ఉండక, నిత్య తపస్వియై నిత్యతృప్తుడై పరమ శమాన్వితుడై ఉండే ఆ బ్రాహ్మణుడు సనాతన స్థితిని పొందుతాడు సుమా! అన్నాడు.

ఇన్నీ చెప్పిం తర్వాత, 'ఇన్నీ నాకు తెలిసిన విధం ఏమిటంటే నాకర్తవ్య కర్మ అయిన జననీ జనకులసేవ చేయడమే'నన్నాడు ధర్మవ్యాధుడు. తన తలిదండ్రులవద్దకు తీసికొనిపోయి కౌశికునకు వారిని చూపిస్తాడు.

జనని జనకుడు సద్గురు డనలుడాత్మ డనగ నియ్యేవురునునే గృహస్థుచేత
సుగతి వాంఛ ప్రసాదితులగుదు రట్టివాడసూ వెధర్మాత్ముండు వసుధమీద

కనుక నీవు నీ తలిదండ్రుల వద్దకు వెళ్ళి వారి శుశ్రూష చేయాల్సింది. వారు నీ కోసం ఎంతో దుఃఖ పడుతున్నారు! కర్తవ్యమైనట్టి ఆ సేవను వదలి స్వాధ్యాయమన్న పేరుతో నీవు వెళ్ళిపోయి రావడమనేది నీకు ఉన్నతి నీయ జాలదు. ఆ పతివ్రత పంపింది కనక నీతో ఇన్ని మాటలు మాట్లాడాను. నీ వంటే నాకు — ఆ కారణాన తప్ప — ప్రేమ ఏముంది గనక! అన్నాడు.

అంటే ఆశ్రమ కర్మ చేయకవదలినట్టి కౌశికుని ప్రేమించడానికి ఏలాంటి బంధము లేదని. పతివ్రత తన కర్మను సక్రమంగా చేస్తూ ఈయన్ను తన వద్దకు పంపిన కారణమే తనకూ కౌశికునకూ ప్రేమబంధాన్ని కలిగించిందని చెప్పినాడని అర్థం. సమాజానికి వ్యక్తి చేసే సేవలే ఆశ్రమ ధర్మాలూ, కుల ధర్మాలూను ఆ రోజుల్లో. అవి చేయనివారు, సమాజ సేవచేయని స్వార్థ పరులన్న మాట. వారితో ధర్మవ్యాధుని వంటి బుధులు సంపర్కం పెట్టు కొనరని అర్థము.

అప్పుడు కౌశికుడు ఎంతో సంతుష్టుడై "మహాత్మా నీవుచెప్పిన విషయాలు పదివేల మందిలో కనీసం ఒక్కడికైనా తెలిసి ఉండదని నా నమ్మకం. నిన్ను శూద్రునిగా భావించ లేకుండా ఉన్నాను. ఇలాంటి జన్మ నీ కెలా వచ్చిం"దని అడుగుతాడు.

అందుకు ధర్మవ్యాధుడు — తాను పూర్వ జన్మంలో బ్రాహ్మణ కులజుడే అయినా ఒక రాజ కులజునితో స్నేహ కారణాన అతడితో వేటకు వెళ్ళి, చూడక, ఒక మృగమనుకొని పొదలోనున్న ఒకమునిని బాణంతో కొట్టాడు. ఆ ముని తనను ఎఱుకల వాడుగా పుట్టవలసిందని శపించాడు. తాను భయ పడి ఆయన్ను ప్రార్థించాడు. అలా పుట్టడ మనేది తప్పదుగాని అప్పటికి గడించిన తత్త్వం, బోధ అన్నీ. జననీ జనకుల సేవ చేయడం ద్వారా నిల్చి ఉంటాయనే వరం తిరిగి ఆ ముని ప్రసాదించాడని" చెప్పాడు. ఇకముందు జన్మలో బ్రాహ్మణ కుల జన్మమే పొందుతాను గాక అన్నాడు,

కౌశికుడు "మహాత్మా ఇంత సద్గుణ సంపన్నుడవై బ్రహ్మవిద్యాతత్త్వాన్ని ఎరిగినవాడవు ఇంకా క్రొత్త శరీర జన్మ వచ్చేదాకా ఎందుకు గనక! నీవు ఇప్పుడే విప్రుడవు సుమా!" అంటాడు.

పాప వర్తనుండు బ్రాహ్మణుండయ్యును నిజము శూద్రుకంటె
నీచతముడు

సత్య శౌచ ధర్మశాలి శూద్రుండయ్యు నతడ సద్ద్విజుండయనిరి
మునుల

అంటాడు. ఇది ఎంతో ముఖ్యమైన విషయము. ఏ కులంలో పుట్టినవారు ఆ కులానికే చెందాలి అనేది వైవస్వత మనువనే రాజు చేసిన శాసనము. కాని నైతిక శాసన రీత్యా (Natural Law) యీ పై శ్లోకంలో చెప్పినట్లు సత్య శౌచ ధర్మశాలి ఏకులంలో పుట్టినా బ్రాహ్మణుడే. పాప వర్తనుడు ఏ కులంలో పుట్టినా నీచుడే. రాజ శాసనానికి వ్యక్తులూ — మానవులూ — బద్ధులే. కాని నైతికశాసనానికి లోబడె రాజశాసనం ఉండాలి. ఉంటుంది. ఇది ప్రత్యేకవిషయాల్లో వర్తిస్తుంది. ధర్మవ్యాధుని విషయంలో కౌశికునికి సంబంధించిన మేర ఆ నైతిక శాస్త్రం ప్రవర్తించిందని అర్థం. ధర్మవ్యాధుని సంగతి తెలియనివారికి అతడు రాజశాసనం ప్రకారం శూద్రుడె. ఇన్ని ఎరిగిన మనకు అతడు బ్రహ్మ పదార్థ తత్త్వ విజ్ఞాని అయిన బ్రాహ్మణుడే అనేది గమనీయం.

కౌశికుడు ధర్మవ్యాధుని వద్ద సెలవు తీసికొంటూ, "మహానుభావా! నీవు ఈ కులంలో పుట్టావు గదా! అని ఏ క్షణాన కూడ కించపడకు సుమా! నీవు బ్రాహ్మణుని కంటే గొప్ప స్థితి కలవాడ"వంటాడు. అందుకు ధర్మవ్యాధుడు నేనెప్పుడూ అలా దుఃఖించే వాడిని కానేకాదు అంటాడు. కౌశికుడు అతడికి ప్రదక్షిణంగా వెళ్ళిపోతాడు.

## 4. కుమారస్వామి అవతరణ

మార్కండేయుడు ధర్మరాజాదులకు సద్గోష్ఠినిస్తూ కుమారస్వామి అవతార విషయానికి పూర్వం ఆయన తండ్రియైన అగ్ని ఆయన వంశం విషయాలు చెప్తాడు. అగ్ని అనేది కూడ, వ్యాసుడిలాగా ఒక పదవి. ఆ పదవిలోకి ఎంతోమంది వస్తూ పనిచేస్తూ వెళ్తూ ఉంటారు. అందుకె ఐదగ్నులూ ఐదు పేర్లు ఉంటూ ఉన్నవి.

కుమారస్వామి పుట్టడానికి ముందే ఆయన భార్య దేవసేన పుట్టి ఉండటం చిత్రమైన విషయం. కాలక్రమేణ కుమారస్వామి విషయంలో మనలా ఉన్నదని పించదు. అతడు పుట్టిన ఐదు రోజుల్లోనే రాక్షసులను జయించు తాడు. ఆరో రోజున దేవసేనను పెండ్లిచేసికొని తల్లులకు అందరకు వరాలు ప్రసాదిస్తాడు.

ఇంద్రుడొకప్పుడు రాక్షసులకు ఓడిపోయినవాడై వాళ్ళను జయించ కలిగిన మహాసేనానికోసం అన్వేషిస్తూ వుంటాడు. ఆ సమయంలో మానసమనే పర్వతం దగ్గర తారుండంగా కేసి అనే రాక్షసుడు వెంటదగులటంచేత దేవసేన "రక్షింపు, రక్షింపు"మని గోలపెట్టడం వింటాడు. అప్పుడు వానినుండి ఆమెను ఇంద్రుడు రక్షిస్తాడు. ఆ దేవసేన అరిష్టనేమి అనే ప్రజాపతి కూతురు. ఈమె అక్క దైత్యసేన. వీరిద్దరూ ఆ పర్వత సానువుల్లో తిరుగుతుండగా ఈ కేసి వారిని వెంటదగులుతాడు. దైత్యసేన కేశితో వెళ్ళి పోవడాని కిష్టపడుతుంది. ఆ కేశి అప్పటికీ ఈ దేవసేనను వదలక వెంట దగులుతాడు. ఆతడి బారినుండి ఇంద్రుడు రక్షించి ఆమెకు వరమిస్తా నంటాడు. అప్పుడామె పౌరుషవంతుడైన వానికిచ్చి తనను పెండ్లి చేయ వలసిందని కోరుతుంది. అతడు సరెనంటాడు.

ఆ తరువాత ఇంద్రుడు ఆమెను బ్రహ్మదగ్గరకు తీసికొనిపోయి ఈమెకు శూరుడైనవాడు భర్తకావాలి అలా అనుగ్రహించుమంటాడు. బ్రహ్మ "అలాగే" అని "ఈమెను చేసికొనేవాడే మీకూ సహాయంచేసి మిమ్మల్ని గెలిపిస్తాడు" అంటాడు.

ఇలా వుండగా సప్తమహాఋషులు అమావాస్య హోమం చేస్తుండగా వారి భార్యలు వారికి సహాయం చేస్తూ హోమగుండం వద్దకు వస్తూ వెళ్తూ ఉంటే హోమగుండంలోని అగ్ని దేవుడు వారిని చూచి మోహిస్తాడు. హోమం అయిన తరువాత ఈ మోహకారణంచే దిగులుతో ఉంటాడు. ఆయనభార్యయైన స్వాహాదేవి ఈ సంగతి తెలిసి ఒక చమత్కారమయిన పనిచేస్తుంది.

తాను ఆ సప్తమహాఋషుల భార్యల రూపాల్ని ధరించినదై ఈయన వద్దకువచ్చి ఆయనను అలరిస్తుంది. అగ్ని తాను తను ప్రేమించినవారినెపొందు

తున్నట్లు భావించి తన భార్యనె అనుభవిస్తాడు. ఆయన రేతస్సును ఆమె ధరించి ఆ తరువాత ఒక పక్షిరూపంలో ఆకాశంమీద ఎగిరిపోయి శ్వేత పర్వతంపై దర్భలపొదలో ఒక బంగారు కుంభంలో ఆ శుక్లమును జాగ్ర త్తగా పెట్టి తిరిగి భర్త దగ్గరకు మరియొక మహాముని భార్యవేషంలో వెళ్ళి, ఆయన్ను అలరించి తిరిగి ఇలాగే చేస్తూ ఉంది.

కాని ఆరుగురి శరీరాల్ని తాను ధరించగలిగిందిగాని, అరుంధతి ఆకా రాన్ని పొందటంచేతనయిందికాదు. ఆ కారణంచేత ఆరుసార్లే ఆ కుంభంలో శుక్రమును ఉంచడం అవుతుంది. అప్పుడా కుంభంనుంచి ఆరు తలలతో పన్నెండు బాహువులతో కుమారస్వామి ఉద్భవించుతాడు. పాడ్యమినాడు ఆ కుంభంలో శుక్రమును పెట్టడం పూర్తి అయితె, విదియనాడు గర్భవ్యక్తిగా అవుతాడు కుమారస్వామి—తదియనాడు శరీర మాత్రా విర్భావాన్ని పొందు తాడు. చతుర్థికి సకలావయవ సంపూర్ణుడయి ఉదయించాడు. పంచమినాటికి పెద్ద ఆకారం కలవాడై పెరిగిపోతాడు. త్రిపురాసురులను చంపడానికి శివుడు ప్రయోగించిన ధనస్సు నందుకొని క్రౌంచపర్వతాన్ని ఛేదించి, ఏనుగులను ఛేదించి, పెద్దగా అరిచేటప్పటికి ఇంద్రుడు, ఈ పిల్లవాడు ఏదో అనర్థాన్ని తెచ్చిపెట్టుతున్నాడని అభిప్రాయపడుతాడు. అమరులందరు ఆతడిని నిర్జింప వలసిందని ఇంద్రుని ప్రార్థిస్తారు. అలా చేయకలిగితె వానికి ఇంద్రత్వం శాశ్వతంగా ఉంటుంది అంటారుకూడ.

ఇంద్రుడప్పుడు కుమారస్వామిపైకి సప్తమాతృకలను పంపుతాడు. వారు వెళ్ళి స్వామినేమీ చేయలేక అతడినే శరణు నడిగి తాము లోకమాతలు గనుక కుమారస్వామి తమను తల్లులుగా స్వీకరింపవలసిందని కోరుతారు. అందుకు శరవణుడు అంగీకరిస్తాడు. అగ్ని ఆశరవణునివద్దకు వచ్చి వానిచే పూజింప బడినవాడై ఆయనకు సహాయంగా నిలుస్తాడు. భూతగణాలన్నీ వచ్చి శరవణ భవునే అర్చించడం ఆరంభిస్తవి.

ఇదంతా ఎరిగినవాడై ఇంద్రుడు కుమారస్వామిపైకి దండెత్తి వస్తాడు. కుమారస్వామి రోషపూరితుడై చూచేటప్పటికి ఆయన ముఖంలోనుంచి మంటలు బయటకువచ్చి దేవతలను కాల్చివేయడం ఆరంభిస్తవి. ఇంద్రుని వజ్రం కుమారస్వామి కుడిచేతికి తగలంగానే ఒక బంగారు వర్ణంలో శక్తిని

ధరించిన పురుషుడు మేక ముఖంతో విశాఖుడనే పేర పుట్టి దేవతలపైకి వస్తాడు. ఇక గెలిచే అవకాశం లేక కుమారస్వామితో దేవేంద్రుడు సంధిచేసి కొంటాడు. ఇద్దరూ ఒకటౌతారు. దేవతలూ ఘాతాలన్నిని, వారిద్దరినీ అర్చించడం ఆరంభిస్తాయి. లక్ష్మీదేవి కుమారస్వామిని ఆశ్రయిస్తుంది. అంటే సౌభాగ్యాలూ సమకూరుతవన్నమాట.

దేవతలంతా కుమారస్వామి చేత ఓడింపబడుతారు. అప్పు డింద్రుడు వానితో చాకచక్యంగా మాట్లాడుతాడు. కుమార స్వామీ ! మిమ్మల్ని నేను గెలువలేను. అందుకని మీరే ఇంద్ర పదవిని అధిష్ఠించండి. నేను మీకు సహాయంగా ఉంటాను అంటాడు. అందుకు శరవణుడు ఇంద్రునితో "నీవే ఆ పదవిలో ఉండు నేను నీకు చుట్టములా, స్నేహితుడులా సహాయం చేస్తుంటాను" అంటాడు. అప్పుడింద్రుడు అతడ్ని తన సేనకు అధిపతిగా చేస్తాడు.

ఈశ్వరుడు గిరిజాయుతుడై వచ్చి శరవణభవుని తన కుమారుడుగా ఆదరిస్తాడు. అదేమిటి ! అగ్ని కుమారుడు గదా ! అనిపిస్తుంది. ఒకసారి ఈశ్వర పార్వతులు మైథున క్రియలో నున్న సమయాన అగ్ని, దేవతల పంపునవారికి అవరోధం కల్పిస్తాడు. అందుకని ఈశ్వరుడు తన వీర్యాన్ని అగ్నికిచ్చి ధరింప వలసిందంటాడు. ఆ వీర్యమే అగ్ని వీర్యంగానై కుమార స్వామి సంభవానికి కారణమయిందని ప్రథ. అందుకని పార్వతీ పరమేశ్వరులు బ్రహ్మదగ్గర నున్న దేవసేనను తెచ్చి కుమార స్వామికి పెండ్లి చేస్తారు. ఆ నాడు కుమారస్వామి పుట్టిన ఆరో రోజు. షష్ఠి. సుబ్రహ్మణ్య పూజలకు ప్రశస్తమైనదైంది. ఆ క్రిందటి రోజయిన పంచమినాడు లక్ష్మి యీయనను వరించింది గనుక పంచమిన లక్ష్మి ప్రీతికై పూజలు చేస్తారు.

అగ్నితో మహా ఋషుల భార్యలు వ్యభిచరించారనే అపవాదు కారణంగా ఋషులు తమ భార్యలను వదలి వేశారు. అందుకని ఆ భార్యలు వచ్చి కుమారస్వామితో చెప్పుకొని గోలపెట్టుతారు. ఆయన ఇంద్రుని చేత వారలకు ఊర్ధ్వ లోకాల నిప్పిస్తాడు. రోహిణీ నక్షత్రం ప్రక్కనే అభిజిత్తనేది ఉండేది. ఆమె తపస్సు చేసి చంద్రునికి రోహిణిపై కంటె తనపై ఎక్కువ ప్రేమ కలిగేటట్లు చేయాలని ఎక్కడికో ఎళ్ళింది. ఆ అభిజిత్ ఉండిన చోటనే ఈ ఆగ్గరినీ అగ్ని దైవత్యమనే పేర ఉంచుతారు.

కుమారస్వామి వల్ల, కుమార మాతృకల నుండి, దేవగ్రహం నుండి, యక్షగ్రహం నుండి, పితృగ్రహం నుండి, గంధర్వగ్రహం నుండి, అపస్మారం నుండి కలిగే బాధలు పోగొట్టబడుతవట. ఈ చెప్పిందే సూత్రమనుకొంటారేమో ననేమో మళ్ళి ఇలా చెప్పాడు ఎఱ్ఱన. – "నియతి కలిగి ఇంద్రియములల జయించి శుచులైన శాంతి సంపన్నులకున్ భయమొనరింపగ లేవన్నియు పుణ్య గ్రహములే యవస్థల యందున్". అని. మార్కండేయుడు అప్పుడే ప్రత్యేకంగా చెప్తాడు ధర్మరాజుతో – "ఆదిదేవుడైన మహాదేవునిపై ఎవని మనసు భక్తి వైభవంతో నుల్లసిల్లుతుందో అతడ్ని గ్రిహ వికార తతి చేరదు గాక" అని.

స్వాహాదేవి వచ్చి తనను అగ్నిదేవుడు ప్రేమించుటల్లేదని మొరపెట్టుకొంటుంది. కుమారస్వామి అగ్నిలో హవిస్సులు వేసేటప్పుడు నీ పేరుతో వేసినప్పుడే చెల్లుతుంది గాక ! అని వరమిచ్చాడామెకు.

కుమారస్వామి ఆ తరువాత మహిషాసురుణ్ణి చంపి దైత్యులను గెల్చి, దేవతలను గెలిపిస్తాడు. ఈ స్వామి కథ చదివితే, వింటే గ్రహబాధ కలుగదని ఫలశ్రుతి.

## 5. సత్యాద్రౌపదుల సంభాషణము

మార్కండేయుడు ధర్మరాజాదులతో పుణ్యకథా ప్రసంగం చేస్తున్నప్పుడు ద్రౌపదీ సత్యభామలు ఒకచోట కూర్చొని పిచ్చాపాటీ మాట్లాడుకొన్నారు. సత్యభామ ద్రౌపదిని అడుగుతుంది. "నీ భర్తలు ఐదుగురూ నీకు ఎంతో అనురక్తులుగా ఎలా ఉంటున్నారు ? అలా ఉండటానికి నీవేమి మంత్ర తంత్రాలు చేశావో చెప్పవా" అంటుంది.

ద్రౌపది "ఏమమ్మా నన్ను దుష్టస్త్రీగా భావిస్తున్నావా ! అలా అడగడం వల్ల నీవే మా అన్నకు తగినదానవు కావన బుద్ధి అవుతున్నది" అన్నది. "నేను చేసిందల్లా నా బుద్ధినీ వారి సత్వృత్తితో ఏకం చేయడమె తప్ప మరేం లేదు. ఇతర్లను వారితో సమానంగా ఎంచనే ఎంచను. వారికి కావలసిన పనులు స్వయంగా నేనే చేస్తాను. పరివారాలను జాగ్రతగా చూచుకొంటాను,

ఆస్తి పాడీ పంటా అన్నీ జాగ్రతగా చూసుకొనేది నేనె. అంతేకాని మందులూ మంత్రాలూ పనికిరానివమ్మా' అంటుంది.

ద్రౌపది కేవలం అనురక్తివల్లనె తాను తన భర్తల ప్రేమలను పొందు తున్నట్లు చెప్పింది. దంపతులు స్నేహితులుగా ఉండాలి. స్నేహం అనే మనఃప్రవృత్తి ఇద్దరిమధ్య ఎల్లప్పుడూ ఉండాలి. అది పోరాదు. ద్రౌపది సాత్త్విక ప్రవృత్తి కలిగిన యీ పాండవులు తనకు భగవంతునివంటి వారం టుంది. అంటె అర్థం. భగవంతుడంటే ఏమిటో ఎఱిగి తెలియాల్సిన విషయ మది. భగవంతుడంటె గుళ్ళో ఉండే సల్లరాయి అని మాత్రం తెలిసినవారికి ఈ ద్రౌపది చెప్పిన మాట అర్థంకాదు. భగవంతుడు సర్వగముడు, సర్వ స్థుడు సర్వజ్ఞుడు, అతడు ప్రతిఒక్కరి మనసులోనూ ఉంటున్నవాడు అని తెలిసి ఆమె అలా అంది. తన మనసులో ఎల్లప్పుడూ భగవంతుడు ఉంటు న్నట్లుగా భర్తలూ ఉంటూనే ఉంటారని ఆమె చెప్పింది.

ద్రౌపది భర్తలు పాండవులు. అనగా సత్త్వగుణ ప్రధానులు. ధర్మరాజు అష్టాంగ యోగానికి ప్రతీక. అలాగే మిగిలినవారు అభయవృత్తికి ఋజు ప్రవర్తనకు, వైరాగ్యవృత్తికి, జ్ఞాన ప్రకాశానికి ప్రతీకలు. వీరి ఈ సాత్త్విక భావాలతో ద్రౌపది ఏకమై ఉంటూ ఉండటంవల్లనే ఆమెయందు భర్తలు అనురక్తులై ఉంటున్నారు. ఆమె చెప్పిన పరమార్థమిదె.

ఐతె భర్త దుర్వృత్తి కలవాడైతే అప్పుడుకూడ వానితో ఏకమై ఉండాలా అని మనకు సందేహం వస్తుంది. ఆధ్యాత్మికంగా ఎవరిబ్రతుకు వారిదె. ఎవరి పుణ్యం ఎవరిపాపం వారిదె. అతడు దుష్ట ప్రవృత్తి కనక అతడితో పాటు తనూ దుష్టముగానే ఉండవచ్చునని అనుకోవటం సరికాదు. అతడ్ని తప్పు పట్టక పోవటం మాత్రం చేయవచ్చుకాని తానుకూడ దుష్టగుణాలు కలది కావటం భారత స్త్రీకి ఎక్కడా పూర్వగ్రంథాల్లో చెప్పబడలేదు. భర్త సాత్విక వృత్తులు కలిగినవాడైతె అతడిని అన్నివిధాలా అనుసరించి నందువల్ల ఆమెకు ముక్తి లభించగలదు. కాని అతడు దుష్టుడయినప్పుడు తాను అతడ్ని అనుసరించే అక్కర ఏది? ఈ సూత్రాన్ని అనుసరించే ఇప్పటి వైవాహికపరమైన శాసనాలు మనదేశంలో అమలులోకి వచ్చినవి.

భారతంలో చెప్పుతున్న విషయం పరమార్థ విషయం! వేదార్థం !! సాధన !!! ద్రౌపదిని సాధకుడు అనుకొంటె భర్తలు సత్ వృత్తులు కనుక

వారిని అనుసరించడమె మార్గమని బోధ చేస్తున్నాడు వ్యాసమహర్షి. మోక్ష సాధనకు గృహస్థ ధర్మంలో నడుపుకోవడానికి గాను చెప్పిన బోధను అలాగే అర్థంచేసికొనవలసి ఉంటుంది.

శ్రీ కృష్ణుడు నిర్వృతి తత్త్వం. సత్యభామ ఆనంద తత్త్వం. నిర్వృతి తత్త్వాన్ని చేరిన ఆనంద తత్త్వం బ్రహ్మానందంగా పరిణమించగలిగిన పరిస్థితి. వ్యాసమహర్షి సాత్త్వికవృత్తులతో సాధకుడుమని, వాటిని బలపరుస్తూ భార్య భర్తను బలపరుస్తున్న విధంగా సాధన సాగించాలనే బోధ చేయడానికి సత్యభామ అడిగితె ద్రౌపది చెప్పిందని వ్రాశాడు. సత్యభామ తెలియని విషయం ద్రౌపదిని అడిగినట్లుగా తలచరాదు. ఇతిహాసంలో వ్యాసమహర్షి ఇలా రచనచేసి సాధకులకు కర్తవ్యం చెప్పాడుగాక.

## 6. ఘోష యాత్ర

శ్రీకృష్ణుడూ మార్కండేయ మునీ వచ్చి ధర్మరాజాదులను కామ్యక వనంలో పరామర్శించి వెళ్ళిం తర్వాత, ధర్మరాజాదులు ఆ వనాన్ని వదలి ద్వైతవనానికి వెళ్ళారు. అక్కడకు కరిపురంనుంచి ఎవరో ఒక పౌరుడు–బ్రాహ్మణుడు– వచ్చి వీరిని చూచి వెళ్ళి ధృతరాష్ట్రునితో వీరు చాలా దుఃఖంతో ఉన్నారని చెప్తాడు.

ధృతరాష్ట్రుడు పాండవుల్ని ఒకొక్కర్నీ తలుచుకొని దుఃఖిస్తాడు. ఈ చికాకు తన కుమారుడి నేరంవల్లనె వచ్చిందంటాడు. భీముడి బలం, అర్జునుడి బలం తలచి తలచి అమ్మో అంతటి కుమార సింహాలు, ధర్మరాజు అనే అడ్డు ఉండటంచేత అలా దుఃఖాలు పడుతున్నారుగాని వాళ్లు తిరగబడితె ఇంకేముంది– కర్ణ సౌబల సహితంగా నా నూర్గురు పుత్రులనూ అడవిని కాల్చినట్లు కాల్చేయరా వారి కోపాగ్నితో అంటాడు, రాత్రి వెళ్ళి పగలు వస్తుంది వారికి– ఎప్పుడో మనకూ అలాగే సుఖం వెళ్ళి దుఃఖం రావచ్చు. అర్జునుడు వస్తుతః ఎంతో గొప్పవాడే అయి యుండగా ఇప్పుడు మహేంద్రుడి నుంచి దివ్యాస్త్రాలను సంపాదించాడట. ఇంకేముంది ఈ సర్వ భూ ప్రపంచమూ సిరిసంపదలూ అన్నీ వారి సొత్తే అవుతవి అని తికమకపడుతుంటాడు ధృతరాష్ట్రుడు.

ఇదంతా వింటున్న కర్ణ శకుని దుర్యోధనులు ముఖ ముఖాలు చూసుకొని ఏకాంత ప్రదేశానికి వెళ్ళి తమతమ భావాలు చెప్పుకొంటారు. కర్ణుడంటాడు "పాండవులు ఇప్పుడు దుఃఖంలో ఉన్నారు— నీవు సర్వంసహా రాజ్యలక్ష్మిని పొంది ఇంద్రుడు సురలోకమేలుతున్న విధంగా ఈ పృథ్వినేలుతున్నావు. నీ మహావైభవమంతా ప్రకర్ష అయేటట్లు ద్వైతవనం వెళ్ళి మన పగవారైన పాండవుల కళ్ళు చెదరిపోయేటట్లు చేసి వారు ఇంకా పగచేటట్లు చేయాల్సింది. సంపదలకు తగిన ఫలం ఏమిటి? మిత్రజన సంతోషమూ శత్రుజన ఖేద మునేకదా— భార్యలూ పరివారం వందిమాగధులూ పౌరులతో సహా పోవాల్సిం"దంటాడు.

దుర్యోధనుడు వెంటనె ఈ ఉపపాదనను ఒప్పుకొంటాడు. కాని ఒక చిక్కు వచ్చిపడుతుంది. ధృతరాష్ట్రుని సరెననిపించడం ఎలాగ? వీళ్ళు వెళ్తామంటె ఆయన "మీరు ఆ పాండవులతో పోట్లాడ్డానికె వెళ్తున్నార"ని తప్పకుండ "వద్దు"అంటాడు. అంతేకాక, తతఃపూర్వం వీరిచేత వారు ఎన్నో బాధలు పడ్డారు గనక భీముడు చూస్తే మీదపడి కొట్టి ఊరుకుంటాడు కూడ నంటాడు.

ఇలా అనుకొని ఒక పథకం వేస్తారు. ద్వైతవనం నుండి ఒక గోపాల కుణ్ణి పిలిపించి వానిచేత అక్కడ మృగజంతుబాధ ఎక్కువగా ఉందిగనక దుర్యోధన రాజును వేటకు అక్కడకు పంపాల్సిందని అడిగిస్తారు. అందుకు సరేననబోతూనే ధృతరాష్ట్రుడు తన అనుమానం ఫలాన అని పాండవుల్ని కించపరుస్తారేమోననీ ! అంటూ దుర్యోధనాదు లనుకొన్న విధంగానే అడ్డం కొట్టుతాడు. చివరకు వీరిచేత "పాండవులను ఉడికిలించముగాక" అనేమాట పుచ్చుకొని, వెళ్ళడానికి అనుమతి నిస్తాడు.

వెంటనే వారంతా ఆభరణాలు ధరించి భార్యలతో సహా ప్రియబంధువులతో సహా వెళ్తారు ద్వైతవనసరోవరం దగ్గర మకాం చేయడానికి. మృగయా వినోదం అయింతరువాత ఎన్నో జంతువుల్ని వేటాడి చివరకు ఆ సరోవరం చేరుతారు. అక్కడి ప్రకృతి ఎంతో రమ్యమై ఆకర్షణీయమై ఉంటుంది. అక్కడకు కొంచెం దూరంలోనే ధర్మరాజు మునిజనులతోనూ, పవ్యఫల

మూల విశేషాలతోనూ సద్యస్క్రందమనే యజ్ఞంచేస్తూ ఉంటాడు. యజ్ఞ దీక్షలో ఉంటాడు.

దుర్యోధనాదులు ఆ సరోవరం దగ్గరనే క్రీడాగారాలు కట్టాలని ప్రయత్నిస్తారు. ఇంద్రుడికి వీరు చేస్తున్న దుర్బుద్ధి పూర్వకమయిన పనికి చిరాకు కలిగింది. వెంటనే చిత్రసేనుడనే గంధర్వ రాజును పురిగొల్పి పంపుతాడు. ఆతడి భటులు దుర్యోధనుని భటులవద్దకు వచ్చి, ఇక్కడ మీరేమీ చేయకండి ఇది చిత్రసేనుడి సరోవరం. ఆయనకు ఇది కేటాయింపబడింది అంటారు. దుర్యోధనుడు వాళ్ళను తన్ని పంపుమంటాడు. కాని గంధర్వుల సంఖ్య పెరిగిపోతుంది. పెద్ద యుద్ధమవుతుంది. కర్ణుడు చాలా సేపు నిలచి పోట్లాడుతాడు దుర్యోధనుడితోపాటు. కాని గంధర్వుల సంఖ్య పెరిగి పెరిగి ఒకొక్కడికి పదిమంది చొప్పున పోరాడుతూ చివరకు కర్ణుడి రథం విరగకొట్టి ఆతడ్ని చితక గొడతారు. కర్ణుడు పారిపోతాడు. దుర్యోధనుడి రథాన్ని కూడ వారు పగలగొట్టి అతడ్ని పెడరెక్కలు విరిచికట్టి తమ రథాలమీద పెట్టి తీసికొని పోతుంటారు. ఇతర దుశ్శాసన ప్రముఖులైన వీరుల్ని కూడ బంధిస్తారు. ఇక మిగిలింది పౌరులూ మంత్రులూను, కర్ణుడు మాత్రం వికర్ణుడి రథంపై ఎక్కి పారిపోయినాడు. వాళ్ళతో వచ్చిన పౌరులకు ఏదిక్కూ తోచక, ధర్మరాజు వద్దకు గబా గబా వచ్చి ఇలా ఇలా జరిగిందని మొరపెట్టుకొని రక్షింపవలసిందంటారు. ధర్మరాజు ఏమీ చెప్పకముందె భీముడు "ఓహో మనం చేయవలసిన పనిని గంధర్వులు చేశారు పోనీయు" మంటాడు. "విధాతృడు ఎంత చతురుడబ్బా" అంటాడు. "విపరీత స్థితిలో మనం ఉన్నామని మనను ఎకసక్కెం చేయడానికి వచ్చి చిత్తుగా అనుభవించారు చీకాకును. వారిపై దయా, కృపా ఇవేవీ తెచ్చిపెట్టుకోవద్దంటాడు.

ధర్మరాజు అప్పుడు ధర్మసూక్ష్మం చెప్తాడు. "శత్రువులయితె యుద్ధం చేయడం నొప్పించడం ధర్మమె. అది అలావుంచు, అది యుద్ధంలో, ఇప్పుడు అదికాదు కావలసింది! మనకూ దుర్యోధనునికీ మధ్యగల సంబంధం! ఒకే అన్వయానికి చెందిన వాళ్లం, వాళ్ళు ఇతరులవలన పరిభవం పొందేటప్పుడు ఒకరి కొకరం సహాయం చేయకపోతే అది లోకనింద్యము. శరణాగత రక్షణము రాజులయినవారికి ధర్మం. నీ యంత బలవంతునకు అలా చేయటం కర్తవ్యం సుమా!" అంటాడు.

ఇక్కడ కర్తవ్యం అనేది ముఖ్యమైన బోధ. ప్రపంచంలో ప్రతికె జనులందరికీ ఏ సమయంలోగాని ఒకానొక కర్తవ్యం ఉంటుంది. అది వ్యక్తిగా తాను సమాజానికి చేయవలసిన సేవ అయి వుంటుంది– అది చేయక తప్పనిది; కర్తవ్యం చేయకుండా బద్ధకించేవాడు పాపి. ఈ సమాజ సేవే స్వధర్మం. స్వధర్మాన్నుంచి ఎప్పుడూ వికంపితుడవు కావద్దు అని చెప్పే బోధ ఇదె. కర్తవ్యం చేయకపోతె నీవు సమాజానికి పనికిరావు గనక నీ అవసరం ఈ ప్రపంచంలో అక్కర్లేదన్నా ఆశ్చర్యం లేదు.

ఇంత విషయం అర్థంగాక– స్మృతిలో లేక– భీముడు అంటాడు "ఓహో వీళ్ళు కాదా! నాకు విషం పెట్టింది నీటిలోకి ద్రోసింది. ఇంట్లో పెట్టి నిప్పు పెట్టింది! పాంచాలిని అవమానించింది! వీళ్ల మనకు చేయని ఎగ్గు ఉందా? వీళ్ల మీద దయ చూపటం మనకు కార్యహాని కదా" అంటాడు. ధర్మరాజు ఒప్పుకోడు. వ్యక్తిగత వికారాలు. కర్తవ్యం– స్వధర్మం– చేయడంలో అడ్డు రాకూడదు అనేది ధర్మాలలో పరమ ధర్మం. అందుకని భీముని వెళ్లి గంధర్వరాజుతో మాట్లాడి వారిని విడిపించుకు రమ్మంటాడు. అలా వాళ్ల మాట వినకపోతే యుద్ధం చేసైనా సరె విడిపించుకురమ్మంటాడు. చివరకు నేనే బయలుదేరేవాడనుగాక ఈ యజ్ఞ దీక్షవల్ల నేను రాకూడాలన్ను అంటాడు. ఇక భీముడు మారు మాట్లాడక వెళ్తాడు అర్జున నకుల సహదేవులతోసహా.

అక్కడకు వెళ్లిన తరువాత ఆ గంధర్వులతో ముందు అర్జునుడు మాట్లాడు తాడు. ధర్మరాజు వీరిని విడిపించుకు రమ్మన్నాడు. మీకూ మాకూ ఇప్పుడు యుద్ధం రాకుండా ఉండేట్లు వీళ్లను వదలిపెట్టాల్సింది అంటాడు. వాళ్ళు ధర్మరాజు మాకు ప్రభువు కాడుకదా గంధర్వరాజుతో మాట్లాడుమంటారు. అదేమీ కుదరదుగాక. ముందుగా సామ వచనాలు చెప్పాలి గనక చెప్పాను వినకపోతె అనుభవించండని బాణాలు కురిపిస్తాడు. ఆ గంధర్వులు అర్జునుని ఎదుర నిలువలేక బంధితులతో సహా ఆకాశంమీద ఎగిరిపోవాలని ఆరం భిస్తారు. వెంటనే అర్జునుడు ఆకాశానికీ వారికీ మధ్య బాణాలతో కప్పు కట్టి అలా వాళ్ళు వెళ్లటాన్ని నివారిస్తాడు.

చివరకు చిత్రసేనుడు అదృశ్యమై యుద్ధం చేస్తుంటాడు. ఆయన వింటి నారి మోతను గ్రహిస్తూ ఆ వైపు బాణాలు వేసి చిత్రసేనుడి శరీరం తూట్లు

పడేటట్లు కొట్టుతాడు అర్జునుడు. చివరకు చిత్రసేనుడు దగ్గరలో సంధి చేస కొనే పద్ధతిలో అగుపడినవాడై — అర్జునుడితో — అతడి తండ్రియైన ఇంద్రుడే తనను వెళ్ళి యీ దుర్యోధనాదుల మదమణచుమనడం చేత అలా అతడ్ని తీసికొనిపోతున్నామనీ మరొక మాట చెప్పక తమను వెళ్ళనీయు మనీ అంటాడు. తనకేమీ పాండవులపై పగలేదు లెమ్మంటాడు.

అర్జునుడు— "ఇంద్రుడో గింద్రుడో నాకు తెలీదుగాక. ముందు వీళ్లను మా అన్నదగ్గరకు తెచ్చి చూపి తరువాత ఆయన చెప్పినట్లు చేయు"మని వారందరినీ, అన్నగారి వద్దకు తీసికొనివస్తాడు.

తీరా ధర్మరాజు దగ్గరకు వారంతా రాంగానే ధర్మరాజు చిత్రసేనుని పూజిస్తాడు. స్వామీ ఈ సుయోధనుడు మీచేత తన అమాత్యుల సహితంగా చంపబడనందుకు మేలయింది. మా కులానికి ఎంతో హాని జరగకుండ తప్పిపోయింది గాక. వీళ్ళను మాకుగాను మీరు వదలండి అని ప్రార్థిస్తాడు. దుర్యోధనాదులు చెఱ వదలఁటుంది. గంధర్వులు ధర్మరాజు మాటలు విని "ఓహో ఈయన బలం ఈ మాటల చాకచక్యమా !" అనుకొన్నారు. "ఎంత ధర్మాత్ముడు" అన్నారు !

చిత్రసేనుడు వెళ్లి ఇంద్రునితో ఇదంతా చెప్తాడు. ఆయన యుద్ధంలో చనిపోయిన గంధర్వులపై అమృతం కురిపించి వారిని బ్రతికిస్తాడట. ఉదాత్తమైన ధర్మరాజు శీలం ఇక్కడ ప్రకటితమయింది. చెరపకురా చెడెదవు అనే లోకోక్తి చరితమయింది. "ఇలా అయితే బాగుండు"ననే సంకల్పం, మనసు యొక్క వికారం. అది అలా జరగదు. భగవంతుడు అనే వాస్తవం (భగవంతుడనే Concept వాస్తవమనేదే !) ఎలా ఉంటుందో అలా జరుగుతుంది. ఇది అర్థం కావటమె—కేవలం బుద్ధికె అర్థం అవడం చాలదుగాక— అనుభూతికి అందాలి. అలా అనుభూతికి అందటమె ధ్యానం. లేదా ముక్తి. ఇది అనుభవిస్తేనేగాని మనకు తెలిసిందనుకో కూడదు.

ఈ కథలో అంతరార్థం మోక్ష సాధనకుపయోగించేది ఉంది. సాధకునిలో సత్ వృత్తులూ దుర్వృత్తులూ కూడ ఉంటవి. సత్ వృత్తులపై ఆధారపడుతూ సాధకుడు మోక్షగామికావాలి. దుర్ వృత్తులను నాశం చేయడానికి చిత్రసేనుడు వచ్చాడు. ఇతడు సద్వృత్తి అనుకోవద్దు. ఒకొక్కప్పుడు కొన్ని చిల్లర సాధ

వల్ల పిల్ల తామసికవృత్తుల్ని జయించటం అవుతుంది. పిల్లవాడు అల్లరి చేస్తుంటె పెద్దవారు ఆతడిని శిక్షించి తత్కాలానికి కూర్చోబెట్టినట్లు : ఆ భయం పోంగానే మళ్లీ ఆ దుర్వృత్తి విజృంభించటం ఖాయం. అందువల్ల చిత్రసేనుడు (దుర్వృత్తులయిన) దుర్యోధనాదులమీద పొందిన జయం. సాధకుని జయం కాదు. తత్కాలానికి తామసిక వృత్తులు లొంగినవై వేషం వేసుకొని బాగుపడినవవుతవి. తామసిక వృత్తులు పూర్తిగా అణచివేయబడా లంటే అవి వేషం వేసికొని మంచిగా ఉంటే చాలదు. సాధకుడు స్వయం సాధన ద్వారా తామసిక వృత్తుల్ని పూర్తిగా అణచే ఉపాయం చూసుకోవాలని చెప్పుదమె వ్యాసుని ఆశయం ఈ కథను చెప్పడంలో అని పిస్తుంది.

—: ఇది పంచమాశ్వాసము :—



# మ హా భా ర త క థ లు

[ అరణ్య పర్వము- షష్ఠాశ్వాసం ]

## 1. దుర్యోధన ప్రాయోపవేశము

ఘోష యాత్రానుభవం దుర్యోధనుని బాధ పెట్టింది. దుర్యోధనుడు రాజస గుణ ప్రధానుడు. రజోగుణం ఒక పనిని చేయటానికి ఎంతటి ఉద్ధృత ప్రభావాన్ని ఇస్తుందో దానివల్ల వచ్చే చెడు ఫలితం కారణంగా అంతటి ఉధృతమైన దుఃఖాన్ని కూడ ప్రసాదిస్తుంది. జరిగిన పరాభవాన్ని తలుచుకొని తలుచుకొని నరక యాతనలను అనుభవిస్తూ ఒంటరిగా ఉంటాడు దుర్యోధనుడు ఆ వనంలోనె ఒకానొక దేరాలో.

“అయ్యో ఆ యుద్ధంలో చచ్చిపోయినా బాగుండేది. ఇప్పుడు వెళ్లి భీష్మ ద్రోణులనూ ఇతర్లనూ ఎలా చూచి బ్రతకటం” అనుకొంటున్నాడు. ఈ సమయంలో తనను యుద్ధమధ్యంలో వదలి పారిపోయిన కర్ణుడు, తిరిగి వచ్చి కలిసి పలకరిస్తాడు. పాపం కర్ణునకు ఈ దుర్యోధనాదులు ఖైదీలై వెళ్లి పాండవుల కటాక్ష శౌర్యాల కారణంగా వదిలింపబడ్డారనే సంగతే తెలీదు. తాను పారిపోయి తిరిగి తిరిగి వచ్చి గంధర్వుల్ని జయించి వచ్చి దేరాలో కూర్చొన్నాడీ దుర్యోధనుడని అతడ్ని పొగడటం ఆరంభిస్తాడు.

అప్పుడు దుర్యోధనుడే తన భంగపాటును స్వంత పలుకుల్లో చెప్పుకో వలసి వస్తుంది. చచ్చిన చావు అవుతుంది. జరిగిన విషాద ఘటనంతా వర్ణించి పాండవులు తనను విడిపించారు చెఱనుండి అని చెప్తాడు. పైగా “ఆ గంధర్వ నాయకుడు మనం చేసిన దుర్మంత్ర మంతా ధర్మరాజుతో చెప్పేడు నా యెదుటనే. నేను సిగ్గుతో చచ్చిపోయి భూమి పగిలి అందులో ఎందుకు దిగిపోకూడదా అనుకొన్నా” నంటాడు. మళ్లీ మళ్లీ ఇదె తలుచుకొని “ఇంకా నేనెందుకు బ్రతికిఉండాలి ? అప్పుడే చంపబడితె స్వర్గానికి పోయేవాణ్ణి. ఇక ఇప్పుడు ప్రాయోపవేశం చేసి శరీర త్యాగం చేస్తాను. తిరిగి కరిపురానికి వచ్చి అందరి ముఖాలూ చూడజాలనుగాక” అంటాడు. అంతటితో ఆగక “విను దుర్వినయాత్మకుడగు జనుడుజ్జ్వలమైన సిరియు సద్విద్యయు గల్గిన, నందు మెలగనేరక చెనటి తెఱంగునకు జొచ్చి చెడి పోవుతుధిన్” అంటాడు.

అంతటి దుఃఖభాజనమైన స్థితి వచ్చినప్పుడు గాని నిజమైన మాటలు మనిషికి స్ఫురింపవు కావలె వస్తుతః గర్వియై యుండేవాడికి. వినయపూర్వకమైన మనసు లేనివాడికి చాలా సిరిసంపదలు కల్గినప్పుడు కూడ చక్కగా అనుభవించలేనివాడై చెనటి మార్గాలు త్రొక్కినవాడై చివరకు చెడిపోతాడట! ఈ సత్యం అప్పటికి వాని బుద్ధికి తెలిసింది. మళ్లీ ఆ బుద్ధి కొద్ది సేపట్లో మారిపోతుందిగాక.

దుర్యోధనుడు తన తమ్ముడైన దుశ్శాసనుడితో "వెళ్లి, నీవు రాజ్యం చేసుకో నాయనా" అంటూ "శత్రువులను జయించు. బంధువుల్ని మిత్రుల్ని పోషించు, మంచి వారికి కానుకలిచ్చి రక్షించు" మంటాడు. ధర్మరాజాదుల గురించి ఏమాట చెప్పడు. పాపం దుశ్శాసనుడు దుర్యోధనుడి కాళ్లపై బడి భోరున ఏడుస్తాడు "అలా వద్దు అలా వద్దు" అంటూ. వాణ్ణి చూసి దుర్యోధనుడూ ఏడుస్తాడు.

కర్ణుడు వీళ్లద్దర్నీ వారించి, "ఒకానొక అల్పుడిలాగా సుఖాల ననుభవించాల్సిన నీ శరీరాన్ని వదిలేస్తానంటున్నావా? నీవు ఇంత శోకంలో పడటంవల్ల నీ చుట్టూ ఉండేవారి నందర్నీ శోకంలో ముంచేటట్లున్నావు. పాండవులచేత వదలింపబడ్డందుకు బాధపడుతావెందుకు? నీవు రారాజువు. నీ రాజ్యంలో ఈ పాండవులు పాలితులవంటివారు. నీకు అవసరం వచ్చింది కనుక వారు నీకు సహాయం చేసితీరాలి. అదె చేశారు. అందుకు నీవు చిన్నబోవాల్సిన పనిలే"దంటాడు. "వాళ్లను జూదంలో నీవు గెలవడం చేత వాళ్ళు నీకు సేవకులు. నీ సేవకులు నిన్ను రక్షించుకొనడం వారి ధర్మం. నీవు చింతించాల్సిన పనేమీ లే"దంటాడు. కర్ణుడి మాటలు ఎంత సమయస్ఫూర్తిగా ఉన్నాయో గమనించడం అవసరం.

ఈ మాటలు అంతవరకె చెప్పాడు కర్ణుడు. ఈ మాటలు వింటూనె శకుని, పై ఊహలకు చిత్రమైన మరొక ఊహ చెప్తాడు. "ఈ పాండవులు నీకు మంచిపని చేసిపెట్టారని నీకు అనిపిస్తె వాళ్లను పిల్చి రాజ్యం సగం ఇచ్చేసి వాళ్లతో కలిసి మెలిసి మిత్రుడుగా నుండి నీ రాజ్య భాగం నీవు తీసికోరాదా అంటాడు. కర్ణుడీ సలహా ఈయలేదు. కర్ణుడు మంచి వైపునకు పోనే పోని బుద్ధిని కన్పరుస్తూ ఉంటాడు. ఒకొక్కప్పుడు, ఎప్పుడన్నా తన

పౌరుషం, ప్రకర్ష, దానం సద్గుణం ఇవన్నీ కన్పడే విధంగా మాట్లాడు తుంటాడు. కాని ఇప్పుడు ఈ శకుని మాటలయితే ఎంతో నిష్ఫలికమైన మాటలుగా ఉన్నాయి. అయినా దుర్యోధనుడికి ఆ సలహా నచ్చదు నచ్చలేదు.

వీళ్ళ మాటల పేటినీ అతడు పాటించదలచలేదు. ఈ స్థితి చూసి, "ప్రొద్దు గ్రుంకిం"దని కర్ణుడూ శకునీ వెళ్ళి రేపు ప్రొద్దున రాగలము అంటు వెళ్ళిపోతారు. దుర్యోధనుడు ఒంటరిగా ఉన్నవాడై దర్భలు పరచి, శుచియై, ఇంద్రియాలు పనిచేయకుండా నిశ్చలము చేసినవాడై ధ్యానం చేస్తాడు. ఈ ధ్యానం చేయటంలో ఆంతర్యం భగవంతుడి సర్వవ్యాపకత్వాన్ని అనుభూతి చేయటం కాదు. తాను ఈ పాండవులను నశింపజేయుటం అనేది ఎలా జరుగుతుందీ అనే మనో సంకల్పమె. ఏ దేవుడు రక్షిస్తాడు అని :

రాక్షసులు పాతాళంలో ఉండి ఒక సభాసమావేశంలో తమ పక్షమువాడైన ఈ దుర్యోధనుడి పరిస్థితిని గూర్చి విచారిస్తారుట. రాక్షసులంటె చెడ్డ మనసులు దేవతలంటె మంచి మనసులు. వీళ్ళు వ్యక్తీకరణ (Personally) చేయ బడిన భావాలు. ఈ భావాలు కూడ అనంతమైన శక్తిని కలిగిఉంటవి అనేది పరిశోధనచేసే వారికి తెలుస్తూనె ఉంటుంది. పదిమందిలో ఒకానొకడిని దూరాన్నుంచి చూసి అతడు మనవంక తిరిగి చూసేటట్లు చేయగలం. అది కేవలం భావం చేసే పనె. అలాగే హిప్నొటిస్టులు, ఇంద్రజాలికులు, పాము మంత్రగాళ్ళు, తేలు మంత్రగాళ్ళు భావాత్మకమైన శక్తులను కలిగి ఉంటారు. ఇంతకూ ధ్యానంలో కూర్చున్న దుర్యోధనుని, దుష్టభావాలే ఆవేశించినవన్నమాట. అతడి అంతరాత్మను ఆ దుష్టులైన రాక్షసులు పాతాళా నికి తీసికొనిపోతారు. కృత్య అనే ఒక శక్తి అలా తీసికొనిపోయి వారి ముందు పెట్టుతుంది. అప్పుడు దుర్యోధనునకు శుక్రుడూ, రాక్షసులూ బోధ చేస్తారు. "నిన్ను ఆధారంగా పెట్టుకొని మేము మా విపక్షులైన వారిని జయించుదామనుకొన్నామయ్యా! నీవు ఇలా నిర్వీర్యుడిలా భయపడి ప్రాణ త్యాగం చేస్తే మేం ఏమయిపోతాము ! నిన్ను రక్షించడానికే రాక్షసులనేకులు నీకు సహాయులుగా పుట్టారు. భగదత్తు అందులో ఒకడు. కర్ణుడు నరకాసు రుడి అంశ కలిగినవాడు. అందుకె కృష్ణుడన్నా అర్జునుడన్నా అతడికి పడదు. భీష్మ ద్రోణులయితె దేవాంశ కలవారే అయినా వారి భావాలు కూడా రాక్షసా వేశమవుతాయి. పాండవులను నీవు గెలుస్తావుగాక. కర్ణుడు అర్జునుణ్ణి గెలు

స్తాడు. నీ వెందుకు ఇలా భీరువయిపోతావు. ఇంద్రుడు పాండవులకు సహాయం చేయటం అనేది తప్పదుగాక. నీ ఈ భంగపాటుకు అతడే కారణం గదా! అతడే వచ్చి కర్ణుడిపద్ద బిచ్చమడిగి వాని కవచకుండలాలు పట్టుకుపోతాడు చూడు. అలాంటి నీచము కూడ అతడు చేసేది న్యాయం.

ఇంకా నూరు లక్షల సహస్రాల సంశప్తకులు పుట్టారు. వారితో అర్జునునికి చిక్కువచ్చి పడుతుంది. ఈ మొత్తం భూమి అంతా నీ అధీనమయిపోయింది చూడు అంటారు.

దుర్యోధనుడికి ధ్యానం తగ్గి తెలివివస్తుంది. అంతే. జరిగిందంతా స్వప్నమనుకొంటాడు. కాని తనకు కలిగిన భావాలన్నీ, రాక్షసులు చెప్పిన భావాలన్నీ నిల్చి అతడ్ని మళ్ళీ దోవలో పెట్టి ఆడించటం ఆరంభించినయి. కర్ణ శకునిలు వచ్చి మళ్ళీ మాటలు చెప్పి "లే లె"మ్మని ఎత్తుకొని లేప తీసికొనిపోతారు. కర్ణుడంటాడు— "పదుమూడేండ్ల పెరవాసం అయి వర్షాలుగో ఏడు రాంగానే ఉధృతమయిన యుద్ధంలో అర్జునుడ్ని నేను చంపుతానని ఆయుధం పట్టుకొని బాసచేస్తానయ్యా!" అని.

దుర్యోధనుడు ప్రాయోపవేశం మాని కరిపురం వెళ్ళిపోతాడు— మొత్తం సతీపుత్ర పరివారంతో సహా, ఒకసారి భీష్ముడు దుర్యోధన కర్ణ సౌబలులున్న చోట తటస్థపడి "వద్దు వద్దంటుంటె తగుదునమ్మా అని ఘోష యాత్ర పేరుతో వెళ్ళావు. దాని ఫలం ఏమయిందో చూశావా? ధర్మరాజు ఉండబట్టి బ్రతికి బట్టకట్టావు. ఈ రాధేయుడు తోకముడిచి పారిపోవటం జ్ఞాపకముందా? ధర్మరాజాదులకూ వీనికీ ఎంత తేడాయో చూశావా? నిన్ను రక్షించినవారు వాళ్ళు. ఇకనైనా వాళ్ళను కలుపుకొనిమనడం నీకు పథ్యము తెలిసిందా!" అన్నాడు.

ఈ దుష్టులు ఆయన మాట లెక్కచేయక ప్రక్కకు తప్పుకుపోయి ఆయన వెళ్ళిపోయినాక మళ్ళీ కలుస్తారు, భీష్ముడెందుకు మాట్లాడానా అని పిగ్గుపడిపోతాడు.

ఇంకేమీ, ఎగ్గు తలపెట్టటం లేదు దుర్యోధనుడు పాండవులకు. పైగా వాళ్ళు చేసినట్లుగా తాను కూడ రాజసూయం చేయాలంటాడు. కర్ణుడు "ఈ

చెయ్యి చెయ్యి. ఇప్పుడు నిన్ను కాదనే రాజెవడున్నాడు శత్రువు లెవరున్నారు" అంటాడు. తీరా పురోహితుల్ని పిలిపించి అడిగితె వారు సీకు పాండవులు శత్రులు గనక వారిని జయిస్తేనే గాని ఈ యజ్ఞం చేయటానికి వీల్లేదంటారు. అందుకని వైష్ణవమనే మరో యజ్ఞం ఉంది– దానిని చేయవలసిందంటారు. ఇంకేమీ చేయలేక, దుర్యోధనుడు వైష్ణవమనే యజ్ఞాన్ని చేయడానికి ఉద్యుక్తు డవుతాడు.

లక్షణంగా ఆ యజ్ఞం జరుగుతుంది. కొంతకాలం దుర్యోధనుడు చెడ్డ బుద్ధిని అణచిపెట్టి మంచిగా మెలగుతాడు. మళ్లీ కర్ణుడొకనాడు యజ్ఞం చక్కగా జరిగిపోయింది. ఇక రాజసూయం కూడ మొదలుబెట్టి చేస్తావుగాక అది ఎలా అవుతుందో ఏమోనని కంగారు పడతావేమో– అలాంటి భయం పెట్టుకొనకు– నేను ప్రతిజ్ఞ చేస్తున్నాను విను– అర్జునుడ్ని చంపకుండా నా పాదాలకు ఉండే గోళ్ళు తీయనని శపథం చేస్తున్నాను అంటాడు. ఈ చిన్న ప్రతిజ్ఞకు దుర్యోధనుడు మహా సంతోషపడిపోతాడు. గోళ్ళు పెంచుకొంటే ఎవరికి కలిగే లాభం ఏమిటి? అందులో (Public interest) ప్రజాహిత మనేది ఏమిటి ఉందట: బుర్రలేని ప్రతిజ్ఞ అనిపిస్తుంది ఒకొక్క మారులో దుర్యోధనుడు అంత సంతోషపడ్డాడే: అదేమిటి ఆ మాత్రపు ప్రతినకు కాని అదొక నియమం– నిష్ఠ.

ఎవరికి ఎప్పుడు ఏ నడవడి నచ్చుతుందో చెప్పలేము. అది ఎవరి సంస్కారాన్ని బట్టి వారికి నచ్చుతుంది. నప్పుతుందిన్నీ.



## 2. వ్రీహిద్రోణాఖ్యానము

ద్వైత వనంలో సుమారు ఒక సంవత్సరం ఎనిమిది నెలలు ఉన్న తరువాత ధర్మరాజుకు ఒకనాడు కలలో ఆ వనంలోని జంతువులు అవుపడి "అయ్యా మీరు ఇక్కడ నివసించి మమ్మల్ని చంపి తింటుండటంచేత చాలా భాగం నశించిపోయింది మా వంశం. నామ మాత్రావశిష్టులమై యున్నాం. ఇంకొకచోటికి వెళ్ళి మమ్మల్ను వదలిపెట్టరాదా" అని అడిగినట్లు అనుభూతి అవుతుంది.

కలలో కలిగేవి కూడ అనుభవాలూ అనుభూతులే. అవి కల్లలేను అనటంలో అర్థం, అవి ఈ జాగ్రతా ప్రపంచానికి భిన్నమైనవని అనడానికి మాత్రమే. ఆ మాటకొస్తే ఈ జాగ్రతలో గర్భదరిద్రాన్ని అనుభవించి ఆర్థాకలితోపడి నిద్రపోయేవాడు తాను మహారాజై పదిమంది వంటవారిచేత షడ్రసోపేతమైన భోజనం వండించుకు తిన్నట్లు కలగంటాడు. ఆ స్థితిలో సుఖం అనుభవిస్తాడు. ఈ జాగ్రతలోని స్థితి ఆ స్థితిలో అబద్ధమేగదా! ఈ ప్రపంచం ఈ జాగ్రత్స్వప్న సుషుప్త్యవస్థలూ అన్నీ కేవలం భగవంతుదే— మనసే - లేదా నేను అనేవాడే - ఇంకేం లేదని అంటాడు జ్ఞాని. అందుకే అతడికి ఈ జాగ్రతకూడా కల్లయే.

కాని ధర్మరాజు తనకు వచ్చిన కలను అబద్ధమేనని కొట్టివేయలేదు. వెంటనే తమ్ముళ్లనూ పౌరులనూ పిలచి కామ్యకవనానికి వెళ్ళిపోదామని ప్రయాణం కట్టుతాడు. ఇలా పదకొండేండ్ల వనవాసం అవుతుంది.

ఒకసారి వ్యాసమహర్షి వచ్చి నాయనలారా! కాల విపర్యయం వల్ల సుఖం దుఃఖం వస్తూ వుంటాయి. ఏ కాలమూ ఒకరికి ధ్రువమై నిలిచి ఉండదు. అందుకనే సుఖం వచ్చినా దుఃఖ మొచ్చినా "ప్రమత్తుడై పోకూడ"దనేది ముఖ్యమైన విషయం. దుఃఖం వస్తే ఏడవ్వద్దని సంతోషం కలిగినప్పుడు నవ్వవద్దని చెప్పడం లేదు. దుఃఖమైకంలోగాని సంతోష మైకంలోగాని పడవద్దని బోధ. అంటే ఆ సుఖంలోనూ దుఃఖంలోనూ కూడ కర్తవ్యం మరచిపోయేటట్లుగా ఉండరాదు. కర్తవ్యమంటే వ్యక్తి సమాజంపట్ల చేయవలసిన కర్తవ్యం. దీనినే స్వధర్మం

అంటారు. తనకున్నది పోతే దుఃఖం రావచ్చుగాక. సమాజానికి చేయవలసిన సేవ మానరాదు. అది స్వధర్మాన్ని వదలివేయటమే అవుతుంది అని ధ్వని. అలాగే సుఖాన్ని అనుభవిస్తూకూడ స్వధర్మం తప్పిపోనీయరాదని బోధ.

వ్యాసుడు చెప్తున్నాడు–"నాయనా నీవు ఆపదలను కొంచెం ఓర్చుకొని ఎక్కువగా తపస్సు చేయాల్సింది. దానివల్ల సకల సౌఖ్యాలూ సిద్ధిస్తవి. తపస్సు అంటే దాని లక్షణాలు చెప్తాను విను. క్షమయు, నహింసయు సత్యము, సమతయు, నింద్రియజయంబు, శమము, పరిత్యాగము అనేవి– తపోలక్షణాలు. వీటివల్ల ఊర్ధ్వలోకాలను గడింపవచ్చు. ఇక్కడ చేసిన పుణ్యంవల్ల కలిగే లాభాలు వెంటనే అనుభవింపవచ్చుగాక. తపము ఏదైతే ఉన్నదో దానివల్ల తరువాతి లోకాల్లో– తరువాతి జన్మల్లో కూడ మేలు కలుగుతుంది. అందుచేత తన శక్తిమేర–దానధర్మ చిరపరోపకారాలు చేయాలి" అంటాడు.

ధర్మరాజు ఇది విని "తను, దానం చేయగలడు: చేస్తూనే ఉన్నాడు: మళ్ళీ ఈతపంకూడ చేయమంటున్నాడే! ఈ రెంటిలో ఏది గొప్ప" అని సందేహం కలిగి "దానం, తపం ఈ రెంటిలో ఏది కష్టమైనట్టిది? దేనివల్ల ఎక్కువ ఫలం కలుగుతుంది" అంటాడు.

అందుకు వ్యాసుడు చెప్పిన సమాధానం చిత్రమనిపిస్తుంది. ఆయన అంటాడు–"దానమే ఎక్కువ ఫలాన్ని యిస్తుంది. కాని అది డబ్బుతో కూడినపని కావటంచేత చాల దుష్కరమైనట్టిది." అది అన్యాయార్జితమైన విత్తం అయితే మాత్రం ఫలం ఏమీలేనిదే అవుతుంది ఆ దానం! న్యాయార్జితమైతే అది కొంచెమే అయినా దేశకాల సమ్మాన్యమై, పాత్రయోగవశంచేత సౌమ్యమై ఫలిస్తుంది. దేశకాల సౌమ్యమూ పాత్రయోగ్యమూ అంటే బీదవాడికి యేసుగను దానమివ్వటంలా వర్షాకాలంలో చెప్పులూ, వేసంగిలో గొడుగులూ దానమివ్వటంలా అజీర్ణంతో బాధపడేవాడికి అరిశల్తో భోజనం పెట్టటంలా ఉండరాదని ధ్వని. ఇంతా చెప్పి, వ్యాసుడు దానము దుష్కరమెందుకవుతోందో చెప్తాడు.

"నృపులకు, నధిప, ప్రాణంబుల కంటెను రూపింపనర్థంబు తీపు వినవె.
యుగ్రంబులగు నాయుధముల మొనలపై నురుకుట యంభోధి దరిసి చనుట
కృషి పాశుపాల్య సంక్లేశంబు నొందుట యడవులఁ గొండల నిడుమ వడుట

ఆ. నవసి, పొవసి యనుదినముఁ బరప్రేష్యులై
యునికి దలప నర్థమునక చూవె
యట్టి దుఃఖలబ్ధమైన యయ్యర్థంబు
విడుచుటెవ్విధమున గడిదిగాదె.

డబ్బుకోసం పైన చెప్పిన అన్ని కష్టాలూ సర్వులూ పడుతూనే ఉండటం చూస్తే అలా సంపాదించిన డబ్బును విడువబుద్ధి అవుతుందా: అది ఎంత దుష్కరమైన పని:: అంటాడు. అందుకు పూర్వం ముద్గలుడనే ద్విజుడు సన్మార్గోపార్జితంపైన వ్రీహిద్రోణ మనేదాన్ని చేసినవాడై పరమమైన సిద్ధిని పొందినాడుగదా అంటాడు. ధర్మరాజు ఆ కథను చెప్పమంటాడు.

వ్రీహి అంటె ధాన్యం. ద్రోణము అనేది కొలత "నల్లము" "తూము" అనే కొలతలు ధాన్య విషయంలో పూర్వం ఉండేవి. ఆ రోజుల్లో విప్రులు ఉంఛవృత్తివల్ల జీవించేవారు. ఉద్యోగాలూ చేసే వారేగాని అది బ్రాహ్మణులకు చెప్పిన కర్మకాదు. ధాన్యం, పండిం తరువాత రైతులు నూర్పిడి చేసేవాళ్ళు. అలా చేస్తున్నప్పుడు ధాన్యం చుట్టూ చెదరిపడతవి. ఆ ధాన్యాన్ని ఈ బ్రాహ్మణులు ఏరుకొని తీసికొని పోయేవారు. ఇంకా అటుకులు కొట్టు కొనేటప్పుడు వడ్లు పేలి దూరాన పడుతుంటే వాటినికూడ ఏరుకొని పోయే వాళ్ళు. ఇదీ ఉంఛవృత్తి అంటే అర్థం. ఆ బ్రాహ్మణులు—విప్రులు—ఎవరికీ అక్కరలేని సొమ్ము మాత్రమే ఏరితీసికొని పోయి ఉపయోగిస్తే అది న్యాయమైన ఆర్జనం వారికి : అందుకని అలాంటిదాన్నే దానంచేయవలసి ఉంటుంది.

ముద్గలుడనే ఋషి అలాటి ఆర్జనం చేస్తూ ప్రతిరోజూ అలా ఏరుకొని తెచ్చినవి ఒకచోట ఉంచినవాడై అవి సుమారు ఒక తూము అయిన తర్వాత ఎవరినో సత్పురుషుని పిల్చి బోజనం చేసిపెట్టి మిగిలింది తానూ భార్యా బిడ్డలూ తినేవారుట. -అలా 14 రోజులు తిండినే తినక దాచి 15వ రోజు పూర్ణిమా అమావాస్యలలో సత్పురుషునకు భోజనం పెట్టి తాము భుజించే

వారు. ఒకప్పుడు దూర్వాసముని వీరిపద్దకు వచ్చి భోజనంచేసి ఉన్న అన్న మంతా ఇంచుమించు తినేసి, మిగిలిందంతా తన వంటికి రాచుకొని వెళ్ళి పోతాడు. ముద్గలుడు ఏలాటి మనోవికారమూలేక సంప్రీతితో ఉపవాసంతోనే ఉండిపోతాడు. కాని మళ్ళీ 14 రోజులయిన తరువాత మళ్ళీ దూర్వాసుడే వచ్చి మళ్ళీ మిగులకుండా తినిపోతాడు. ఇలా ఆరు వారాలు భోజనం చేయరు. ముద్గలుడూ కుటుంబమూను. ఇది పరీక్ష అందామా? అంటే ఎందుకు చేయాలి ఈ పరీక్ష అనే దానికి సమాధానం దొరకదు. మరి పరీక్ష కాకపోతే వాస్తవంగా అలా చేయాలనే చేశాడా దుర్వాసుడు? అనిపిస్తుంది. ఆరు వారాలు ఇలా అయిన తరువాత ముద్గల్యుని సహనానికి మెచ్చుకొని, "నీకు స్వర్గ సుఖాలు అనుభవించే స్థితిని సంతరించుకొన్నావయ్యా- నీకోసం విమానాన్ని దేవతలు తెస్తారు వెళ్ళవలసింది" అని చెప్పి వెళ్ళిపోతాడు. అంటే వీనికోసమె ఆయన వచ్చి అలా తిన్నాడు అనాల్సి వస్తుంది.

అప్పుమరి, చెట్టుకు పుష్పం ఎందుకు పూస్తున్నది? కాయ అవడానికే. కాయ ఫలం కావడానికి. అలాగే దానం చేయడం అనేది దాని ఫలితాన్ని పొందడానికె. ఆ అనుభవం ముద్గలునికి ఇవ్వడానికె దూర్వాసుడు అలా తాను దానం పట్టాడు. ఇలా అన్నప్పుడయితె ఆశ్చర్యపడకుండా ఉండబుద్ధికాదు. ఆ తరువాతి కథ ఇంకా చిత్రమనిపిస్తుంది. దేవదూతలు విమానంతెచ్చి ముద్గలుని స్వర్గానికి రావలసిందని ఆహ్వానిస్తారు. ముద్గలుడు దివిజలోకం అంటే ఎలా ఉంటుంది. దాని గుణదోషాలు చెప్పవలసిందంటాడు. సత్పురుషులతో ఏడడుగులు నడిస్తే మైత్రి కలుస్తుందంటారు కనక మిమ్మిలను మిత్రులుగా భావించి అడుగుతున్నాను చెప్పవలసిందంటాడు.

అప్పుడా దేవదూత-అయ్యా ఇది ఒకలోకం దీనికి పేరుగా స్వర్లోకమని ఉంది. అది ఇంతకంటె ప్రకాశవంతమైనది. దేవతలు పోదగినదది: తపం చేస్తుందేవారూ యజ్ఞాలు చేసేవారు, సత్యసంధులు. ఉత్తములు, జితేంద్రియులు, దానపరులు. రణశూరులు వీళ్ళంతా అక్కడ నివసిస్తూ ఉంటారు. ఇంకా అప్సరసలు దేవమునులు సాధ్యులు మరుత్తులు వసుప్రవరులు వేలు వేలుగా అక్కడ ఉంటారు. అక్కడ శీతోష్ణజరరోగ భయాలుండవు. అక్కడ ఉండేవారికి, ఈమనుష్యదేహాలుండవు. కేవలం తేజోమయమయిన

దివ్యదేహం ఉంటుంది. మనసు ప్రభావంగా వివిధాంబరా భరణాలూ అప్ మానకుసుమ మాలికలూ ధరించినవారై అన్ని సుఖాలనూ అనుభవిస్తూ ఉంటారు. దీనిపేరు ఇంద్రలోకం. ఒక్క బ్రహ్మలోకం తప్ప మిగతా అన్నిలోకాలకంటె ఈ లోకం మేలయినది.

ఇంద్రలోకంలో మనువులు ఖాతలు, మునులు, ఉంటారు. అక్కడ లోభ గుణం, కోపం, పాపం, అపకీర్తి దుఃఖం ఇవి ఉండవు. మిగతా లోకాలు ప్రళయం వచ్చినమీదట నాశనమైనా ఈ లోకం అలాగే ఉంటుంది. ఈ లోకాన్ని గూర్చిన దోషాలున్నాయి వినాల్సింది—అదివరకు ఎక్కడో చేసిన పుణ్య వశంచేత ఇక్కడ సుఖాలను అనుభవించడమున్నది గాని ఇక్కడ పుణ్యంచేసి సుఖాలను సంపాదించుకొనడమనేది ఉండదు. అందుచేత, చేసిన పుణ్యం పూర్తిగా హరించే సమయానికి తిరిగి భూమికివచ్చి ఏ శరీరం లోనో చేరవలసిందె. అక్కడ ఈర్ష్య అనేది ఉంటూనె ఉంటుంది. అతడు ఎక్కువ స్థితిలో ఉన్నాడు నేనింకా తక్కువ స్థితిలో ఉన్నాను అనే అవగాహన ఉంటుంది. అదికూడ లేకపోతె సర్వసమానమై బ్రహ్మలోక ప్రాప్తి కలుగుతుందికదా!

ఇదంతావిని ముద్గలుడు "ఓయబ్బా! యీఎక్కువ తక్కువలుండేచోటికి వెళ్ళి పుణ్యం అనేది చేయడానికి వీలులేక ఇక్కడ నుంచీ అక్కడికి విమానాలెక్కి వచ్చి ఉండటం నాకక్కర్లేదు" అని దేవదూతను పంపేస్తాడు. ఆ తరువాత ఈ ఎక్కువ తక్కువలు లేనితనం, సర్వసమత్వం, విషయమనన విచార ణలు చేసి ధ్యానం చేస్తాడు. తుల్యనిందా స్తుతిపరుడునూ సమలోష్టాశ్మ కాంచనుడునునై పరమ సిద్ధిని పొందుతాడు.

ఈ కథ ధర్మరాజుకు పారాశర్యుడు చెప్పటంలో దానంవల్ల స్వర్గలోక సుఖానుభూతి వస్తుందని చెప్పుతూనే తపంవల్ల అంతకంటె ఎక్కువైన స్థితి కలుగుతుందని నర్మగర్భితంగా చెపుతున్నాడనిపిస్తుంది. ముద్గలుడు మరి స్వర్గగమనంవద్దని తపమే చేయడానికి ఆరంభించి సిద్ధి పొందాడుకదా.

# 3. సైంధవ పరాభవము

సైంధవుడు దుర్యోధనుని చెల్లెలైన దుస్సల భర్త—ధృతరాష్ట్రుని అల్లు డున్నూ, ఇతడికి కామ ప్రవృత్తి జాస్తి. సాల్వకన్య నొకదాన్ని పెళ్ళాడు దామని చతురంగ బలాలతో కామ్యక వనం ద్వారా వెళ్తూ ద్రౌపదిని పర్ణ శాలలో ఒంటరిగా చూసి మోహంలో పడుతాడు.

వెంటనే తన స్నేహితుడైన కోటికాస్యుని పంపి ఆపిల్ల ఎవరో కను గొని రమ్మంటాడు. ఆమె ద్రౌపదని తెలిసి మోహకామాలు మరీ పెంచు కొంటాడు. గబగబా పర్ణశాలలోనికి వచ్చేస్తాడు. ద్రౌపది కూర్చోండని పాద్యమిస్తానని లోపలికి తప్పుకోబోతుంది. అతడు మాకు సత్కారాలేమీ అక్కర్లేదు. నిన్ను చూచినప్పట్నుంచి మన్మథ బాణాలతో చచ్చిపోయేట్లు న్నాం. రక్షించి నాతోలేచి వచ్చేయాల్సింది. రాజ్యం కోల్పోయిన పాండవులతో నీవేం సుఖిస్తావంటాడు.

ఆమె భయపడిపోతుంది. "నాకు అన్నవరస అవుతావు. మంచి ధర్మం గల వంశస్తుడివి అలా హాస్యానికి పలకటంకూడ అధర్మమే" నంటుంది. సైంధవుడు "రాజులకు వావి వరసలు చూడక్కర్లే" దంటాడు. అది శుద్ధ తప్పు. అలాటి ఆచారం అప్పుడు లేనేలేదు. కామకావరంచేత అధర్మాన్ని ఆచారంగా చెప్పాడు సైంధవుడు.

అతడు పైపైకి వస్తున్నాడు. ఆమె "చచ్చిపోతావు జాగ్రత్త భీముడూ అర్జునుడూ నీ ప్రాణాలు తీసేస్తారు" అంటోంది. ధౌమ్యుడు కసురుతున్నాడు దూరంనుంచి. సైంధవుడామె కొంగు పట్టుకొన్నాడు. ఆమె ఒక్క విసురు విసురుతుంది. అతడు క్రిందపడి మళ్ళీలేచి ఆమెను తీసికొనిపోయి రథం మీద కూర్చోబెట్టుకొని వెళ్ళిపోతుంటాడు. ధౌమ్యుడు గోలపెట్టుతూ ఆరథాల వెంట పరుగెత్తుతూ ఆరుస్తుంటాడు.

పాండవులు కుటీరానికి వచ్చి ఎవరూలేకపోవటం చూస్తారు. చివరకు ధాత్రేయి అనె పరిచారికద్వారా ఇలా జరిగిందని తెలిసి ఆ రథాలుపోయినవైపు తమ రథాలను నడుపుతారు. ముందు ధౌమ్యునిచూసి ఆపి పలుకరించి సైంధ వుని వెంటపడుతారు. క్షణంలో సైంధవుని సైన్యంచేరి చుట్టుముట్టి చావ

గొట్టుతారు. భీముడు కోటికాస్యుని రొమ్ము చీల్చి చంపేస్తాడు. యుధిష్ఠిరాదులు మిగిలినవాళ్ళను జయిస్తారు. సైంధవుడు ద్రౌపదిని వదలి పారిపోతాడు. ధౌమ్యుడు ద్రౌపదిని పరామర్శిస్తాడు. అప్పుడందరూ వచ్చి ఆమెనోదార్చి ధౌమ్యునికిచ్చి కుటీరానికి పంపిస్తారు. తాము సైంధవుణ్ణి చంపి వస్తామని భీమార్జునులంటె, ధర్మరాజు "వద్దు వద్దు, చంపకండి అతడు మనబంధువు" అంటాడు. ద్రౌపదికి కోపం వస్తుంది. వాణ్ణి చంపితేనే తనకు సంతోషమంటుంది. భీముడు వెళ్ళి ఒకపొదలో దాక్కొన్న సైంధవుణ్ణి ఒక్క గుద్దుగుద్ది బయటకు లాగుతాడు. అతడి ముఖమంతా నెత్తురు ముద్దయింది. అర్జునుడు భీమునితో ధర్మరాజు మాటనుచెప్పి చంపవద్దనే సంగతిని జ్ఞాపకం చేస్తాడు. భీముడు అయిష్టంగానె ఒప్పుకొని, కత్తితో సైంధవుడి తలను నున్నగా చెక్కేస్తాడు. వాని రాజవేషం వికృతం చేసి, ధర్మరాజు ఎదుట నుంచుతారు.

ద్రౌపదికి ఈ వికృతాకారుణ్ణి చూస్తే నవ్వువస్తుంది. ఆమెకూడ సత్త్వగుణవంతురాలే గనక అప్పటికి కోపం తగ్గిపోయింది కనుక "సరె ఇతడు పాండవదాసుడే గనక ఇక వదిలివేయండి" అంటుంది.

ప్రతివ్యక్తిలోనూ మూడు గుణాల పాళ్ళు ఉంటయి. వాటి నిష్పత్తి మాత్రం ఎవరివి వారికె. ఈ పాళ్ళు మార్చుకోగల శక్తి మనిషి కొక్కడికె ఉంది. జంతువులకూ చెట్లకూ లేదు. మనిషి తమోగుణం వృద్ధిచేసికొని రాక్షసుడూ కావచ్చు సత్త్వగుణం వృద్ధిచేసికొనిదేవతా కావచ్చు. ఏమయినా మళ్ళీ మళ్ళీ మార్పు వస్తూనే ఉంటుంది ప్రయత్నం చేయకపోతె. ప్రయత్నం చేసి సత్త్వగుణం పెంచుకొంటె భగవత్తత్త్వమర్థం చేసికొని బ్రహ్మవిద్య నాశ్రయించి జీవన్ముక్తులు కావడానికి అవకాశం ఉంటుంది। అలాకాకపోతె నిరంతరం ఈ సుఖదుఃఖాలతో శ్రమపడుతూ ఉండవలసిందె.

ఎవరు ఔనన్నా కాదన్నా చివరకు సైంధవుణ్ణి వదలివేస్తారు. ధర్మరాజు అతడితో "నీవు వట్టి అనదవు. నీవుగాక ఇంకెవరయినా ఇలాంటి నికృష్టపు పని చేస్తారా? నీవు ఇంద్రియ లోలుడివి. అల్పుడివి. అందుకె ఇలాటి చవటపని చేశావు" అంటాడు. చవట కాకుండా ఉండాలంటే జీవితంలో ఇంద్రియలోలుడు. అల్పుడు, ధృతివిహీనుడు కాకుండా చూచుకోవాలి అని అర్థం.

సైంధవుడు నేరుగా హరిద్వారం వెళ్తాడు–అక్కడ శివుణ్ణిగూర్చి తపస్సు చేస్తాడు. ఆయన ప్రత్యక్షమైనపుడు, తాను పాండవుల్ని ఐదుగురనూ జయింపగలిగే శక్తినివ్వమంటాడు. అందుకు శివుడు, పాండవుల్ని జయించేందుకు ఇంద్రాదులకే అవకాశం లేదయ్యా! అది శాసనం, భగవచ్ఛాసనం. కాకపోతె ఒక అవకాశం ఇప్పిస్తాను. ఒక్కనాడు మాత్రం వారిలో కేవలం నలుగుర్ని మాత్రం నీవుగెలువగలిగే అవకాశం పొందుతావుగాక యుద్ధంలో. అర్జునుణ్ణి గెలిచే అవకాశం మాత్రం ఉండదు అనేది జ్ఞాపకముంచుకొను. అర్జునుడ్ని నేనే ఎదుర్కొని జయించలేనుకదా! అంటాడు. అతడి గొప్పదనం నావల్లనే కలిగిందాయె!. పైగా—

నిఖిలాస్త్ర శస్త్రవిద్యా సఖుడపరాజిత యశోవిశాలుడు విష్ణుం
డఖిలేశ్వరుడతనికి ప్రియసఖుడుట యవ్వీరుగెల్వ శక్యమెనీకున్

—అంటాడు. శ్రీకృష్ణుడ్ని విష్ణుమూర్తిగా శివుడే సైంధవుడికి చెప్పాడు. శివుడి మాటను సైంధవుడు నమ్మలేదా? లేక నమ్మినా కర్మవశాత్తు అలా ఎదిరిపక్షంలో చేరి నాశనం కావటం తప్పనిసరి కనక దుర్యోధనుడి పక్షంలో ఉండి చచ్చాడా సైంధవుడు? జనులు ఇలాంటి చావులు చావడం! కేవలం బుద్ధితక్కువ తనంవల్ల కాదనిపిస్తుంది నిజసంగతికి – పరమేశ్వరుడైన శివునినుంచీ సేకరించికూడ దానిని వదలి–తాను నాశనం అయిపోవటం అనేది ఈ సైంధవుడికి కలగటం చూస్తె ఇదేదో ఒక ప్రవాహంలో పోయే పుల్ల ఏమీ చేయలేక ఆ ప్రవాహంలో పడిపోతూనే ఉంటున్నట్లే వ్యక్తికూడ ఈ ప్రపంచంలో మనుతున్నాడనిపిస్తుంది.

## 4. సీతాపహరణ కథ

ధర్మరాజాదులు ధర్మానికి కట్టుబడి అరణ్యాల్లో ఒదిగి ఉంటున్నా దుర్యోధనుడు ఘోషయాత్ర పేరుతో వచ్చి తమను అవమానింప చూడటం. సైంధవుడు ద్రౌపదిని చెఱబట్టటం ఇవి తాత్కాలికంగా ధర్మరాజు మనసును కలతబెట్టినయి. ఆ తరువాత ఎప్పుడో మార్కండేయ ముని వచ్చినప్పుడు ధర్మరాజు ఈ బాధలను నిర్వేదించి తనలాగా బాధలు పడ్డవారెవరైనా ఉన్నారా అంటాడు.

అందుకు మార్కండేయుడు ధర్మరాజును దుయ్యబట్టుతాడు. నీ దుఃఖమెంతటిదయ్యా! రఘురాముడెంత దుఃఖంలో మునిగిపోయినాడో తెలుసునా? ఆ కథ చెప్తాను వినుమంటాడు.

అజమహారాజు కుమారుడైన దశరథునికి ముగ్గురు భార్యలు. నల్గురు కుమారులు. శ్రీరాముడు పెద్దవాడు. ఈయనకు పట్టాభిషేకం చేయాలని తండ్రి ప్రయత్నించి పెట్టిన ముహూర్తానే అడవికి పన్నెండేండ్ల ప్రవాసం వెళ్ళవలసి వచ్చిందాతడికి. ఆతడి సవతి తల్లియైన కైక దశరథుడు తన కెప్పుడో ఇచ్చిన రెండు వరాలను అప్పటిదాకా అడగకుండా ఉంచి అప్పుడు అడిగింది. అందులో ఒకటి శ్రీరాముని అడవికి పంపటం. రెండవది కైక కుమారుడైన భరతునికి పట్టం కట్టటం! శ్రీరాముడు ఎంతో సౌమ్యంగా పట్టాభిషేకానికయిన ముహూర్తాన అడవికి భార్యా సమేతంగా ప్రవాసం వెళ్ళిపోయినాడు. తండ్రి ఇతడిపై ప్రేమతో చచ్చిపోయినాడు. భరతుడే వచ్చి ప్రార్థించి శ్రీరాముని రాజ్యం చేయమన్నా చేయనని అరణ్యాలకె వెళ్ళిపోయినాడు.

అక్కడి కష్టాలకు అంతులేదు. పులస్త్యుడు బ్రహ్మపుత్రుడు. అతడికి వైశ్రవణుడనీ, విశ్రవసుడనీ ఇద్దరు కుమారులు. వీళ్ళ సంతానం రావణ కుంభకర్ణులూ విభీషణుడున్నూ. ఖరుడూ శూర్పణఖ అనేవారు విశ్రవసునకు పాక అనేదానివల్ల పుట్టినవాళ్ళు. శూర్పణఖ వచ్చి సీతను బెదిరిస్తుంది అరణ్యంలో. దాని ముక్కూ చెవులూ కోసిపంపినందుకు పధ్నాలుగువేలమంది రాక్షసులతో ఖరుడు వచ్చి శ్రీరామునిపై బడుతాడు. అతడొక్కడే వాళ్ళందర్నీ జయిస్తాడు. శూర్పణఖ ప్రోద్బలంతో రావణుడు మాయవేషంలో వచ్చి బంగారు లేడిని కల్పించి, దానిని తేవడానికి శ్రీరాముడు వెళ్ళిన సమయాన ఒంటరియైన సీతను మూర్ఛచేయజేసి రథంమీద పెట్టుకొని వెళ్ళిపోతాడు.

శ్రీ రామలక్ష్మణులకు ఆమె జాడే తెలియదు. ఆ కాననములో పిచ్చివాళ్ళై వారు తిరిగి తిరిగి జటాయువూ కబంధుడూ ఇచ్చిన సమాచారంతో సుగ్రీవుడనే కపిరాజును కలిసి సఖ్యం చేసికొనవలసి వస్తుంది. అందుకు సుగ్రీవుడి అన్నయైన వాలిని చంపవలసి వస్తుంది. అంతచేసినా సీత సమా

చారమందక ఎంతో వెక్కసపడిపోతారు. పంపబడిన వాళ్ళు తెలియలేదంటూ తిరిగి వస్తారు,

ఎంతో కాలానికి ఆంజనేయుని జట్టువచ్చి ఆంజనేయుడు సీతను లంకలో రావణుని అశోకవనంలో చూచినట్లు చెప్తారు. కాని అక్కడకు వెళ్ళాలంటే సముద్రం దాటాలి. సైన్యమంతా అవతలకు తీసుకొని పోవాలి. ఎలా? సీత రాక్షసుల మధ్యలోనుండి మహా సంకటపడిపోతున్నట్లు తనకు సమాచార మందింది. ఈ దుఃఖం సామాన్యమైనదంటావా? అన్నాడు మార్కండేయుడు.

ధర్మరాజు విని ఊరుకుంటాడు. ఐతే ఆ తరువాతి కథ చెప్పవలసిం దంటాడు.

—: ఇది షష్ఠాశ్వాసము :—



# మహాభారత కథలు

( అరణ్య పర్వము- సప్తమాశ్వాసము )

## 1. రావణ వధ

వానర సైన్యాలతో సహా శ్రీరాముడు లంకకు వెళ్ళడానికి సముద్రుని చేరి ఉపాసిస్తాడు. తెలువు కన్పడదు. అప్పుడు ఇలా ప్రతిన చేస్తాడు.

ప్రతము ధరించి నిష్ఠ నుపవాస విధిం గొలుతున్ సముద్రు నా
కితడు ప్రియంబుతోడ తెరువిచ్చుట యంతని కల్గనేని మే
లితరునిగా నను౦ దలచెనేని సమానుష రోష వేష దీ
పిత శరవహ్ని విజ్జలము బీల్చెద ప్రేల్చెద నొక్క-ప్రేల్మిడిన్

వెంటనే సముద్రుడు ప్రత్యక్షమై "శ్రీరామా! చెట్లనూ రాళ్ళనూ తెచ్చి నీ సైన్యములో నున్న నీలునిచే సముద్రంలో వేయించాల్సింది. అవి అందులో తేలుతవిగాక – వాటితోనే తేలుతూ ఉండే వంతెన కట్టి వెళ్ళవలసింది" అని ఉపాయం చెప్తాడు. అలా శ్రీరామ సుగ్రీవులు సేతుబంధనంచేసి సేనలు తీసికొని లంకకు వెళ్తారు.

త్రికూటానికి చేరేటప్పటికి రావణుని నుంచీ ఇద్దరు గూఢచారులు వస్తారు వారిని పట్టుకొని శ్రీరాముని దగ్గరకు కపులు తెస్తారు. శ్రీరాముడు వారికి తన సైన్యాల విన్యాసం చూపి పంపివేయుమంటాడు. ఇదేమి శిక్ష అను కొంటున్నావా! ఈ శిక్ష రావణునకు ఆ చారులిద్దరూ శ్రీరాముని సైన్య ప్రతాపాలు చూసి దిగ్భ్రములై వెళ్ళి రావణుని గుండె దిగ్గురనిపించారు. శ్రీరాముని స్థైర్యం ధాకచక్యం అలాంటివి!

తరువాత అంగదుని రావణుని వద్దకు రాయబారిగా పంపుతాడు శ్రీరాముడు. ఆ మాటలు దశకంఠుడు వినడు.

అంగదుడు రావణునకు సూక్తులు చెప్పిన తరువాత రాక్షసులు అతడ్ని పట్టుకొంటే వారితోసహా ఎగిరి వాళ్ళను వదేసి తిరిగి వస్తాడు సైన్యంలోకి. రాయబారం అనేది శత్రువుని జయించడానికి ముందు ధర్మదేవుని సహాయం కోసం అనిపిస్తుంది. ధర్మరాజు ఈ కథలు విన్న కారణంగానే శ్రీకృష్ణుని కౌరవులవద్దకు రాయబారిగా పంపి ఉంటాడు అనిపిస్తుంది. చరిత్రలు చదివే వారికి తెలివిని కలిగిస్తవి అంటారు. ధర్మరాజు నిజంగా ధర్మదేవత. ప్రజ లందరకూ గ్రహింపు కలిగే పనులే ధర్మరాజు చేయడానికి కారణం ఈ కథలూ గాథలె:

యుద్ధం మొదలవుతుంది. రెండు సేనలూ అలా పోట్లాడుతుండగా శ్రీరాముడూ రావణుడూ తలబడుతారు. లక్ష్మణుడూ ఇంద్రజిత్తూ తలబడుతారు. రావణుడు శ్రీరాముని బాహుబల సారానికి నిలవలేక తిరిగి నగరం లోకి వెళ్ళిపోతాడు. ప్రహస్తుడు చాలసేపు యుద్ధంచేసి చచ్చిపోతాడు. హనుమంతుడు ధూమ్రాక్షుణ్ణి చంపేస్తాడు.

ఇదివిని రావణుడు చింతలో పడిపోయి కుంభకర్ణుని నిద్రలేపిస్తాడు- ఎన్నో బాధలు పెట్టినమీదట కుంభకర్ణుడు నిద్రలేస్తాడు. యుద్ధరంగానికి వస్తాడు. సుగ్రీవుణ్ణి పట్టుకొని తినబోతాడు. వెంటనే లక్ష్మణుడు బాణంతో కుంభకర్ణుని తలకు కొట్టుతాడు. తల కదిలిపోతుంది చివరకు బ్రహ్మాస్త్రంవేసి అతడ్ని చంపేస్తారు.

ఇంద్రజిత్తొక సమయాన నాగాస్త్రంవేసి రామలక్ష్మణులను బంధించేస్తాడు. కపులు గోలపెట్టుతారు. విభీషణుడు బ్రహ్మాస్త్రంవేసి ఆ బంధనాలను వదిలింపిస్తాడు,

ఇంద్రజిత్తు చనిపోయిం తరువాత రావణుడే-మళ్ళీ స్వయంగా యుద్ధానికి వస్తాడు. అప్పటికి ఇంద్రుడు మాతలితో ఒక దివ్యరథాన్ని శ్రీరామునకు పంపుతాడు. ఇంతసేపున్నూ రామలక్ష్మణులు, మిగతా అందరూకూడ కేవలం పాదచారులుగా ఉండి యుద్ధం చేస్తున్నారనేది విచిత్రమైన వ్మరణము. రావణాసురుని కూడ శ్రీరాముడు బ్రహ్మాస్త్రంతోనే చంపివేస్తాడు. శ్రీరా

ముడు గెల్చాడు. రాక్షసులు లొంగిపోయినారు. విభీషణుణ్ణి లంకకు రాజుగా చేయిస్తాడు శ్రీరాముడు.

విభీషణుడు జానకిని రప్పించి శ్రీరామునకు సమర్పిస్తాడు. కాని శ్రీరాముడు జానకిని పరిగ్రహించక "యజ్ఞహవిస్సు కుక్కవాతపడినట్లుగా నీవు రావణుని పాలబడినావుగాక. నిన్ను నేను ఏలుకొనను నీ ఇష్టమొచ్చినచోటకు పోవాల్సింది" అంటాడు. శ్రీరాముని మనసు ఒకప్పుడు దయామయమయినా ఇప్పుడు దారుణమయిందా అనిపిస్తుంది. దీనికి కారణం ఏమిటి?

వ్యక్తి ప్రపంచంతో స్నేహం చేస్తాడు, అందరనూ మెప్పించాలనె ప్రయత్నం చేస్తాడు. అందుకని అందరితో చాలమంచిగానె ఉంటాడు. దయామయుడనిపించుకొంటాడు. కాని భార్య విషయం వేరు అనిపిస్తుంది. ఏ చీకాకువచ్చినా భార్యన్ను ఏదో అనేస్తాడు. ఏమనడానికీ వెనుదీయడుగాక. ఇది ప్రపంచపు తీరు. వారిద్దరి ఆంతర్యం ఏకాంతం అవినాభావసంబంధమై ఉండటం మాత్రమె గుర్తుంటుంది తనకు. తానేమన్నా ఆ సంబంధంవల్ల ఆమె భరిస్తుందని నమ్మకం. తనకు వచ్చిన ఉద్రేకపూరితమైన మాటలనడానికి వెనుతీయవలసిన పనిలేదని ఊహిస్తాడు. ఆమె మాత్రం తన బాధను అర్థం చేసికొంటుందనే నమ్మకం బహుళ.

అందుకె ప్రపంచమంతా మనుష్యుడ్ని మెచ్చుకొంటునే ఉండచ్చు. భార్య మాత్రం చాలబాధపడిపోతుండటం ఎన్నో చోట్ల చూస్తాం. వాళ్ళకు ఇంతా ఎంతో సాధన కావాలి నిజమయిన శాంతపరులనిపించుకోడానికి అనిపిస్తుంది.

**ఇంతకూ సీత అంటుంది సమాధానంగా.—**

నిను గీడు వొరయకుండగ జనులకు నానిక్కమెక్క జననాయకనే
ననలంబు ఛొచ్చి వెడలెద గనుగొను మి చ్చనవు: నాకు కరుణిం పుదగన్

నేను నీ చరణాలను తప్ప మరొకరియందేలాంటి దోష భూయిష్ఠమైన తలపుగాని కలిగియున్నదాన్నయితే నేను అలామాడి మంటల్లో మడ్డైపోతాను

గాక. ఈ భూమి, యమధర్మరాజు, గాలి, చంద్రుడు సూర్యుడు నన్ను కాల్చేయరా! అంటుంది. వెంటనే ఆ దేవతలు అందరూ అవుపడి తమపేర్లు చెప్పుకొని, ఈమె పతివ్రత. శుద్ధమనస్వి అని చెప్పి శ్రీరాముని ఆమెను పరిగ్రహించడానికి ఒప్పిస్తారు. ఇది ప్రత్యక్షంగా జరిగింది ఆ రోజుల్లో. శ్రీరాముని వనవాసం 14 సంవత్సరాలూ పూర్తి అవుతుంది పుష్పక విమానంపై నెక్కి అంతా అయోధ్యకు వెళ్తారు. అక్కడ వేయి సంవత్సరాలు శ్రీరాముడు రాజ్యాన్ని పరిపాలించాడు. ఆ సంవత్సరాలు మన ఈ సంవత్సరాలేనో మరి ఆమానం వేరో! ఏదయినా అది చాలా కాలమేననిపిస్తుంది.

ధర్మరాజు ఇదివిని "ఓహో! జానకి పాతివ్రత్య మహిమ ఎంతగొప్పది" అంటాడు. అలాంటి పుణ్యసతులెవరైనా ఉన్నారా? ఉంటే వారి చరిత్ర చెప్పాల్సింది అని మార్కండేయునితో అంటాడు. మార్కండేయుడు సావిత్ర్యుపాఖ్యానము చెప్తాడు ధర్మరాజాదులకు.

## 2. సావిత్ర్యుపాఖ్యానము

శ్రీరామ చరిత్రము విన్న ధర్మరాజు, మార్కండేయుని, అఖిల దుఃఖాలకూ ఓర్చి శుభాలను పొందినట్టి స్త్రీ పుణ్యచరితము చెప్పాల్సింది అంటాడు. ద్రౌపది కూడ అక్కడే ఉంది.

మార్కండేయుడు సావిత్ర్యుపాఖ్యానం చెప్తాడు. అశ్వపతి అనే రాజు మద్రదేశాధీశుడై ఉంటాడు. ఆయనకు పిల్లలు లేరు. సావిత్రీదేవినిగూర్చి తపస్సు చేస్తాడు. సావిత్రి అంటే గాయత్రె అలా పద్దెనిమిదేండ్లు తపస్సు చేస్తాడట. ఈ 18 అనే సంఖ్యకు ఏదో అనిర్వచనీయమైన గొప్పతనం ఉందనిపిస్తుంది. చివరకు దేవి కన్పడుతుంది. అతడు తనకు పుత్ర సంతానం ఈయవలసిందని కోరుతాడు. ఆమె — అలాకాదు - నీకు పుత్రికా సంతానమె బ్రహ్మ యీయనున్నాడు. ఆమె కారణంగా తరువాత నీకు నూర్గురు కుమారులు కలుగుతారు లెమ్మంటుంది.

అలాగే కొన్నాళ్ళకు అశ్వపతికి, సావిత్రి అనే కూతురు కలిగినదై దిన దిన ప్రవర్ధమానమై పెరుగుతుంది. పెండ్లీడు వచ్చినా అశ్వపతి ఆమెకు తగిన వరుని చూడజాలక, ఆమెనే, ఎవరినో వరించి పెండ్లి చేసికొనవల సిందంటాడు. అప్పటి రోజుల్లో ఒక నిబంధనము ఉండేది. బాలిక పుష్పవతి అయిన మూడేండ్ల లోపల తండ్రి పెండ్లి చేయకపోయినట్లయితే ఆమె ఎవ రినో వరుని వరించి పెండ్లి చేసికొనవచ్చు. దానిని జ్ఞాపకం చేసికొని అశ్వపతి అలా అని ఉంటాడు. ఆ బాలిక సాళ్వరాజైన ద్యుమత్సేనుని కుమారుడైన సత్యవంతుని వరించింది. ఆమె ఆ సంగతి చెప్పుతుంది. మద్రపతి ఈ సత్యవంతుని గూర్చి నారద మహామునిని అడుగుతాడు. సర్వ సద్గుణ సంపన్నుడా సత్యవంతుడని చెప్పి, నారదుడు ఒక పెద్ద విషయంకూడ ఉందంటాడు. అదేమిటంటే ఆనాటినుండి సరిగ్గా ఒక సంవత్సరం గడిచే నాటికి అతడికి మరణం సంభవిస్తుందంటాడు. తండ్రీ కూతురూ చకితు లవుతారు. తండ్రి వద్దంటాడు గాని కూతురు — "మనసు, వాక్కు, కాయము అయిన మూడింటికీ సంబంధించిన అంతరంగంలో తాను ఆ సత్యవంతునే కోరుకొన్నదిగనక పెండ్లి చేసికొనక తప్పదన్నది. నారదుడు అది గమనించి పెండ్లి చేయవలసిందనీ ఈమె పుణ్యవశంచేత అతడికి ఆయువు పెరుగబోతున్నదనీ చెప్తాడు. అలా వారు స్థిరమైన ఆలోచన చేస్తారు. ప్రేమకు ఎంత తీవ్రమైన ప్రాధాన్యం ఆరోజుల్లో ఉంటుందో వింటే ఆశ్చర్యపడిపోతాం మనం.

ఆ సమయంలో ద్యుమత్సేనుడికి కండ్లుపోయినందువల్ల అంధుడయి ఉన్నాడు. శత్రువులు రాజ్యం హరించినందువల్ల అడవుల్లో నివసిస్తున్నాడు భార్యా పుత్రులతోసహా. అశ్వపతి పెళ్ళి ఉపపాదనతో అరణ్యంచేరి తన కూతురును సత్యవంతునకిస్తానని ద్యుమత్సేనుని అందుకు అంగీకరించవల సిందని ప్రార్థిస్తాడు. ద్యుమత్సేనుడు, తాము అరణ్యాల్లో అవస్థలు పడు తుంటున్నారు గనకనూ, సావిత్రి తమతోపాటు బాధలు పడజాలదు గనకనూ పెండ్లి అప్పుడు వద్దంటాడు. అప్పుడు అశ్వపతి ఇలా అంటాడు—

చ॥ కలిమియు లేమియున్ వశముగావు—
ఆవి పెందినచో తెలంగుచున్ గలుగుదు మువ్వి దీర్ఘల ప్రకారమె
తెప్పగ వింతవట్టునే దెలియగ జెప్పెదన్ వసుమతీవర
పన్నియసంగవేల — నే కొలదియుగాదు — ధీరమతి
కూతురు పేర్కొనజాల పెంపునన్—

అంటాడు. మీతో వియ్యమందుదామని వస్తే మీరు కాదనడం భావ్యమా అంటాడు. అంతేగాని మా అమ్మాయి మీ అబ్బాయిని ప్రేమించిందనలేదు. అది అప్పటి సంస్కృతి కాదుగామాల్ను బహుశ.

ద్యుమత్సేనుడు అంగీకరిస్తాడు. పెండ్లి ఆ అడవిలో ఆ మునులమధ్య అయి పోతుంది. సావిత్రి భర్తను కనిపెట్టుకొని ఉంటుంది. నారదుడు చెప్పిన సంవత్సరాన్ని రోజువారీ లెక్క పెట్టుతూ ఉన్నది.

ఆ సంవత్సరం పూర్తి కావడానికి ఇంకా నాల్గు రోజులున్నదనగా తాను త్రిరాత్రోపవాసము వ్రతంగా చేసి ఆరంభిస్తుంది. ఎందుకిలా చేస్తున్నావని అత్తమామలడిగినప్పుడు శుభం కోసం చేస్తున్నానని మాత్రం చెపుతుంది. మూడు రోజులయినదై నాల్గవరోజు ప్రవేశించినప్పుడు శోకసంతాపాన్ని మనసులోనే అణచివేసి, అత్తకు, మామకు, అక్కడి మునులకు, విప్రులకు అందరకూ నమస్కారాలు చేస్తుంది. అంతా దీవిస్తారు. వారి మనోబలాలు ఈమె ప్రయత్నానికి తోడ్పడాలికదా మరి! తాను ఆనాడు కూడ భోజనం చేయ లేదు.

సాయంత్రానికి సత్యవంతుడు, అడవిలోకి వెళ్ళి పండ్లూ, ఫలాలు, సమిధలు తెస్తానంటాడు. ఆమె తనకు ఆ అడవిని చూడాలని ఉందనీ ఇంతకు ముందెప్పుడూ తాను ఏ కోరికా కోరలేదుగనుక ఈ తన కోర్కె తీర్చవలసిం దనీ అడిగి అత్తమామల అనుజ్ఞకూడ తీసికొని సత్యవంతుని వెంట వెళ్తుంది. ఏ క్షణానా భర్తను ఏమరకుండా వదలకుండా ఉండటం అంత రంగం నుంచి, బుద్ధినుంచి, మనసునుంచీ, శరీరంవరకూ ఒక గొప్ప దీక్షతో దానిని వాక్కు-ద్వారా ఇతర్లకు పోనీయకుండా అనుసంధానం చేస్తూ పాలు మాలక భర్తను సంరక్షించుకొనడానికి చేసిన ప్రయత్నం ఇక్కడి గొప్ప విశేషం. ఇలా ఇంకెవరైనా చేసి భర్తను సంరక్షించుకోగలరా అంటే 'గలరు' అనడానికి ఎంత సందేహమో 'లేరు' అనడానికీ అంతే సందేహం కదా. సావిత్రికి తాను పుట్టకముందే దేవి అనుగ్రహంవల్ల ఇలాంటి శక్తి వచ్చిందేమోనని. శ్రద్ధ మనం తీసికొవాల్సి ప్రయోజన మేమిటని ప్రయత్నమే వదలినవారికి ఫలితమూ లేదు సంతృప్తీలేదు. చేసినవారికి మరి కలగే ఫలిత మేమిటో అలా చేస్తేగాని తెలియదుగాక.

ఇంతలో సాయంత్రమయే సమయానికి సత్యవంతునికి హఠాత్తుగా శరీరంలో అస్వస్థత సీరసం తలనొప్పి ఇన్నీ రావడం నిద్రపోవడం కలుగుతుంది. సావిత్రి సత్యవంతుని తలను తన తొడపై ఉంచుకొని చుట్టూ పరిశీలిస్తూ ఉంటుంది. ఆమె పాతివ్రత్య మహిమవల్ల యముడు వచ్చిన విషయం ఆమెకు అవుపడుతుంది. యముడు సత్యవంతుని శరీరంనుండి లొడితెడు బొమ్మను తీసికొన్నట్లు ఆమెకు అవుపడుతుంది. అది సత్యవంతుని సూక్ష్మ శరీరం అన్నదానికి చిహ్నం. దానిని పాశంతో బిగించి వెళ్ళిపోవడానికి ఉద్యుక్తుడవుతాడు యముడు. సావిత్రి లేచి ఆయనను అనుసరించి సంబోధిస్తుంది.

"అయ్యా! మీరెవ్వరు? ఇక్కడకు తాము విజయము చేసిన దెందుకు?" అంటుంది, అందుకు యముడు నేను ఈ పుణ్యపురుషుని కొనిపోవడానికి వచ్చాను. నీవు నా వెంట ఎందుకు వస్తున్నావు? ఈ దోషను నీవు రాజాలవు అంటాడు. అప్పుడు సావిత్రి "నా భర్తవెళ్ళే చోటుకు నేను వెళ్ళరానిదంటూ ఉంటుందా? నాకుగల భక్తివశంచేత నేను ఎక్కడికైనా వెళ్ళగలను రాగలను. సకల మార్గాలకూ ధర్మమార్గం ప్రధానమైనది. అట్టి ధర్మానికి ఆధారం సజ్జనులు. నీవు సజ్జన శేఖరుడవు. నీ దర్శనం చేసుకొన్నాక నాకు శుభం కలుగకుండా ఎలా ఉంటుంది? మూర్ఖులకువలె నేను ఎలా వెళ్ళిపోతాను వెనక్కు అలాంటి శుభాలు లేకుండా?" అంటుంది.

యమధర్మరాజు ఈమె చేసిన ప్రసంగానికి ఆశ్చర్యపోతాడు. "ఐతే నీవు ఏదయినా వరం అడగవలసింది—నేనిస్తాను నీ భర్త ప్రాణాన్ని ఈయడమనేది మాత్రం అడగవద్దు" అంటాడు. అప్పుడు సావిత్రి, తన మామగారి అంధత్వం పోయేటట్లు వరం అడిగి పొందుతుంది. కాని తాను ఇంకా యముని వెంట వెళ్తూనే ఉంటుంది. యముడు మళ్ళి ఆమెను ఆపి వెళ్ళిపొమ్మంటాడు.

అలాఇంకా కొన్ని వరాలు ఇస్తాడు ఒకదాని తరువాత ఒకటిగా మామగారికి తిరిగి రాజ్యంరావాలనీ తన తండ్రికి నూర్గురు కుమారులు కలగాలనీ కోరుతుంది. యముడు వాటిని అనుగ్రహిస్తాడు. ఐనా ఆమె ఇంకా యముని వెంబడిస్తూ అంటుంది.

"అయ్యా ఆత్మధర్మ నిరతులయిన పుణ్యాత్ములు దుర్లభులు. వారివల్ల సమస్తమైన కష్టాలూ తొలగిపోతవి. వారి కారణానే ఈ సూర్యచంద్రులు నిర్వికారంతో ఉంటున్నారు. ఈ సముద్రాలు ప్రపంచాన్ని ముంచెత్తకుండా నిల్చి ఉంటున్నది అందువల్లనేగదా! ఈ భూమి అలాంటి ఆత్మధర్మ నిరతి వల్లకాదూ ఈ భూతాలను భరించి ఉంటున్నది! ఏడు మాటలు ఒకరు ఒక రితో మాట్లాడిన మాత్రంచేత వారికి వీరు చుట్టమవుతారంటారు. ఆ కారణం చేత నేను నీకు చుట్టమను. అందుచేత నా మనోరథాన్ని పరిపూర్తి చేయటం కర్తవ్యంగా గ్రహించాల్సింది" అంటుంది. యముడు సరె అయితె నీ అభీష్టమేమిటి చెప్పు తీర్చుతానంటాడు.

ఆమె వెంటనే "అయితె సత్యవంతుని ప్రాణాన్ని వదలవలసింది" అని అడుగుతుంది. మరొక దోవలేక సత్యవంతుని ప్రాణాలను యమధర్మరాజు వదలివేస్తాడు. ఇచ్చి ఇతడు నాల్గువందల ఏండ్లు బ్రతుకుతాడు. నూర్గురు పుత్రులను కంటాడు. కీర్తిమంతుడవుతాడు. అని చెప్పి వెళ్ళిపోతాడు.

ఆమె తిరిగి అడవికి వచ్చి భర్త శరీరాన్ని వొళ్ళోఉంచుకొని ఉంటుంది. సత్యవంతుడు నిద్రలేచినట్లు లేస్తాడు. ప్రొద్దు గ్రుంకడం రాత్రిపడటం అయింది అప్పటికి. లేవజాలని సత్యవంతుని వీపుపై భరించి సావిత్రి అత్తమామలున్న ఆశ్రమానికి వస్తుంది. అప్పటికి ద్యుమత్సేనునకు దృష్టి కలిగి యుండటంచేత, ఆశ్చర్యంతో ఆయన తలమునక్కలై కూడ, కొమారుడూ కోడలూ రాలేదని దిక్కులు చూస్తుంటాడు. వీరిని చూచి అంతా ఎంతో సంతోషిస్తారు. ఆమెను మెచ్చుకొంటారు. తరువాత కొన్ని రోజులకు సాళ్వ దేశ జనులు వచ్చి ద్యుమత్సేనునితో "అయ్యా నీ శత్రువైన రాజు వాని వంశజులతో స్పర్థలు కలిగి నాశనమైపోయినాడు. మాకు నీవే రాజువు కావలసింది. ఇదిగో భద్రగజము. దీనినెక్కివచ్చి రాజ్యమేలవలసింది. పట్టం మీకే కట్టుతున్నాము అంటారు. ద్యుమత్సేనుడు అంగీకరించి తన కుమారునితో సహా భద్రగజమెక్కి అందరనూ తీసికొనిపోయి సుఖంగా రాజ్యం చేసుకొంటాడు.

ఈ శుభమంతా ఆ ద్యుమత్సేన సత్యవంతులకు సావిత్రి పతివ్రతా మహిమవల్ల కలిగింది. అలాగే ఈ ద్రౌపదికూడ తన పాతివ్రత్య మహిమ

వల్ల మీ కష్టాలను కడతేర్చుతుంది అని మార్కండేయుడు చెప్పి ఆశీర్వదించి వెళ్ళిపోతాడు.

సావిత్ర్యుపాఖ్యానంలో మోక్ష సాధనా మార్గ విషయముంది. అశ్వపతి భూ సంబంధమైన పతి. సర్వసంపదలూ కలిగి సాధన చేస్తున్న మనిషి ఆతడు సావిత్రిని ఉపాసిస్తాడు, తత్ఫలంగా సావిత్రి అనే కూతురు కలిగింది, ఆమె మద్రపతి కుమారుని వరించింది మద్రపతి అంటె అహంకార మమకారాలు లేనివాడు. అరణ్యంలో ఉన్నాడంటే ప్రశాంత స్థితిలో ఉన్నాడు. కండ్లు పోయినవంటె ఐహిక విషయాలు ఆయన చూడటల్లేదు. వాని కుమారుడు సత్యవంతుడంటె ఆ రాజుకు సత్యాన్వేషణ సమకూరిందని అర్థం. ఆ సత్యాన్ని సావిత్రి వరించింది. పెండ్లి చేసికొని నిష్ఠచేసింది. ఆ సత్యం అనేది సాధననుండి తొలగిపోకుండా సావిత్రి రక్షించుకొన్నది. ఈమె సాధన వల్ల మద్రపతికి పరిపూర్ణత్వము కలిగి అహం బ్రహ్మాస్మి సాధనలో తరించి తిరిగి సర్వం ఖల్విదం బ్రహ్మ సాధనలో ప్రపంచం దృష్టి సంపదలు సిద్ధించినవి. సావిత్రి అనే మాటవల్ల సూర్యోపాసన అనే అర్థం లేదా పరబ్రహ్మధ్యాన సాధన అనే అర్థం సూచింపబడింది. తరించినారని బోధ.

సావిత్రి అనే ఆమె మెట్టిన వంశాన్ని అలా ఉద్ధరించిందని చెప్పడానికి మార్కండేయుడీ కథను చెప్పాడు.

## 3. కర్ణునిష్ఠ- కుండలాపహరణం

సావిత్ర్యుపాఖ్యానం చెప్పి మార్కండేయుడు ధర్మరాజాదులను వదలి వెళ్ళిపోతాడు. జనమేజయుడు వైశంపాయనుని హఠాత్తుగా "కర్ణుని కవచ కుండలాలను ఇంద్రుడెందుకు ఎలా అపహరించాడు" అని అడుగుతాడు.

వైశంపాయనుడు ఆ కథను చెప్తాడు. "పాండవుల అరణ్యవాసం పన్నెండో సంవత్సరం పూర్తికాబోయే సమయంలో, ఇంద్రుడు తరువాత రాబోయే భారత యుద్ధంలో తన కుమారుడైన అర్జునుకు విజయం చేకూర్చడానికి తనకు చేతనయిన సహాయం చేయాలనుకొంటాడు. అర్జుననకు కురుపక్షంలో

దీటయినవాడు కర్ణుడేననే ప్రథ ఉండటంచేత అతడిని ఎలాగయినా తగ్గ జేయాలనే ఆశ ఇంద్రునికి కలిగింది. కర్ణుడికి సహజ కవచం ఉంది. సహజ కుండలాలున్నవి. వాటివల్ల అతడికి అస్త్రశస్త్రాలు తగులకపోతవి. అతడినుంచీ వాటిని తాను అడిగి పుచ్చుకొంటే అర్జునుడు కర్ణుని గెలవడానికి వీలు, కాని అడిగితే ఇవ్వబడేవా అవి సర్వసాధారణంగా ?

కర్ణుడికి కొన్ని శపథాలున్నాయి. అందులో బ్రాహ్మణులు అడిగిన దానాన్ని తాను ఇవ్వడానికి ఎల్లప్పుడూ సంసిద్ధుడుగా ఉండటం. ఈ విష యాన్ని అవకాశంగా తీసికొని ఇంద్రుడు బ్రాహ్మణ రూపంలో వచ్చి ఆ కర్ణుడి కుండలాలనూ కవచాన్నీ తనకు ఈయవలసిందని అర్థించాలని ఆశిం చాడు.

ఈ సంగతి సూర్యునకు తెలుస్తుంది. సూర్యభక్తుడు కర్ణుడని ప్రతీతి. సూర్యుడు కర్ణునకు మేలు చేయాలని చూస్తాడు. ఇంద్రుడు వచ్చి అర్థించ డానికి ముందె సూర్యుడు కపట బ్రాహ్మణ వేషంతో కర్ణుని దగ్గరకు చేరి, "ఇంద్రుడు కపట బ్రాహ్మణుడై వచ్చి నిన్ను కవచకుండలా లిమ్మని అర్థి స్తాడు. కాని ఏదో కారణం పెట్టి అవి మాత్రం ఇవ్వకుండా ఉండాల్సింది. అవి ఉంటె నిన్ను జయించగలిగే శత్రువెవరూ లేరు" అంటాడు.

కర్ణుడు, "మహానుభావా నీవూ వేల్పువే అని తోస్తోంది గాని బ్రాహ్మ ణుడవని తోచటల్లేదు. నీ వెవరో చెప్పాల్సింది" అంటాడు.

సూర్యుడందుకు తాను సూర్యుడనీ, కర్ణుడు తనకు భక్తుడు గనక వచ్చి మేలు చేయాలనె ఉద్దేశ్యంతో ఇలా తాను వచ్చాననీ చెప్తాడు.

కాని కర్ణుడు– బ్రాహ్మణుడైనవాడు నన్ను అడిగినట్లయితె నా ప్రాణాలు సైతం ఇస్తానుగాక. ఇది నా శపథము. అలాంటిది ఇంద్రుడు వచ్చి అడిగితె ఈ నికృష్టమైన కవచం కుండలాలు ఇవ్వడానికి నాకు వెరపెందుకు ? నా ఈ శపథం పాటిస్తున్న కారణంగా జనాలలో నా గురించి ఉన్న పొగడ్త ఇంతా అంతా కాదు. దాన్ని వదిలేసి, నా జన్మవ్రతాన్ని దిగజార్చడం అసంభవం దేవా ! అన్నాడు. "ఇంద్రుడు స్వార్థపరుడై వచ్చి అలా అర్థించినట్లయితె

అతడి కీర్తి పాతాళానికి దిగిపోతుందిగాక. నా కీర్తి త్రిలోకాయుతమవుతుంది. అది నాకు కలిగే పుణ్యం సుమా ?

— అంతేగాక,

కీర్తి విడువజాల గీర్తితో మెలగంగ జావు వచ్చెనేని జత్తుగాని
జగములోన నెల్ల నడికంటె జావుమేలనగ బరగుమాట యనఘ వినవె.

ఉ. కీర్తియ యిచ్చు బుణ్యగతిఁ గీర్తియ తల్లియుబోలె బ్రోచున
తీర్కీర్తియ యాయువున్ సిరియు గీర్తివిహీనుడచూ శవంబు దు
ష్కీర్తను నెల్ల చేటులును గిట్టి హరించుననండె తొల్లిభ
కార్తి హరుండు నాఁబరగు నంబుజసూతి జగద్ధితంబుగన్

అన్నాడు.

ఈ పద్యాలవల్ల కీర్తికి ఎంతటి ప్రాధాన్యమివ్వాలో తెలియవచ్చు. కీర్తి కోసం ప్రయత్నించడమంటె ఎఱ్ఱాప్రగడ నాటికిగాని వ్యాసుని నాటికి గాని ధనాన్ని సంచయం చేయడంకాదు. ధర్మ ప్రవర్తనం అవసరం ఇప్పుడు ధర్మప్రవర్తనం గలవాడు పట్టి అమాయకుడని మాత్రం అనబడతాడుగాని. కీర్తిని గడించటం అరుదు. ఇంతకూ కర్ణుడు పాటించిన శపథాలు ఏమిటంటే—

(1) బ్రాహ్మణులు అడిగినదేదైనా ఇచ్చివేయడమనేది. (2) పగ వాళ్ళను చంపడమో తాను చావడమో చేయడం మాత్రమేగాని వెనుతిరుగక పోవడం (3) శరణన్న వానిని ఎలాంటి శత్రువైనా సరె కరుణించి రక్షించటం (4) స్త్రీ. బ్రాహ్మణులు, బాలురు, ఆశురులు వీరిని ఆపదనుండి రక్షించడం "ఏటిని తప్పనుగాక" అంటాడు కర్ణుడు సూర్యునితో.

కాని, ద్రౌపది స్త్రీ, ఆమెకు అపకారం చేసింది కర్ణుడె. ఆమెను ఆపదలో రక్షించడానికి ఊహ కూడ చేయలేదు కర్ణుడు. కాని ఈ పై శపథాలు అప్పటికి అతడు చేసియుండక పోవచ్చు. ఘోష యాత్రలో గంధర్వుల చేతులలో దెబ్బలు తిని పారిపోయిం తరువాత ఈ నాలుగు శపథాలు పాటిస్తానని వ్రతం పట్టినట్లు అనుకోవాలి మనం. నిజానికి శతఃపూర్వం ఈలాటి కీర్తి కర్ణునకు లేదు. అది తరువాత తరువాత వచ్చినట్టిదేననేది నిజం.

అప్పుడు సూర్యుడు ఒక చక్కని ప్రశ్న వేస్తాడు—

క. తనకు తనయులకు సుతులకు, జననీ జనకులకు బంధుజనులకు గీడౌం
దని వెరవున కీర్తిగొనం జనుగా కందటను వెరయకలేమిటికిన్

అంటాడు. కీర్తికోసం చేసే పనులవల్ల తన సతీసుతులకు తల్లిదండ్రులకు బంధుజనులు మొదలగువారికి సమాజానికి కీడు రాకుండా ఉండేటట్లుగా ఉండాలిగాని అందరూ దుఃఖించేటట్లుచేసి కీర్తి గడించటంవల్ల ప్రయోజన మేమిటి అంటాడు. ఇతర్లను చంపి ధనం కొల్లగొట్టి ఇంతధనసంతుదవిపించు కొని ఉరికంబం తానెక్కి- ఇతర్లనెక్కించి దుఃఖంలో ముంచటం సరికాదని బోధ. ఇది పరమ సత్యంగా భావించటం అవసరం అనిపిస్తుంది. వ్యక్తి కేవలం తన కోసమె ఈ ప్రపంచంలో బ్రతుకుతున్నాడనటం స్వార్థం. తన కుటుంబం బంధువులు, స్నేహితులు భృత్యులు, ఆశ్రితుల సమూలంకోసం బ్రతుకుతున్నా డనేది చర్చచేసి తెలిసికొనవలసిన విషయం. వీళ్ళందరకూ కీడు కలిగించి తాను ఆత్మహత్య చేసికొంటూ ఫలాని ఆశయంకోసం చస్తు న్నాను అనేవాడి కీర్తి నిజంగా కోరదగిన కీర్తేనా ? ఆస్తిని తాకట్టుపెట్టి త్రాగి తందనాలాడి ఇంత గొప్పపని చేస్తున్నానంటూ భార్య పిల్లల్ని దుఃఖసము ద్రంలో ముంచి చనిపోయేవాడు కీర్తిమంతుడేనా ? కాదని బోధ.

ఈ అంతరాంతరమైన ధర్మాలు ఆలోచిస్తే తెలుస్తవి. అందువల్ల ఎంతో మనస్సంతోషం కలుగుతుంది. "ఇవన్నీ మనకెందుకు? మనకు డబ్బేమయినా ఉందా అని మాత్రం ఆలోచించేవాడికి ఆ ఆలోచనవల్ల (దుఃఖంతో కూడినా) డబ్బయితె వస్తుందిగాని మనస్సంతోషం చాలినంత కలగదు.

ఇంతకూ కర్ణుడు ఈ అహంకారం వల్ల సూర్యుని మాటలకు వ్యతిరేకం చెప్తాడు. అందుకు సూర్యుడు "అయితె ఒక పనిచేయి- ఇంద్రుడి వద్ద ఒక శక్తి ఉన్నది. దానిని నీవు తీసికొని కవచకుండలాలు దానం చేయవలసింది. ఆ శక్తి వల్ల ఎవరినయినా జయింపగలుగుతావుగాక" అంటాడు. కర్ణుడు సరె నంటాడు. ఇది కర్ణుడి ప్రకర్ష.

ఆ తరువాత వైశంపాయనుని జనమేజయుడు మరొక ప్రశ్న వేస్తాడు. సూర్యుడు కర్ణునిమీద అంత ప్రేమకలిగియుండటంలో దేవ నిర్మితమైన రహస్యమున్నదంటారు. ఏమిటది అని. అప్పుడు వైశంపాయనుడు కుంతికి దూర్వాసుడు వరం ఇవ్వటం వంగతి కథను పూర్తిగా చెప్తారు.

-కర్ణునితో మాట్లాడి సూర్యుడు వెళ్ళిన తరువాత కొన్నాళ్లకు ఇంద్రుడు వస్తాడు. బ్రాహ్మణ వేషంలో ఉండి కర్ణుని, కవచకుండలాలిమ్మంటాడు. "ఈ కవచకుండలాలు నీకు ఏం పనికివస్తవి కనక– ఇంకా ఏమైన ధన కనక వస్తువాహనాలు ఇస్తాను తీసికొమ్మంటాడు కర్ణుడు. బ్రాహ్మణుడు "నాకేవీ వద్దుగాక. అవే కావాలి"అంటాడు.

అప్పుడు కర్ణుడు నీవు ఇంద్రుడవు. నాకు తెలుసు. నీ దగ్గరున్న శక్తి నివ్వు నాకు. నీవు అడిగినట్లు ఈ కవచకుండలాలను నా శరీరంనుంచి కోసేసి ఇస్తానుగాక అంటాడు. ఇంద్రుడు "శక్తిని ఇస్తానుగాని ఒకే ఒక్కసారి దానిని ఉపయోగించుకోగలవుగాక. అవసరం రాకుండా మాత్రం నీవు దానిని వినియోగించటానికి పనికిరాదుసుమా" అంటాడు. సర్వసాధారణంగా ఆశక్తి శత్రువులను చంపి తిరిగి ఇంద్రుని చేరుతూ ఉండేది అలా తిరిగి చేరటం అనే వీలును కర్ణునకు ఇంద్రుడు ఈయలేదు.

కర్ణుడు తన సహజ కవచకుండలాలను తెగ్గోసి ఇచ్చేస్తాడు. కిన్నర యక్ష సిద్ధ సాధ్యులు దివినుండి "హో" అని అరచి మెచ్చుకొంటారు.

కర్ణుడు దానం చేయటం వల్ల నాశనమైనాడా అహంకారం వల్ల నాశనాన్ని తెచ్చుకొన్నాడా ఎవరి సంస్కారాన్ని బట్టి వారికది అర్థమవుతుంటుంది. ఆలోచించి మరీ తెలిసికొనటం పెద్దల ద్వారా తెలిసికొనటం ఇవీ కర్తవ్యాలు మనకు.

## 4. ఆరణేయము

అరణ్యంలో ఒకనాడు ధర్మరాజు సుఖంగా కూర్చొని ఉండగా ఒక బ్రాహ్మణుడు అడావుడిగా పరుగెత్తుకొని వస్తాడు. అరణి అని ఒక కొయ్య పనిముట్టు ఉండేది. అది యజ్ఞం కోసం కావలసిన అగ్నిని పుట్టించడానికి ఉపయోగించబడుతుండేది ఆ రోజుల్లో. దానిని ఒక చెట్టుకొమ్మకు తగిలించి పెట్టుకొన్నాడట ఆయన. ఇంతలో ఒక కొమ్ముల మృగం వచ్చి తన కొమ్ముతో ఆ చెట్టునూ తన వంటినీ గోకిగోకి తన కొమ్ముకు ఆ అరణి తగులొక్కన్న సమయంలో పరుగు పరుగున వెళ్లిపోయిందట. దానిని నాకు

తెచ్చిపెట్టాల్సింది అని అర్థిస్తాడు బ్రాహ్మణుడు ధర్మరాజును. అది లేకపోతే తనకు నిత్యవిధి జరగడానికి అడ్డంకి వస్తుంది అన్నాడు.

వెంటనె పాండవులు బయలుదేరారు ఒకరి తరువాత ఒకరు ధర్మ భీమార్జున నకుల సహదేవులు. వీరెంత పరుగెత్తితె ఆ మృగం అంత అందకుండా వెళ్ళిపోతోంది. కనీసం అర్జునుడైనా బాణం వేసి ఎందుకు చంపి పట్టుకో లేదో తెలీదు. వేశారటగాని అవి దానికి మాత్రం తగలక పోయినవి. ఎంత చిత్రమైన విషయం! అర్జునుడే ఒక మృగాన్ని కొట్టజాలకపోవటం ఎంత ఆశ్చర్యకరము! చివరకు ఆ మృగం కనపడకుండా పోయింది. అప్పటికే వారెంతో దూరం వచ్చేశారు. ఎండ మాడుస్తుంది. దప్పిక అవుతోంది. అందుకని అక్కడొక పెద్ద మట్టి వృక్షం క్రింద చేరి విశ్రాంతి తీసికొంటూ ఉంటారు.

అప్పుడు నకులుడు మామూలుగా చర్చాంశంగా ఉంటుండే విషయమె లేవనెత్తుతాడు. ఇలా ఎవరో బ్రాహ్మణుని కోసం ఇంత శ్రమను బుద్ధిపూర్వకంగా అనుభవిస్తున్నాం గదా అనుకొన్నవాడై – ధర్మరాజును గూర్చి అంటాడు. కులశీలోన్నతి. వినిశ్చల కరుణారతి ధర్మసంగ్రహ మతీగల మనకు ఈ విధంగా అలజడులు రావడానికి కారణమేమిటి అని, దానికి ఎవరికి వారు తమ తమ ఊహాలను వెలిబుచ్చుతారు.

ధర్మరాజు—— సుఖానికీ దుఃఖానికీ కారణం తన పూర్వకృతమైన కర్మగాక మరేమీకాదు. అది తప్ప ఇంకేదీ కావడానికి వీలు లేదు.

భీముడు– దానినే సమర్థిస్తున్నవాడల్లే అంటాడు—— అప్పుడు, ప్రాతిగామి వెళ్ళి ద్రౌపదిని సభలోకి తీసికొస్తానన్నప్పుడే, ఆ ధృతరాష్ట్రి సుతుల నందరినీ చంపక ఊరుకొన్నాను నేను, అదే నే చేసిన దుష్టకర్మ. అందుకు ఫలితంగానే ఈ ఎడరు పుట్టింది మనకు.

అర్జునుడు—— ఆ కర్ణుడానాడు మాట్లాడిన పటు వాక్యాలు వినికూడ కోపం తెచ్చుకొనక ఈ వనాలకు పిచ్చి సన్యాసుల్లాగా రావటంవల్ల ఈ దుఃఖాలు వచ్చినయి తమ్ముడూ.

సహదేవుడు— అసలాద్యూతం ఆడిన శకునుని పట్టుకు చంపకపోవటం వల్ల వచ్చింది, మనకీ గతి.

ఇంతకూ అప్పటి గతి ఏమిటి? అడవుల్లో ఉండటం క్రొత్త విషయమేం కాదు. కాని అప్పుడు బాగా దప్పికొని ఉన్నారు అందరూ. అదీ అప్పటికి వచ్చిన అదనపు దుఃఖం. ధర్మరాజు అది కనిపెట్టి, ఇక నకులుడ్ని మళ్లీ మాట్లాడనీయకుండగా,— నాయనా నీవు ఈ చెట్టు నెక్కి సరోవరం దగ్గల్లో ఏదయినా వుందేమొ పైనుంచీ చూడు ఉంటే వెళ్లి కొంత నీరు పట్టుకొని రావయ్యా నీ సోదరులు దాహంతో మహా బిక్కపడిపోతున్నారు: అంటాడు.

నకులుడు అలాగే చెట్టెక్కి ఒకానొక చోట సరోవరం వున్నదని గుర్తించుకొని దిగి, వెళ్లి వెళ్లి, ఒక నీటి ఒనరు చూస్తాడు. నీరు పరిశుభ్రంగా ఉంది. చల్లని గాలి వస్తోంది కూడ నీటిపై నుంచి. గబగబా వెళ్లిపోయినాడు. వెంటనె ఒక శబ్దం కొన్ని మాటలూ వినబడ్డాయి.

"ఆగవయ్యా ఆగు. ఈ సరోవరం నాది. నేను కొన్ని ప్రశ్నలడుగుతాను. వాటికి సరిగా ఉత్తరాలు చెప్తే ఈ సరోవరంలో నీరు త్రాగవచ్చు. అలా కాకుండా త్రాగటానికి వీల్లేదు. అని వినబడింది. చుట్టూ చూశాడు నకులుడు. ఎవరూ కన్పడలేదు అందుకని ఆ శబ్దాన్ని నకులుడు లెక్కచేయలేదు. నిరాదరించినవాడై వెళ్లి నీళ్ళు త్రాగేశాడు. వెంటనే తలత్రిప్పు వచ్చి పడిపోయినాడు.

ధర్మరాజాదులు ఈతడి కోసం ఎంతసేపు కాచుకొన్నా ప్రయోజనం లేకపోయింది. అందుకని నకులుడ్ని వెదుక్కుంటూ సహదేవుడు వస్తాడు సరోవరం దగ్గరకు. నకులుడు ఎందుకు అలా పడిఉన్నాడో తెలీలేదు. ముందు తన దప్పిక తీర్చుకొంటే నకులుని విషయం సమగ్రంగా చూడవచ్చునని వెళ్లి నీరు త్రాగబోతాడు. మళ్లీ వెనకటిలా మాటలు వినిపిస్తాయి కాని ఎవరూ కండ్లకు కనపడరు. "ఆః ఎవరూ లే"రనుకొంటూ నీళ్ళు త్రాగి తను కూడ సోదరునిలా పడిపోతాడు.

ఇంకా కొంతసేపటికి అర్జునుడు వచ్చి ఆశ్చర్యపోయి ఏమీ తోచక దప్పిక తీర్చుకొనడానికి సరోవరంలోకి దిగుతాడు. మళ్ళీ వెనకటిలా,

మాటలు వినబడుతవి. అర్జునునకు అత్యంత కోపం కలిగి బాణం సంధించి శబ్దం వస్తున్న వైపునకు కొట్టుతాడు. ఐనా ఆ మాటలు వినబడుతూనె ఉంటవి. ఇంక తాను ఏం చేయాలో తోచక క్రోధంతోనే నీరు త్రాగేస్తాడు. వెంటనె పడిపోతాడు.

కొంతసేపటికి భీముడొస్తాడు. ఆశ్చర్యచకితుడవుతాడు. వీళ్ళంతా ఇలా పడిపోయినారు. ఏ దేవతో రాక్షసుడో వీళ్లనిలా చేసి ఉంటాడు. అందుకని వీళ్ళు ఓడిపోయి ఉంటారు. నేను ఆ దేవత పని పట్టుతాను మంచినీరు త్రాగి అంటూ వెళ్తాడు. మళ్ళీ ఆ మాటలు వినవస్తవి. కాని అతడు తన పనిలో తానుండి నీరు త్రాగడం చేత అతడూ పడిపోతాడు.

చివరకు ధర్మరాజు తానే బయలుదేరి వచ్చి చూస్తాడు. గుండె పగిలేంత భయపడిపోతాడు దుఃఖంచేత. చుట్టూ చూసి ఎవరూ లేకపోవటంతో మరీ ఆశ్చర్యపడినవాడై చివరకు ఈ సరస్సులో నీరు విషము కావడంవల్ల ఇలా అయినారా అనుకొని కూడ దానిపై ఎగిరే పక్షుల్ని చూసి ఈ నీరు విషదగ్ధం అయినట్లు లేదే! అనుకొంటాడు. "ఓహో! వీళ్లు చనిపోతే, నేను వెళ్లి అమ్మ అయిన కుంతికి ఏంచెప్పను! ఎక్కడ పుట్టాము. ఎక్కడ పెరిగాము! ఇక్కడ ఇంత దూరానికి వచ్చి వీళ్ళు చనిపోతున్నారు! ఈ దురంతమైన దుఃఖాన్ని నేను తరించేదెలా! కృపుడు ద్రోణుడు భీష్ముడు వీళ్ళు వచ్చి "ఏశ్వేరి నాయనా" అంటే ఏం చెప్పను!

దుఃఖంలో కూడ శరీర ధర్మాలు పాటించడం తప్పదు. తనకు దప్పిక అవుతోంది. వెళ్లి నీళ్ళు త్రాగాలని సరోవరంలోనికి దిగుతాడు. అప్పుడు మాటలు ఎక్కణ్ణుంచో వినబడుతవి "ఓహో! ఏమయ్యా! నేను ఒక బకాన్ని. ఈ కొలను నాది. నీ తమ్ములు నా మాటలు వినక నీళ్లు త్రాగి యిలా ప్రాణాలు విడుస్తున్నారు. నీవూ అలాగే చేస్తే అలాగే అవుతావు. అందుకని నేనడిగిన ప్రశ్నలకు సమాధానం సరిగా చెప్తే అప్పుడు ఈ నీటిని త్రాగడానికి అభ్యంతరముండదు. నీవు చెప్తానంటే అడుగుతాను ప్రశ్నలు" అని మాటలు వినబడుతవి.

ధర్మరాజు :- అయ్యా నీవు బకరూపంలో ఉన్న రుద్రుడవో, పావకుడవో అయి యుండాలి. లేకపోతే నా తమ్ముల నిలా చేయగలిగి యుండే

వాడవుకాదు. అంటాడు. ధర్మరాజుకు తాము చెప్పులనీ, ఈ భూమిపై నుండె జంతువులు తమేమ్మీ చేయజాలనీ పటక బలమైన నమ్మకం ఉన్నదని పిస్తుంది. పరాశరుడు మార్కండేయుడూ పీళ్లంతా అలా ఆయనకు చెప్పి ఉన్నారు వెనక.

బకము :— అవును బాబూ నేను బకాన్ని కాదు నేను యక్షుణ్ణి ఇదుగో చూడు నా శరీరం, అని ఎదుట నిలుస్తాడొక యక్షుడు. తాళ ప్రమాణం కలిగినవాడు, "నా మాటలు వినక నీ తమ్ములు చచ్చారు. నీవు సమ్యగ్విచార శీలుడవు గనక విన్నావు నామాట" అంటుంది.

ధర్మరాజు :— "అయ్యా నీ ప్రశ్నలకు నీకు నచ్చేటట్లు చెప్పగలనా అయినా నాకు చేతనయినంత వరకూ చెప్తానుగాక. అడుగవలసింది!" అంటాడు. అప్పుడీ ప్రశ్నలూ జవాబులూ నడుస్తవి. ఈ యక్ష ప్రశ్నలు ఆత్మజ్ఞాన ఫలంగా శోకహరణానికి గాను ప్రస్తావించబడినవి అనేది జ్ఞాపకముంచుకోవాలి. ఆత్మజ్ఞానానికి అవసరమైన వివిధ సాధనలు ఈ ఘట్టంలో ఉన్నాయి.

యక్షుడు :— సూర్యునె ఉదయింపజేయకలిగిందేది ? అందుకు అన్ని విధాలా సహాయపడేదెవరు ? అతడు అస్తమించడానికి అధిభూతులెవరు ? అతడు ఎక్కడ ప్రతిష్ఠితుడై ఉన్నాడు ?

ధర్మరాజు :— సూర్యుడంటే జీవుడు. (ఈ జీవుడు ఉదయించడమంటె ఉన్నతిని పొందటం. అంటే బ్రహ్మత్వాన్ని పొందటమన్నమాట. ఈ జీవుడు బ్రహ్మైక్యం పొందట మెలాగని యక్షుని ప్రశ్న.) ఆ జీవుడు బ్రహ్మత్వం పొందాలంటే వేదాల్లో చివరగా చెప్పిన ఉపనిషత్తుల మార్గంలో అంతర్ముఖుడై పయనిస్తే నే గాని సమకూరదు. అందుకని సూర్యుని ఉదయానికి వేదమె కారణభూతమవుతుంది. ఈ చివరి మాట ధర్మరాజు చెప్తాడు సమాధానంగా.

ఆ మార్గంలో పయనించి బ్రహ్మత్వమందు కొనటానికి సహాయపడేది అంతఃకరణంలో కలిగే సద్వృత్తులె. అవె దైవీసం పద్గుణాలు— శమ, దమ, ఉపరతి, తితిక్ష, శ్రద్ధ, సమాధానాలు. ఈ సద్గుణాలు దేవతలు. దేవతలు మనో

మాత్ర శరీరులనటం అందుకె. కనుక బ్రహ్మత్వం పొందటానికి వేద మార్గంలో పయనించేవారికి సహాయకులు దేవతలె. అంటె మంచి ఆలోచనలని అర్థం.

సూర్యుడు అస్తమించడం అంటే జీవుడు తన పరిమితిని వదలి బ్రహ్మత్వాన్ని పొంది స్వస్థానం చేరుకొనటమని అర్థం. అలా స్వస్థానాన్ని చేరడానికి ధర్మపరంగా నడుచుకొనటమె మార్గం. అది జీవబ్రహ్మములను ఐక్యం చేయడానికి కారణమవుతుంది. సక్తి లేకుండా కర్మను, తన ధర్మం కనుక నడుపుతున్నానని నడిపేవానికి ఏకాగ్రమైన అంతర్దృష్టి కలిగి జీవుడు అంతరాంతరంలో నున్న బ్రహ్మమును చేరడానికి మార్గం సమకూరుతుంది. సూర్యునకు ఈ ప్రపంచంలో జరిగే కర్మలయందు సక్తి లేదు. తన లక్షణమైన ఏకాగ్రమైన దృష్టితో స్వస్థానం వైపుకు వెళ్ళి ఎలా దాన్ని చేరగలడో అలాగే జీవుడున్నూ సక్తి లేకుండా ధర్మం నడపటం వల్ల బ్రహ్మన్ని పొందగలడు.

జీవుడు (సూర్యుడు) సత్యమందు ప్రతిష్ఠితుడై ఉన్నాడు. పరమాత్మే సత్యము. ఆయన చిత్ శక్తితో సంకల్పం కలిగిన క్షణాన శబ్ద స్పర్శ రూప రస గంధాలనె తన్మాత్రల భావం ఉద్భవించింది. వాటిపై గల అభిమానం కారణంగా పరమాత్మ జీవుడై పరిమితి ననుభవించి పంచభూతాలను జ్ఞానేంద్రియాలను శరీరాన్ని పొందినవాడైనాడు. ఇతడు బాహిర దృష్టి వదలి అంతర్దృష్టితో నిజం తెలిసికొని తాను బ్రహ్మమని తెలిసికొన్న క్షణాన తాను తప్ప ఇంకేదేహం గాని వికారంగానిలేవని తెలిసికొంటాడు. అప్పుడూ సత్యమునందే ప్రతిష్ఠితుడై ఉంటున్నాడు. అందుకని జీవుడు (సూర్యుడు) ప్రతిష్ఠితుడై ఉండటం "సత్య"ములోనే.

యక్షుడు :– ధర్మరాజా ! శ్రోత్రియుడెవరు ? అతడు దేనివల్ల గొప్పతనాన్ని పొందగలడు ? దేవతలుగాక ఇంకా ఇతర సహాయులెవరు జీవునకు బుద్ధిమంతుడని ఎవరిని అనాలి ?

ధర్మరాజు :– వేదం శ్రుతం చేసినవాడు శ్రోత్రియుడు. శ్రుతం చేయటమంటే కేవలం చెవులతో వినటమనికాదు. మనసు బుద్ధిలతో అర్థం తెలిసి ఘటించటమని సూచన. దానిని నమ్మినవాని ఈ స్థితె శ్రోత్రియత్వము.

ఇంత గొప్పదనాన్ని శ్రోత్రియుడెలా పొందగలడంటే చెపిన శ్రవణాన్ని మననం చేసి విచారణచేసి తపసు చేయటంవల్ల ఉద్ధృతుడవుతున్నాడు. అతడే పరమాత్మ స్వరూపాన్ని అంతర్దృష్టిద్వారా నిశ్చయం చేసికో కలుగుతాడు గనక గొప్పవాడవుతున్నాడు.

దైవీ సంపత్తుతోపాటు ద్వితీయ సహాయకు లెవరంటె తన స్వంత భావనా బలం. "ధృతి" వెనుదిరగని శ్రద్ధాపూర్ణమైన పట్టుదలతో బ్రహ్మ భావాన్ని అన్వేషించగలగటం. ఇదె సహాయకుడు జీవునకు.

బుద్ధిమాన్ ఎవరంటే శ్రవణమనన నిధ్యాసనలు నిశ్చయంగా నడపగలిగే వాడు. ఇతడు శ్రవణంతో ఆరంభించవలసినవాడు గనక, శ్రవణం కోసం గురువు నాశ్రయించాలనే బుద్ధితో నడచుకొనేవాడే బుద్ధిమాన్ అలా శ్రవణమె ఆరంభించక తెలిసిన గురువు వద్దకె వెళ్ళనివాడు బుద్ధిమాన్ కాదని భావం.

యక్షుడు :– బ్రాహ్మణులు దేవతలు అని ఏ కారణంచేత అనబడు తున్నారు ? వారికి సాధుభావం ఎందువల్ల కలిగింది ? అసాధుత్వ మెప్పుడు కలుగుతోంది ? మనుష్యుడుగా సామాన్యుడుగా ఎప్పుడు పిలువబడుతాడు ?

ధర్మరాజు :– బ్రాహ్మణుడు అధ్యయనం చేసినందువల్ల శ్రవణం చేయాలనె దైవీగుణం కలుగుతుంది. దైవీగుణం దేవత, ఆ దేవభావం స్వాధ్యాయం చేసినందువల్ల వస్తుందనటం అందుకె. రాకపోతె అతడు దేవత్వం పొందడని ధ్వని.

శ్రవణ స్థితి దాటి తపస్థితిలో చేరినప్పుడు సాధుభావం వానికి కలుగు తున్నది. ఇదె మనన విచారణముల స్థితి. అనగా అధిక వ్రతశీలతవల్ల సాధుభావం కలుగుతోంది. వ్రతశీలత అంటె శమదమాది రూపమైన తపస్సని అర్థం.

అతడికి అసాధుత్వ మెప్పుడు కలుగుతోందనే ప్రశ్నకు అతడు ఈ శ్రవణ మనన నిధి ధ్యాసనలనే తనకయిన విశిష్ఠ వృత్తిని మానినపుడు అసాధువవు తున్నాడనేది జగద్విదితము.

సామాన్యుడెప్పుడవుతాడంటే శౌచం లేక సాధన లేక మృత్యువంటె భయపడేవాడె సామాన్యుడు, ఇదేమిటి మత్యువంటె భయపడనివాడెవడు ?

తాను చనిపోవటమనేది లేనేలేదని తెలియనివాడల్లా మృత్యువుకు భయపడే సామాన్యుడే. "నేను" అంటె తెలియనివాడని అర్థం. అతడు సామాన్యుడవుతాడు. దేహాభిమానం కలవాడని బోధ. బ్రాహ్మణులనబడేవారుకూడ దేహాభిమానులైతె సామాన్యులవిధ్వని.

యక్షుడు :– క్షత్రియులనబడేవారికి దేవత్వమెప్పుడు కలుగుతుంది? వారిలో సాధువులెవరు? వారు సామాన్యులయేదెప్పుడు? వారిలో అసాధువులెవరు?

ధర్మరాజు :– అస్త్రశస్త్రాదిది ధనుర్వేదాభ్యాసం చేయడం వల్ల ప్రపంచ సౌభాగ్యం కోసం తమ శరీరాలను అర్పించే దైవీసంపత్తి వారికి కలుగుతుంది గనక అప్పుడు వారు దేవతలవుతారు.

వారు సాధువులపడమనేది యజ్ఞాలను చేసేటప్పుడు, దైవీసంపత్తును యజ్ఞ రూపంలో ప్రపంచానికి మార్గదర్శకం చేయడంవల్ల సాధువులవుతారు.

మృత్యుభయాన్ని వారు సంతరించుకొన్న మాత్రంచేత వారు సామాన్యులయిపోతారు. సందేహంలేదు. అసాధులయిపోయేది ఎప్పుడంటే శరణు పొందినవానిని విడిచిపెట్టినప్పుడు అసాధులవుతారు.

యక్షుడు :– జ్ఞాన యజ్ఞంలో 'సామ' మేది "యజు" వేది "ఋక్" ఏది? ఈ 'యజ్ఞం' దేనిని అతిక్రమించకుండ ఉంటుంది?

ధర్మరాజు:– జ్ఞాన యజ్ఞంలో 'సామ'మనేది ప్రాణమే. ప్రాణ నిరోధం ప్రాణాయామం చేయటమే సామం చదవడం. ఇక "యజు" వేదంటె మనసు. మనో నిరోధమే యజువును చదవటం. ఋక్ అంటె శబ్దం అది వేదమె. వేదంలో ఉపనిషత్తుల్లో చెప్పిన జ్ఞానం యజ్ఞమె 'ఋక్'. ఈ జ్ఞాన యజ్ఞం వేదాన్ని శబ్దాన్ని అతిక్రమించదు. ఇంతవరకూ అంతరంగ సాధనల ముచ్చట అయింది. ఇక యక్షుడు బహిరంగ సాధనల విషయం పృచ్ఛిస్తాడు–

యక్షుడు :– సామాన్యుడైన రైతుకు శ్రేష్ఠమేది? పరిశ్రమ చేసే సామాన్యునికి ఏది ముఖ్యం? కీర్తి ప్రతిష్ఠలు పొందాలనే కాంక్ష గలవారికి సాధన ఏమిటి? సంతతి కావాలనే వారికి ప్రధాన ఫలమేది? (ఇక్కడ వారు అ

కోరికనెలా పొందుతారని కాదు ప్రశ్న. వారు ఏ సాధన చేసి తరించాలి అనేది ప్రశ్న.)

ధర్మరాజు :– సామాన్యుని బుద్ధి అంతరంగ సాధనల పైపునకు చేరటానికి ముందు యజ్ఞభావం కలగాలి. వర్షం కావాలి అనీ ఆ వర్షం వల్ల సర్వులూ లాభం పొందాలీ అనే సమష్టి సత్భావం కలిగించుకొనటం ముఖ్యం. అలా దైవీభావం కలిగించుకోవాలి రైతువంటి సామాన్యుడు. దేవతల తృప్తికి యజ్ఞభావం కలుగజేసికొనటం ముఖ్యం.

ఉత్పత్తిచేసే సామాన్య మానవులకు ఉత్పత్తికయిన బీజాలు కావాలి కనక ఆ బీజాలె ముఖ్యం. అందుకు పితృదేవతా తృప్తి కలుగజేయటమె సాధన. పితృదేవతలు ఆయుస్సంతతి ధనం విద్య స్వర్గం మోక్షం లౌకిక సుఖం రాజ్యం ఇవన్నీ కూడే మార్గం చూపుతారని స్మృతి. అంతరంగ సాధన కలగటం పాధనా భాగం.

కీర్తి ప్రతిష్ఠలు కావాలనె సామాన్యులైతే గోవుల్ని పెంచి వాటి సేవ చేయటం వల్ల కొన్నాళ్ళకు అంతరంగ సాధన కలుగుతుందని సమాధానం.

సంతతిని కోరేవారు పుత్రుల్ని పొందాలి. వాళ్ళు పితృకర్మలు చేస్తారు గనక వాటివల్ల పరంపరగా శ్రవణాది సాధనలకు కారణమవుతుందని ఆశయం.

యక్షుడు :– బ్రతికియుండీ కూడ చచ్చినవానితో ఎవరు సమానులు ?

ధర్మరాజు :– దేవతలు, అతిథులు, పితరులు, భృత్యులకు, ఆత్మకు పెట్టక తానే అనుభవించేవాడు జీవన్మృతుడు.

యక్షుడు :– భూమికంటె బరువైనదేది ? (భూసంబంధ సుఖాలకంటె మిన్న ఏదని ప్రశ్న.)

ధర్మరాజు :– తల్లి– పైన చెప్పిన సాధనలు చేతకాకపోతె తల్లిదండ్రుల సేవ చేయడమె మార్గమని బోధ.

యక్షుడు : ఆకాశంకంటె ఎత్తైనదేది ? (చిదాకాశం సంగతెరుగనివానికి ఎవరు గతి అని ప్రశ్న.)

ధర్మరాజు : తంత్రి.

యక్షుడు : గాలికంటె త్వరగా పోగలిగిందేది ?

ధర్మరాజు : మనసు.

యక్షుడు : గడ్డిపోచకంటె సులభంగా ప్రాప్తించేదేది ?

ధర్మరాజు : చింత, దాన్ని గడ్డిపోచలా వదలివేయాలని ధ్వని.

యక్షుడు : నిద్రిస్తూకూడ కళ్లుమూయందేది ?

ధర్మరాజు : చేప, నిద్రలో కూడ ఏకాకిగా ఉంచేది 'నేను' అనేవాడె. జాగ్రత్స్వప్నసుషుప్తుల్లో కన్ను మూయడతడు. చేప నీటిని అంటనట్లు అతడు మాయను అంటనివాడె.

యక్షుడు : పుట్టికూడ చేతనం లేంది ఏది ?

ధర్మరాజు : గ్రుడ్డు, బ్రహ్మాండం జడంగా (ప్రకృతిగా) పుట్టి, పర మాత్మ అందులో చైతన్యాన్ని ఉంచే వరకూ అలా ఉంటుంది కదా.

యక్షుడు : రూపం కలిగి కూడ హృదయం లేనిదేది ?

ధర్మరాజు : చైతన్యంలేని ప్రకృతి – రాయి, భగవానుడందులో చేరి వెలిగింపచేసే వరకూ హృదయం ఉండదు దానికి.

యక్షుడు : వేగమే ఆధారంగా మనేదేది ?

ధర్మరాజు : ఏఱు (నది) ఆలోచనా ప్రవాహమే ఆధారంగా ఉందేదె చిత్తం. ఆ వేగం నశిస్తేగాని చిత్తం నశించదు.

యక్షుడు : (ఇక మనో నిరోధం చేయలేని వారికి సాధనా విషయం)– దోవేపోయేవాడు, రోగి, గృహస్థు, మృతుడు– వీరికి– చుట్టాలెవరు ?

ధర్మరాజు : మొదటి వానికి డబ్బు, రెండోవానికి వైద్యుడు, మూడో వానికి సద్భార్య, నాల్గోవానికి తాను చేసిన కర్మ ఇవే చుట్టాలు. ఇవి సంత రించుకోవాలి.

ఈ సంభాషణలు వ్యాసమహర్షి వ్రాస్తూ ఒకానొక సందేశాన్ని చదువరు లకు ప్రదానం చేస్తున్నాడనేది గమనీయం. మృతునకు కర్మలె చుట్టాలని

చెప్పడానికి రోగికి వైద్యుడెలాగో అలా ననటం చూస్తాం— అది బోధా పైనం.

అందుకని సంభాషణగా గాక, విషయ విమర్శవల్ల మనకు ప్రయోజన మెక్కువ ఉంటుందనిపిస్తుంది. మిగిలిన ప్రశ్నలకు ధర్మరాజు చెప్పిన విషయాలు స్థూలంగా ఏమిటంటె,—

నాశరహితమైన సత్య ధర్మమె సనాతన ధర్మం. అగ్ని కంటె తగిన అతిధి ఎవరూ ఉండరు కనుక, అగ్నిని అతిథిగా చేసి అమృతమైన ఆవు పాలను ఆహుతి చేయటమనే ధర్మం చేయటం యుక్తం, యజ్ఞ భావయుతమతి అని బోధ. ఈ ప్రపంచ స్వరూపం దృశ్యమె అనటం సరికాదు. వాయు రూపమె దాని రూపం. శరీరం చచ్చిం తరువాత మిగిలేది ఆతివాహిక శరీరమే వాయు రూపమె. అదె మోక్షానికి ద్వారం.

ఆ ఆతివాహిక రూపం సమష్ఠి— వ్యష్ట్యాత్మకమైంది. అది పోతె మిగిలేది సూర్యుడె. అంటె చిత్ ప్రకాశితమైన ఆత్మె. మనసు అవిద్యకారణంగా మళ్ళీ పుట్టుక కలిగి జగత్తును కల్పిస్తోంది. మనసు అంటె చంద్రుడనకు అర్థం. అవిద్యా నాశనమెలాగంటె— చనిపోవడానికి మందు ఏమంటే— సూర్యుని భావించటం. అంటె చిదాభాసుని చూడటం, ఈ శరీరంలో ఉండి అలా చేయచ్చు. ఈ శరీరం చాల గొప్పది. ఎందుకంటె విద్యకూ అవిద్యకూ కూడ అది స్థానం.

ధర్మానికి కుదురు శాస్త్రీయమైన పురుషప్రయత్నమె. కీర్తి రావాలంటె దానమె ముఖ్యం. స్వర్గానికి మార్గం సత్యమె. సుఖాలకు కారణం శీలమె.

నరుడైనవానికి ఆత్మజుడె ఆత్మ. భార్య దైవికంగా వచ్చిన చుట్టము. నరుడు మేఘాలనాశ్రయించి బ్రతుకుతాడు తిండికి. వానికి అతిశయ స్థితి రావాలంటె దానమె చెయ్యాలి. త్యాగం.

ధనాలలో ఉత్తమమైన ధనం శాస్త్రజ్ఞానం. ధనికులకు నిష్కామ కర్మాచరణం ప్రధానం. లాభాలన్నిటిలో ఆరోగ్యమె మహాలాభం. సుఖాలన్నిటిలోనూ తుష్ఠిగొప్పది. దీనివల్ల ఆరోగ్యం కలుగుతుంది.

ధర్మాలన్నిటిలో దయ కలిగి ఉండటం గొప్పది. వేదోక్తమైన యజ్ఞమె ఎల్లప్పుడూ పుష్కలమై నిండుగా ఉంటుంది. సంతోషం కలగాలంటె మనసును వశం చేసికొనటమె మార్గం. మనసు వికలం కాకుండా ఉండ టానికి గాను సజ్జన మైత్రి చేయాలి.

మానవుడు గర్వం విడిచినట్లయితె ప్రేమాస్పదుడవుతాడు. శోకం పోవా లంటె క్రోధాన్ని త్యజించాలి. ధనవంతుడు కావాలంటే కామాన్ని కోరికను వదలాలి. సుఖాన్ని పొందాలంటె లోభం వదలాలి.

పుణ్యంకోసం బ్రాహ్మణులకు దానాలిస్తారు. భయపడి రాజులకు సమర్పి స్తారు. కీర్తికోసం నటనర్తకాదుల కిస్తారు. ప్రత్యుపకారంకోసం సేవకు లకు దానమిస్తారు. ఇవి సాత్త్విక రాజసిక, రాజసతామసిక, తామసికమైన దానాలు.

జగత్తును అజ్ఞానం ఆవరించి ఉంది. తమోగుణ ప్రధానమవటంచేత అది ఫలాన అని ఎవరికి తెలియటల్లేదు. సామాన్యంగా లోభం పెంచుకొని సన్మిత్రులను వదలివేస్తాడు అజ్ఞాని. స్వార్థం పెంచి స్వర్గం జారవిడుచు కొంటున్నాడు. ఇదె అజ్ఞానం. దానాలు చేస్తాను సరిపోదా అనుకొంటె చాలదు, అజ్ఞానం పోవడానికి జ్ఞానం పొందాలి. నిద్రలో అన్నీ వదిలేశా నంటె ఏం లాభం ! ఆత్యంతికమైన సుఖం ఉండదుగదా! అందుకె జ్ఞానం పొందటం అవసరం.

చచ్చినవాడితో సమానుడెవరంటె దరిద్రుడు. ఇతర్లకు పెట్టలేడుకదా రాజు లేకపోతె రాష్ట్రం నశిస్తుంది అరాచకమై. పితృకర్మలో శ్రోత్రియు లైన బ్రాహ్మణులకు పెట్టాలి. దక్షిణలేని యజ్ఞం నిష్ఫలం.

ఇంతవరకూ లోభాది గుణాలను త్యజించి దానం చేయాలనీ, శమదమాది షట్క సంపత్తిని సంపాదించాలనే చెప్పడమయింది. ఇక జీవ బ్రహ్మైక మెలాగనే విషయంపై యక్షుడు ప్రశ్నలు వేస్తె ధర్మరాజు సమాధానాలు చెప్తున్నాడు. సాధనకు దిక్కు సత్పురుషులు, దిక్ అంటే ఉపదేశికులని అర్థం. జీవబ్రహ్మైక్య సాధనె తరువాతి మెట్టు.

పండితుడెవరంటె ధర్మమెరిగినవాడె. నాస్తికుడు మూర్ఖుడె. కామమంటె జనన మరణ సంస్మరణకు కారణమయేది. వాసనె-కామం. హృదయంలో కలిగె బాధె మత్సరమంటె.

అహంకారమంటె అజ్ఞాన పూర్వకమైన పరిమితిని ఆపాదించుకొనటమె దేహాత్మ బుద్ధి కలిగి తాను గొప్ప అని చాటుకొనటం దంభం. దానంవల్ల కలిగే ఫలం దైవమె. ఇతర్లపై నేరారోపణమె పైశునమంటె.

యదృచ్ఛాలాభ సంతుష్టుడై బ్రతకాలని బోధ.

ధర్మార్థ కామాలు ఒకచోట ఉండాలంటే భార్య విరోధ రహితంగా ఉండి తాను ధర్మకార్యాలు చేస్తుంటె ఉంటవి. ఆమె వ్యతిరేకమయితె అలా ఉండవు.

నరకం ఎవరికి అన్నప్పుడు - బ్రాహ్మణుడైన వానిని భిక్షకు పిలచి లేదన్నవాడు — వేదం ధర్మశాస్త్రం, బ్రాహ్మణులు, దేవతలు శ్రాద్ధం. తర్పణం ఇవి అబద్ధమనేవాడు. డబ్బు ఉంచుకొని, దానం చేసే వీలున్నా లేదని బొంకేవాడూ ఈ ముగ్గురకు అక్షయమైన నరకమె గతి.

ఇంత అయినాక యక్షుడు ఒక ముఖ్యమైన సూటి ప్రశ్నను వేస్తాడు. ఏమనంటె——

యక్ష:- బ్రాహ్మణత్వం దేనివల్ల సిద్ధిస్తుంది? స్వాధ్యాయం వల్లనా? శాస్త్రశ్రవణం వల్లనా? కులం వల్లనా? ఆచారం వల్లనా?

ధర్మరాజు:- కులంగాని, వేదాధ్యయనంగాని, శాస్త్ర పరిజ్ఞానంగాని బ్రాహ్మణత్వానికి కారణాలు కావు. కేవలం ఆచార వ్యవహార శీలములె ప్రధానం. ఆచారం శీలం రక్షింపబడితె బ్రాహ్మణత్వం సురక్షితమవుతుంది. శీలమూ సదాచారమూ నశిస్తె థానే నశించిన వాడవుతున్నాడు. వాటిని రక్షించిన వాడె బ్రాహ్మణత్వం కలిగినవాడు. ఆచరణ లేని జ్ఞానం వ్యర్థం. అయితె జ్ఞానం అక్కర్లేదా అనరాదు. ఆచారాన్ని పాటించేవానికి దానిలోని బోధ అవగతం కాకపోయినా ఇంకొక జ్ఞానికి దాని అర్థం తెలిసి విజ్ఞానం పొందటానికి కారణమవుతుంది. అందువల్ల ఆచరణ అనేది పరమము. జ్ఞానం అక్కర లేదనే మాటలేదు. కాని కేవలం దానివల్ల ఇతడు బ్రాహ్మణత్వం కలవాడన

టం కుదరదు. ఆచరణ ఉండాలి అని బోధ. మనువు కులరీత్యా ఆచరణ ధర్మాలు నిర్ణయించిన కారణమిదె.

అన్నం నీరు ఆకాశం ఇవన్నీ జీవునికిగల అభిమానాలు తప్ప ఇంకేవీ కావు. ఆ అభిమానం నశిస్తే అవి ఉండవు. జీవుడు తాను భగవంతుడేనని ఎరిగిన క్షణాన ఇంకే దృశ్యమూ ఉండదు.

కోరికె విషం. అదె జీవుడు బ్రహ్మ అవడానికి అడ్డుతున్నట్టిది.

శ్రాద్ధం బ్రహ్మవేత్త భోక్తగా దొరికినప్పుడు పెట్టాలి. వాళ్ళె బ్రహ్మ జీవుల సంబంధం తెలియ చెప్పకలిగేవారు.

తపస్సంటె స్వధర్మ తత్పరుడై ఉండటమె. మనో నిగ్రహమె దమం. ద్వంద్వాలు సహించటమె క్షమ. చేయరాని పనులకు దూరంగా ఉండటమె లజ్జ.

జ్ఞానం – పరమార్థ తత్త్వ మెఱుగటమె.

శమం – చిత్తశాంతి కలిగి ఉండటం.

దయ – సర్వులకూ సుఖాన్ని కోరటం.

ఆర్జవం – సమచిత్తం కలిగి ఉండటం.

శత్రువు – క్రోధమె మానవునకు శత్రువు.

వ్యాధి – లోభమె

సాధువు – సమస్త ప్రాణులకు హితము కోరువాడు

అసాధువు – దయలేనివాడు

మోహం – ధర్మం తెలియజాలకపోవటం

మానం – ఆత్మాభిమానమె

ఆలస్యం – ధర్మం పాలించక పోవటమె

శోకం – అజ్ఞానము.

స్థైర్యం – స్వధర్మమందు నిలకడ

ధైర్యం – ఇంద్రియ నిగ్రహం

స్నానం – మానసిక మలములను త్యజించటం

దానం – భూతాలను రక్షించటమె

మధుర భాషికి ప్రేమాస్పదుడుగా అయే లాభం. ఆలోచనాత్మక కర్మనకు కార్యసాధన పొందే లాభం, బహుమిత్రసంతునకు సుఖజీవన లాభం, ధర్మ నిష్ఠునకు సద్గతి లాభం కలుగుతవి.

ఋణం చెయ్యకుండా ఎవరు తన తిండి తాను తినగలుగుతాడో ఎవడు తృప్తికలిగి ఉంటాడో అతడు సుఖి. అనగా వైరాగ్యమె కర్మజ్ఞానోపాసన లకు ఆధారమైన అంతరంగ సాధనము అని బోధ

ప్రతిదినం చచ్చేవారిని చూస్తూనె బ్రతికి యున్నవారు తాము శాశ్వత మన్నట్లు ప్రవర్తించటం ఆశ్చర్యకరమైన సంగతి ప్రపంచంలో.

సరియైన దోవ యేదనగా సిద్ధ పురుషులు ఏదోవను వెళ్తారో అదె. తర్కం లేవదీయకుండా అనుసరించాలి దాన్ని. అదె ఉత్తమం.

అత్యంత ఆశ్చర్యం ఏమంటె పరమేశ్వరుడె, సూర్యచంద్రులై, జీవుడై ప్రపంచమై ఒక ఆటగా దృశింపజేయటమె వింత.

పురుషుడంటె–పురం అనే దేహంలో ఉండెవాడనె అర్థం. కాని శరీరంతో పుణ్యకర్మలు చేసినప్పుడు ఆ పుణ్యకర్మలను గూర్చి మర్త్యలోకంలో గాని స్వర్గలోకంలో గాని ఎంతకాలం చెప్పుకొంటూ ఉంటారో అంతకాలమూ కూడ అతడ్ని పురుషుడనె అంటూ ఉంటారు. ఇందుకు ఇంద్రద్యుమ్నుని కథ తార్కాణము. తరువాత అతడు భూలోకంలో మళ్ళీ పుట్టి నిష్కామ కర్మలుచేసి ముక్తినందగలడు. సకాముకంగా కర్మలుచేస్తె దిగిపోతాడుగాక.

అందరికంటె ధనికుడెవరు అని చివరి ప్రశ్నగా యక్షుడడుగుతాడు. –అందుకు ధర్మరాజు నిశ్శంకతో బ్రహ్మవేత్త అని సమాధానం చెప్తాడు. ఈ ప్రశ్నలన్నీ అడిగింది యమధర్మరాజు. ఆయన యక్షుని రూపంలో అగుపడి యీ వైదాంతికమైన ప్రసంగం ధర్మరాజుతో చేస్తాడు. వేదాంత సాధనె మోక్ష సాధన. వేదాలు చెప్పిన పరమార్థమె వేదాంత శాస్త్రం.

యక్షుడు ధర్మరాజు ఒక్క తమ్ముణ్ణి బ్రతికిస్తాను నీకిష్టమైన వాణ్ణి—వాడెవరో చెప్పమంటాడు. అందుకు ధర్మరాజు నకులుని పేరు చెప్తాడు. దానికి కారణం కుంతి కుమారుల్లో తాను బ్రతికి ఉన్నాడు గనక మాద్రి కుమారుల్లో ఒకడు బ్రతికి ఉండాలని కోరి అలా అడిగినానంటాడు. కాని యక్షుడు అందర్నీ బ్రతికించి ఆశీర్వదిస్తాడు.

ధర్మరాజు ఆ యక్షుని "నీవు యక్షమాత్రుడవు కావని నాకు తెలుస్తోంది.

నీ వెవరు ? చెప్పాల్సింది" అంటాడు. అప్పుడు యమధర్మరాజు.

మత్తకో : నీను ధర్మదఁ జువ్వె రాజకులేంద్ర సత్యము శౌచమున్
దానముం దపమున్ శమంబును దాంతియున్ యశమున్ బరి
జ్ఞాన యుక్తియు నాదు మూర్తులు— సమ్మదంబున నిక్కమ
త్తూను నుత్తమ ధార్మికున్ నిను జూచు వేడుక వచ్చితిన్.

—అంటాడు. నన్నాశ్రయిస్తె ఎవరూ దుర్గతి పొందరు. కనుక ఏదైన వరం కోరవలసింది ఇస్తాను అంటాడు. ధర్మరాజప్పుడు మా ఆశ్రమవాసుడైన బ్రాహ్మణునికి వాని అరణిని ఇవ్వాల్సింది" అని అడుగుతాడు. ఆయన దానిని ప్రసాదించి పైగా— "ఇక పదమూడో యేడు వస్తోంది అజ్ఞాతవాసం నియమానికి ఆ సమయంలో మీరు ఏ ఏ రూపాలలో ఉండదలచుకొన్నారో ఆ యా రూపాలు మీకు ప్రాప్తిస్తవిగాక. మిమ్మలను ఎవ్వరూ ఎఱుగకుండేటట్లు నేను వరమిస్తున్నాను" అని, ఇంకా ఏమైనా కోరుకొనవలసింది ఇస్తాను అంటాడు. అందుకు ధర్మరాజు
నీవున—

న్నాదరించుట జేసి ధన్యుడనైతి నిందకు నెక్కుడొం
డేది కల్గెడు నైన నామది యెల్లనాడును గ్రోధమో
హాదులం బెడబాసి ధర్మమునందు నెక్కొన జేయవే—
— అంటాడు— ధర్మువు ఆశీర్వదిస్తారు.

అరణ్య పర్వంలో ఎన్నో ఆఖ్యానాలు ఎన్నో విశేషాలు ధర్మాలు చెప్ప బడ్డయి. పన్నెండేండ్లపాటు పాండవులు ప్రశాంతతను పొందుతూ తమ

మోక్ష సాధనను చేస్తూ వచ్చారు. నల చరిత్ర రూపకంగా ఎన్నో మోక్ష సాధనా విషయాలు నేర్చుకొన్నారు. అలాగే అన్ని ఉపాఖ్యానాలూ కూడ వారికి బోధకాలె అయినవి. చివరకు యక్షప్రశ్నల ద్వారా ధర్మరాజు తన వేదాంత విషయికమైన జ్ఞానాన్ని సమాధానాల రూపకంగా చెప్పి అందరికంటె గొప్ప వాడు బ్రహ్మవేత్త అని నిశ్చయంగా చెప్తాడు.

అహం బ్రహ్మాస్మి సాధనలో ఇన్ని విషయాలు తెలిసి, సర్వస్వాన్ని 'నేతి' 'నేతి' అని వదలి కేవలం 'నేనే' అనె పదార్థం బ్రహ్మగా తెలియటం అవుతుంది. ఆ బ్రహ్మ సర్వత్రనున్నవాడనేది కూడ తెలియాలి. ఎక్కడ చూచినా అక్కడ బ్రహ్మె అవుపించాలి. అహంకార మమకారాలు అప్పటికి చచ్చిపోతవి. అదె సర్వం ఖల్విదం బ్రహ్మ సాధన. అహంను చంపి, కనీసం తమ పేర్లు చెప్పుకొనక తామెవరో తెలియచెప్పుకొనక విరాట్‌తో ఏకమై మనుతారు పాండవులు అజ్ఞాతవాసంలో. విరాట్ అంటేనే నిర్వృతి తత్త్వమని అర్థం. వ్యాసమహర్షి భారతాన్ని వేదార్థ బృంహిత రచనగా సాధించాలనుకొన్న ఆశయాన్ని ఈ పేరులద్వారా సూచించి భారత రచనద్వారా సాధించగలిగాడనేది మర్చిపోరాని విషయము.

ఇది అరణ్య పర్వము

—: ఓం తత్సత్ :—



గ్రంథకర్త :

## కామరాజుగడ్డ రామచంద్రరావు

తండ్రి పేరు : భాస్కరరావు

తల్లి పేరు : సత్యవతమ్మ

పుట్టిన స్థలం : గుంటూరు జిల్లా రేపల్లె తాలూకా
చోడాయపాలెం గ్రామం

పుట్టిన తేది : 17-7-1923

విద్య : బి. ఏ., బి. యల్.,

ఉద్యోగ విరమణ : 31-7-1978-ఆంధ్రప్రదేశ్ సచివాలయము
"లా" శాఖలో డిప్యూటీ సెక్రటరీగా

నివాస స్థలము : పి. కె. 49 పంజగుట్ట కాలనీ, హైదరాబాదు-500 482.

